ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము.

ఆఱంకముల నాటకము.

గ్రంథకర్త:

కనకతారా, రాధాకృష్ణ, తులాభారము, సతీసక్కుబాయి
మొదలగు పాటలు రచియించిన

**చందాల కేశవదాసుగారు**

ప్రకటనకర్త:

**కురుకూరి సుబ్బారావు,**

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.



1935



[వెల రు 1-0-0.

హరిః

ఓం

## కృతిసమర్పణము.

---

తే. తమ్మరపురనివాసి సీతావధూటి
ప్రాణనాథుఁడు శ్రీరామభద్రమూర్తి
చరణసరసీరుహములకు సాగి మ్రొక్కి
కానుకగనిత్తు మత్కావ్యకన్యఁ బ్రీతి.

# విన్నపము.

సరసాగ్రేసరులారా!

మద్విరచితమగు కనక్తారానాటకప్రదర్శనమును గాంచినప్రేక్షకు లలోఁ గొందఱుసన్మిత్రులు మరియొకనాటకము వ్రాయుమని యెన్నియో సారులుగ నన్నుత్సాహపెట్టిరి. కాని సమర్థతలేనివాఁడగాన నే నాపనికిఁ బూనుకొనలేకపోయితిని. నాయిష్టదైవ మొకరాత్రి బ్రాహ్మణరూపమున స్వప్నమందు సాక్షాత్కరించి నీ వనుత్సాహముతో నుండనక్కరలేదు. "వామనచరిత్రమును" నాటకముగా రచియింపుమని యాజ్ఞ నొసఁగి తిరోహితుండయ్యె. అసమర్థతగల నే నీకార్యభారమును గూర్చి శంకా సంకులచిత్తముతో నున్నను మదిష్టదైవాజ్ఞయే యన్నిఁటికాధారమై నిలచి ధైర్యమును నెలకొల్పి కర్తవ్యమునకుఁ బ్రోత్సహించెను. ఇందలి సర్వభారములు నైజామురాష్ట్రమందున్న నల్లగొండజిల్లా హుజూరునగరు తాలూకాయందలి తమ్మర యనుగ్రామమున నెలకొన్న శ్రీసీతారామ భద్రునివే కావున పెక్కువ్రాఁతల మానుకొని విరమించుచున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
చందాల కేశవదాసు.

# ఈనాటకమునవచ్చు పాత్రలు.



## పురుషులు.

సూత్రధారుఁడు.

మారిషుఁడు.

బలిచక్రవర్తి—కథానాయకుఁడు.

శంబరుఁడు } మంత్రులు
కాలనాభుఁడు }

నముచి—సేనాధిపతి.

శుక్రుఁడు—దనుజగురుఁడు.

ముండకుఁడు—ఒకానొక మందప్రజ్ఞుఁడు.

మాయావి—దనుజసంఘాభిమాని.

ఇంద్రుఁడు—దేవరాజు.

అగ్ని—దిక్పతి.

యముఁడు—దిక్పతి.

వరుణుఁడు—దిక్పతి.

కుబేరుఁడు—దిక్పతి.

బృహస్పతి—దేవగురుఁడు.

వార్తాహరుఁడు—దేవపాక్షికుఁడు.

గంధర్వుఁడు—మాయావి మారువేసము.

1 వ రాక్షసుఁడు—దనుజరహస్య రక్షకభటవేషధారి.

క్రోడకుఁడు—దనుజరక్షకభటవేషధారి.

కశ్యపుఁడు—దేవేంద్రుని తండ్రి. ప్రజాపతి.

తిమ్మంభొట్లు—బ్రాహ్మణుఁడు.

పేరిశాస్త్రి—బ్రాహ్మణుఁడు.

విష్ణువు—వైకుంఠనాథుఁడు.

వామనుఁడు—విష్ణుని యవతారము.

1, 2, 3, 4 బాలురు—వామనుని చెలికాండ్రు.

ఘోరశర్మ—పూజారి. ఆడంగివాఁడు,

దేవాంతకుఁడు—రక్షకభటాధికారి.

బ్రహ్మ—చతుర్ముఖుఁడు సత్యలోకపతి.

రుద్రుఁడు—కైలాసపతి.

నారదుఁడు—దేవఋషి.

ప్రహ్లాదుఁడు—విష్ణుభక్తాగ్రేసరుఁడు. బలిచక్రవర్తి తాత.

దూత—విష్ణుదూత.

ఇంకను సమయానుకూలముగా దేవ దానవ భటులు వత్తురు.

స్త్రీ లు.

నటి.

అదితిదేవి—ఇంద్రునితల్లి. దేవమాత.

వింధ్యావళి—బలిచక్రవర్తి పట్టపుదేవి.

విషదంతి—ముండకుని పెండ్లాము.



శ్రీ

# బలిబంధనము.



ప్రస్తావన.

## నాంది.

శా. శ్రీకల్యాణగుణాన్వితాధికసుఖశ్రేయానవద్యాంఘ్రి లీ
లాకాంక్షప్రకటప్రభావనటనోల్లాసప్రధానాఢ్యుఁ డ
స్తోకప్రాభవధర్మరక్షణవిలాసుం డంతరాత్ముండు సీ
తాకాంతుండఖిలార్థసిద్ధు లిడి యత్యంతంబు మి మ్మోముతన్.

[నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి]

సూత్ర—ఆహా! నేఁటినాభాగ్యమహిమ యింతయన నలవికానిది-

తే. గీ. సకలవైదికలౌకికాచరణనిపుణ
మతులు సరసు లీసభికులమనము లలర
సేవఁజేసి ధన్యతఁ గాంచు జీవితంబు
గాన నెన్న మద్భాగ్యంబు ఘనతరంబు.

(తెరవంకఁజూచి) మారిషా! నీ విటు లొకసారి రాఁగలవా?

[మారిష ప్రవేశము.]

మారిష—బావగారు నేఁడు మహానందమున నున్నటులున్నారు. కారణ మడుగవచ్చునా?

సూత్ర—అడిగి తెలుసుకొందువా? ఇంతవఱకును దెలిసికొనలేదా?

మారిష—చెప్పకయే తెలిసికొనుట ప్రాకృతుఁడనగు నాకసాధ్యము గాదా?

సూత్ర—పండితసేవచేఁ గృతార్థుఁడవగు నీ విట్లనుట నీసుగుణవిశేషము బయల్పడుచున్నయది.

మారిష—అందులకు మీపెద్దల యాశీర్వాదమే యాధారము.

సూత్ర—నిజము. పెద్దలసేవయే యంతరంగవికాసమున కాధారము. అది యెవరికి లేదో వారియంతరంగము లంధకారబంధురము లగును.

మారిష—తెలిసినవార మని యనుకొనువారుగూడ నీపరమధర్మము నాచరణలో నుంచుకొన రేమికారణమో ?

సూత్ర—అదియే భగవన్మాయామహిమము. చెప్పెడి దొకటి, చేయు నది మఱొకటి. కావుననే మాయామయులై కర్మబద్ధు లగు చున్నారు.

మారిష—వారి నెటుల మనము గనిపట్టఁగలము ?

సూత్ర—మనము నిజముచెప్పినపుడు - నిజమను నమ్మకము గలుఁగక అబద్ధముగ భావించువారే కాదా ?

మారిష—అట్టివా రీకాలమున మిక్కిలిగ నున్నారుసుమండీ ?

సూత్ర—మరికాదా ? నిజమును నిజమని గ్రహించువారు నూటి కొక రైన నుందురో - యుండరో యని యన్నను లోపములేదు.

మారిష—నిజముసుమా! ఎంతటికాలవైపరీత్యము తటస్థించినది బావా?

సూత్ర—అనునట్లున్నదా ? భగవానుఁడగు వ్యాసమహర్షి విరచితధర్మ ప్రదర్శకచారిత్ర్యగాథలనే తప్పులనుచుండ సామాన్యకాల మని యె ట్లనవచ్చును ?

మారిష—అవును మరచితి. మనపురాణగాథలలోఁ జాలవఱకుఁ బర స్పరవిరుద్ధము లుండును అని లోకు లందురే ?

సూత్ర—అందుననే సత్యాన్వేషకు లగుపెద్దలు చాలవఱకుఁ జింతిల్లు చున్నారు. వికాసాంతరంగశూన్యుల కట్లే యుండును.

మారిష—అంతరంగవికాస మెట్టివారికి గలుగునంటిరి ?

సూత్ర—అనుభవజ్ఞు లగుపెద్దలవలన సత్యాసత్యరూపకశ్రవణ మొనర్చి మననపూర్వకముగ మథించి-నిధిధ్యాసలో నిత్యమగుసత్యమును గ్రహించి - అట్టిసత్యమును మరువక నమ్మి జ్ఞాపక ముంచుకొని - తనహృదయమం దెన్నఁడుగాని యసత్యమునకుఁ దా వీయక - నిర్మలమగు చిత్తముతో నెవరుందురో - వారికే యంతరంగ వికాస ముండును. తదితరులకు లేకుండును. మఱియొకముఖ్య మగు గురుతున్నది చూడు. తనలో నిజమను వస్తువు నెవ్వఁ డుంచుకొని ప్రేమింపఁడో వాని కేవస్తువునందలి నిజమును దోప దు. తోఁచినను నమ్మక ముండదు.

మారిష—సత్యము. న న్నేల పిలిచితిరి ?

సూత్ర—ఏదీ చెప్పుట కవకాశ మిచ్చినావా ? నేఁ బిలిచినకార్యసంబం ధనుగూడ మనయీప్రశంస కుదాహరణముగా నుండునదియే లెమ్ము.

మారిష—అటులైనచో మఱియు మంచిదేకదా ?

సూత్ర—మనసాంఘికులచే నొకక్రొత్తనాటకప్రదర్శనము గావింపనెంచి నిన్ను బిలిచితి.

మారిష—ఏక్రొత్తనాటక మది ?

సూత్ర—బలిబంధనము.

మారిష—(స్మృతినభినయించి) అనఁగా వామనచరిత్రముగాదా ?

సూత్ర—అవును.

మారిష—అది క్రొత్తనాటక మెట్లగును ? పౌరాణికము గాదా ?

సూత్ర—చరిత్రము క్రొత్తది కాకున్నను, మనసాంఘికులు ప్రదర్శించు టయైనఁ గ్రొత్తఁగఁ గాకుండునా ?

మారిష—అగునుగాని, యిందేమివిశేషముగు నీతి కలదు. పైగా కథ యంతయును శంకాసంకులమే గదా ?

సూత్ర—అందుననే మనము విధిగాఁ బ్రదర్శింపవలసియున్నది.

మారిష—సరేకాని బావా! సత్యవ్రతుఁడగు బలిని పరిభవింప భగవంతుఁ డవతరించినాఁడేమి? అతఁ డేమిధర్మద్రోహ మొనర్చినాఁడనియో ?

సూత్ర—తినఁబోవుచు రుచి నడుగనేల. నీశంకలెల్ల నీప్రదర్శనమున నభావము కాఁగలవు లెమ్ము. త్వరగాఁ బ్రారంభింపఁజేయుము.

మారిష—కృతికర్తపేరు జెప్పవైతివేమి ?

సూత్ర—ఇది మనకు సనాతనధర్మము గాన వినుము.

తే. గీ. చిత్తశుద్ధి భాషాసేవ జేయలేక
గాని, సుజనకృపాప్రాప్తిఁ గన్నవాఁడు
కవి, కనక్తారనాటకగ్రంథకర్త
తనరు చందాలకేశవదాసుఁడనఁగ.

మారిష—ఓహో! అటులైన మన కితఁడు చిరపరిచితుఁడే ?

సూత్ర—అగును. కవికి స్వప్నమం దిష్టదైవము సాక్షాత్కరించి వామన చరిత్రమును నాటకముగ రచియింపు మని యాజ్ఞ నీయ "బలిబంధనము" అనునామకరణ మొనర్చి వ్రాసినటు లాకవియే నాయీవాగ్రూపమున మనవిఁజేసికొనుచున్నాఁడు గావున ప్రదర్శనానంతరమునగాని నిజమును విమర్శింప వలనుపడదు.

మారిష—చిత్తము. నే నిఁక నిష్క్రమింతును.

సూత్ర—మఱచితివా? ఇ దేఋతువు ?

మారిష—ఓహో ఋతుగాన మున్నదికాదా ? ఇది శిశిరర్తుకాలము కాదా ? (యోచించి) ఆహా! సుసమయము. సుజ్ఞానదాయకము.

తే. గీ. ఉన్నతము నిల్వఁబోదన్న కై చెన్నుఁదోఁచు
నవని నశ్వత్థనింబపర్ణాళిరాల,
లేమికూడ నిల్కడలేని కై లీలఁదోఁచు
మావులను జూడ శిశిరర్తుకమహిమకతన.

సూత్ర—అగును. బలీంద్రాదుల నీచమహోన్నతులకువలెనే యీ శిశిరఋతువు సృష్టినైజమును బ్రదర్శింపుచున్నది.

(తెరలో)

ఓరోరిపండితమ్మన్యా! బలీంద్రునినీచోన్నతులఁబేర్కొనెదవా? జాగ్రత్త.

సూత్ర—సేనాని నముచివలె నున్నాఁడు. ఇటనుండరాదు. రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది—ప్రస్తావనము.



ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము.

## ప్రథమాంకము.



### 1 వ రంగము.

బలి సభామంటపము - పశ్చిమాచలము.

[బలి, నముచి, శంబర, కాలనాభాదిరాక్షసులు ప్రవేశము.]

బలి—మత్ప్రాణసన్నిభులగు నోసాంఘికులారా !

ఉ. తీరెను తొల్తనుండి పలుకేతీరులనేపెడికోర్కి, దేవతా
వారము రూపుమాపుతరి కే వచ్చె, నవక్రపరాక్రమంబుల
స్మీరలు మీరి, నాకము నకనిర్జరముం బొనరించి పేరుఁదేఁ
గోరుఁడు సర్వసేనఁ బురి కే కొల్పి విజృంభ మొనర్పుఁడుద్ధతిన్.

నము—బలపరాక్రమసంపన్నులగు బలిసార్వభౌమునిబంధనముల కెన్నఁ
డేనిఁ బ్రతిహత ముండునా ? సర్వసిద్ధముగ నున్నాము.

శంబ—తథాస్తు. ఆహా ! నేఁటికిమేము ధన్యులము గాఁబోవుచున్నాము.
దుష్కాలముకలిమినిఁ గొరమాలినదేవతాధములకు లొంగిలొంగి,
గిరివనగుహాలలోఁ డాగి, పేరుఁబెంపు మాసి జీవచ్ఛవములమై
పడరానియిడుమలఁ బడితిమి. ఇఁక నైన దైవము మాకుఁ దోడ్పడు
గాక.

కాల——(ఆశ్చర్యముతో) ఆహా ! శంబరా ! ఇంకను శంకించుచున్నావా? నిగ్రహానుగ్రహసమర్థులును, సర్వజ్ఞులును, భగవానులు నగు శుక్రగురువరిష్ఠుల దయారసలేశము మనపైఁ బ్రసరించినది. మన యదృష్టము ఫలించినది.

బలి——(తనలో) సత్యము. సత్యము. (ప్రకాశముగ) కాలనాభా ! ఆ మహామహునకు మనయెడల నెన్నఁడుగాని వేరుచూపు కలదా? దయామయులైన మనయాచార్యోత్తముని వాత్సల్యప్రభావము ననే, మన మింతటివృద్ధికి రాఁగలిగినాము.

శంబ——ఇందు న నొకసంశయము బాధించుచున్నది గాన క్షమించి తీర్పవలయు. గురువరున కెల్లపు డేకరీతి మనయెడ నిష్కళంక మైన దయయే యున్నచో, నడుమనడుమ నిట్టిడుమ లేల వాటిల్లుచున్నవి ? తలఁచుకొన్న వారికిఁ దరముగాని దేమున్నది?

బలి——(నవ్వుచు) వెఱ్ఱివాఁడా! ఇటులనుచున్నావేమి? మనకర్మమునకు వా రేమిచేయఁగలరు ? తప్పక మనమే యనుభవించి తీర వలయును.

తే. గీ. కష్టసుఖములు ప్రారబ్ధగరిమచేతఁ
గలుగుఁదోలఁగును ప్రాణికోటులకటంచు
విజ్ఞులగుపెద్ద లనుచుండ రె వినవొ తప్పఁ
బో వెవరికి దివారాత్రములనువోలి.

శంబ——(ఆశ్చర్యముతో) ఇది యింకను విచిత్రముగ నున్నది. చూడుఁడు. ప్రారబ్ధముచేతనే కలుగుకష్టసుఖముల కిఁక శుక్రాచార్యుల వారియనుగ్రహ మే మవసరము ? ప్రయత్నములుమాత్ర మే మవసరము ?

కాల——(వారింపుచు) శంబరా ! వేదాంతవితర్కముల కిది సమయము గాదు. విశ్రాంతిమీఁద విచారించుకొందము.

బలి—(వారింపుచు) కానిమ్ము. కాలనాభా! నీవు కొంచె మట్లూర కుండుము. (శంబరునితో) శంబరమంత్రీ! వినుము.

శంబ—చిత్తము. సెలవిండు. నాకెవ్వరుగూడ దీనికి సరియైనయుత్తరము నీయలేదు.

బలి—నేనుమాత్ర మంతటిసర్వజ్ఞుఁడను కాను గాని, త్రోసివేయు టుచితము గాదని తోఁచినంతవఱ కెఱిఁగించెదను.

శంబ—చిత్తము.

బలి—ఒకని నిగ్రహానుగ్రహములకుమాత్రమే కాదు. సర్వకార్యములకు, తత్ఫలాఫలములకు, వేయేల, సమస్తమునకును ప్రారబ్ధమే కారణ మనక వీలులేదు.

శంబ—సరి. బాగున్నది కాని, అసలు ప్రారబ్ధ మనఁగనేమి?

బలి—కర్మము, భాగధేయము, దైవము, విధి, మొదలగునర్థములున్నవి కాని, జన్మసిద్ధమైనయర్థముమాత్రము "సంకల్పమే" అని చెప్పవలెను.

శంబ—సంకల్పమున కేమిస్థితిగతులు? దానిరూప మెట్టిది?

బలి—మాయామేయమై - యీశ్వరాధీనమై - ఆక్రమించి దేహిని భ్రమింపఁజేయునది.

శంబ—(పైకిఁజూచుచు యోచించి) ఏదోగాఁడవగమాత్ర మున్నది. కాని చక్కఁగ తలకెక్కుట లేదు. మహాప్రభూ! సంకల్పమనఁగ మీముఖ్యభావమేమో తేల్చి సెలవిండు.

బలి—కోరిక.

కాల—ఇఁక నైనఁదెలిసినదా?

నము—తలకెక్కినదా?

శంబ—(యోజింపుచు) ఏమీ? దేహికి కోరిక స్వాధీనమైనదికాదా?

బలి—కాదు. అగునేమో విచారింపుము.

శంబ—(స్మృతినభినయింపుచు) ఆఁ - కావచ్చును. దూరదృష్టికిఁ బొడ కట్టుచున్నట్లున్నది.

బలి—నిజము, శంబరా! నిజము. ఇక్కడికైన మనము ధన్యులమే! మనమందఱము సంఘమును సంస్కారము జేసికొని సత్యవ్రత దీక్షాబద్ధుల మైనాము గాన, తత్ప్రభావలవలేశము మాయాంధ కారబంధురమగు మనదృష్టుల కంజనప్రాయమై కొలదిదూర మున నైన సత్యమును సత్యముగఁ గనిపింపించినందుల కెంతయు నానందించుచున్నాను.

శంబ—చిత్తము. ఇది నిజమే. సత్యసిద్ధియే సర్వవశ్యమని శ్రీమత్పరమ భాగవతశిఖామణులగు మీతాతగారు సెలవీయ వినినాను. కాని సత్యవ్రతము సిద్ధించునంతటిధన్యతములమే కావలయును.

బలి—దానికి సత్పురుషాశీర్వాదమే సాధనము.

శంబ—(స్మృతినభినయించి) మఱచితి, మహాప్రభూ! అస్వాధీనమైన సంకల్ప ముదయింప దానికి భ్రమించి తా నందుకు కర్తనను కొని ధర్మాధర్మము లాచరించుటచేతనే సుఖదుఃఖరూపమగు కర్మపాశములకు దేహి బద్ధుఁడగుచున్నాఁ డనికదా దేవరవారి యభిప్రాయము?

బలి—నిశ్చయము. నాయభిప్రాయమేనా? అనుభవజ్ఞులయభిప్రాయ మును, సర్వశాస్త్రాభిప్రాయమునుఁ గూడ నిదియే! చూడు. శంబరసచివోత్తమా! కుశాగ్రబుద్ధితో నిందలిసత్యమును జాగ్ర తగ గమనించి సంకల్పపరంపరలం దేమాత్రము లక్ష్యముంచక యుదాశీనభావముతో నీశ్వరమహిమ కానందము నొందుచుండు టే దేహికి నిక్కమైనబాట.

శంబ—సంకల్పమున కుదాసీనుఁడగుటకుమాత్రము దేహి స్వతంత్రుఁ డగునా? అట్టియధికార మున్నదా?

బలి—ఉన్నది-యున్నది. దేహి కిదియొక్కటే భగవంతుఁ డనుగ్రహించిన యధికారము గాని మరియొకటి లేదు. దీనినే సత్యసిద్ధి, యోగసిద్ధి, శాస్త్రసారము, దేవరహస్యము నని పెద్ద లనుచుందురు.

(అందఱు కరతాళధ్వనులఁ జేయుచు దేశమాతనుఁగూర్చి జయజయధ్వానము లొనర్తురు.)

నము—(సంభ్రమమున) కర్తవ్యము వెనుకంజ—

బలి—లేదు. లేదు. శంబరా! మనసుకృతస్వరూపులగు శుక్రాచార్యుల వారి దయామహిమమే యింతకు మూలకందము.

నము—ఆహా! తప్పక. శంబరా! సార్వభౌములు సెలవిచ్చినట్లు సత్పురుషశ్రేష్ఠతములగు మనయాచార్యోత్తముల కటాక్షవీక్షణమే మనపై లేనినాఁడు మన బలపరాక్రమములును ధైర్యసాహసాదులును గుడ్డిగవ్వకైనఁ బనికిరావు. చివర కొక యడుగైన నిడలేము. మనవంశముపై పూర్ణాభిమానము గల యామహామహుని సంకల్పబలమే మనల నింతటి యుచ్చస్థితికిఁ దీసికొని వచ్చుచున్నది. లేనిచో మనమెంతటివారము, మనశక్తి యెంతటిది.

బలి—(తనలో) నముచిబుద్ధికుశలత మెచ్చఁ దగినది.

కాల—బలే. బలే. మిత్రమా! సేనానీ! భక్తు లందఱిపక్షమున సత్యమైన నీహృదయమునకు వినయపూర్వకవందనము లర్పించుచున్నాను.

శంబ—(యోజించి తలపంకింపుచు) ఆహా! నిజ మనక వీలులేదని చెప్పవచ్చును.

కాల—చెప్పవచ్చునా?

బలి—మంత్రీ! యింకను—

నము—(అర్ధోక్తిలో) శంబరమంత్రీ! నీవిందు విచారించునదేది? చూడు-

సీ. మనతోడ నెన్నెన్ని మారులో సురలోడి
గతిలేక హరినిసంస్తుతు లొనర్చి
చివరకుఁబీయూష సేవనమిష చేత
మన తెల్వితేటలు మప్పి యుదధి
మథియించిసుధను సమగ్రంబుగా విష్ణు
మాయాప్రభావ సంధాయకమున
వారలే మెసవి తీవ్రప్రతాపోద్ధతిఁ
జూపి మనందఱి స్రుక్కఁజేసి

తే. గీ. ఉత్సహించెడి యమరుల యుచ్చదశను
జూచి మన నీచదశలను జూచి శిష్య
వత్సలుఁడు శుక్రసద్గురువరుఁడొకింత
కనికరించె లేక మనము మనఁగఁగలమె.

బలి—నిజము. నిజము. నముచీ! నీవాక్యము లెంతయుఁ బూజ్యతరములై యొప్పుచున్నవి. ఆయమృతసేవనదినమాది పనికిమాలిన దేవతల కెంతటి గర్వము! యెంతటివిక్రమము! (నిట్టూర్పువిడిచి) అబ్బా! తలఁపున కాసంగతులు వచ్చినంతనే దండతాడితభుజంగమువలె క్రోధ ముద్రేకించి తీంద్రించును గదా. (ఒకవైపుదృష్టి సారించి) ఓరీ వాసవహతకా! మీపక్షమున నాఁడు సాయపడినరమాకాంతునియనుగ్రహము నేఁడు గూడ యున్నదని మిట్టిపడకుసుమా? నీయాటల కంతము వచ్చినది. చూడు - నీకాయువు మూడినది. కడుపారఁగ్రోలిన యమృత మిఁక నీ ప్రాణముల నెట్లుగాఁచెడినో చూచెదను. దేవపక్షపాతి యను బిరుదొందిన శ్రీవత్సుం డెట్లు చక్రముబట్టునో తెలిసికొన వేగిర పడుచున్నాను.

మ. జనసమ్మాన్యు, నమాయకు, న్బరమవిశ్వాసున్మహాశౌర్యధై
ర్యనిధి, న్వీరు, విధేయు, వంశజు, నను న్వంచించి నాఁ డాసుధన్
గొని నిర్జించిన మేటిపాపము మహాఘోరాగ్నియై నిన్ను నీ
ఘనసైన్యంబును భస్మసాత్కృతముగాఁ గావింపకేట్లారెడిన్.

కాల—దేవవారిని పరాభవించి నిర్జించు ప్రజ్ఞావంతుఁ డాయింద్రహతకుఁడేనా? కాదు. మహాప్రభూ! అంతటి బలము వానికి లేదు. తా మాయమృతసేవనమునాఁటియుద్ధమున, సమస్తదేవనికాయంబుల స్వమాయాబద్ధులంజేయ నంపుఁ జిక్కుకొని బ్రతుకుతెరవు గానక, యమృతమునందలి విశ్వాసగౌరవము లంతరింప వారికి నిరంతరాభయదాయకుఁ డగు నారాయణుని శరణువేడి తత్సహాయ్యంబున నింతటి గండరగండలైరి. విష్ణుఁ డపుడాపాడు దేవతలకు సాహాయ్యపడకున్న నీ,ఇంద్రాదు లింతకాలము బ్రదుకఁగలరా? ఇప్పటి కెన్నియో సంవత్సరశ్రాద్ధములు గడువకుండునా? నేఁ దమకు విన్నవింపవలసినపనిలేదు. కాని - తా మేలకో విష్ణునిపైఁ జేయివేయకున్నారు. మనవంశవృక్షనిర్మూలనమున కా నారాయణుఁడే వేరుపురుగువంటివాఁడని నా తలంపు. అతనిఁ జాటుఁజేసికొనియే గాలిలోని గడ్డిపోచలవలె దేవత లిట్లు మిట్టి మిట్టి పడుచున్నారు.

నము—(స్వగతము) కాలనాభుఁడు ప్రభునకు మోమోటఁబడక నిజము బలుకుచున్నాఁడు. (ప్రకాశముగ) మిత్రమా! కాలనాభా! నీ మాటలు నిక్కువములే కాని- విష్ణు నెదిరింపకుంటకుఁ దగు కారణ మేదేని యుండకపో దనుకొనియెదను.

శంబ—కారణ మేమున్నది. భాగవతాగ్రగణ్యులని ప్రశస్తిఁగాంచిన ప్రహ్లాదులవారిపౌత్రు లగుటచేతనేమో యని నే ననుకొనుచున్నాను.

బలి—సమర్థులును, సహచరులును నగు మీరు నామనం బెఱుఁగకపో లేదు గాని- వినుఁడు.

తే. గీ. సత్య ధర్మ దయావ్రతాసక్తమతులు
పరమవైరాగ్య భాగ్యవైభవనిరతులు
సచ్చిదానందమయలక్ష్యసౌఖ్యనిధులు
బ్రాహ్మణులు వారియెడ హరి పక్షపాతి.

పరహృదయము లప్రత్యక్షములు గావున- సృష్టిలో నేప్రాణిహృదయ మెంత నిర్మలమైనదియో మన మెట్లు గనిపట్టఁగలము ? అసుర గుణముల కాతఁడత్యంతవిరోధి యనక తప్పనిసరి. అట్లగుట చేతనే కదా మన మాసురగుణముల వర్జించి కల్యాణగుణములని యు, భగవదిష్టములనియు, శాస్త్రములు వచించు సత్యవ్రతాది బంధబద్ధులమైతిమి. సర్వేశ్వరసంకల్ప మత్యద్భుతము. అవాఙ్మా నసగోచరము. సాక్షియై, యంతర్యామి యను గొప్ప బిరుదు వహించిననిర్వికారుఁడు తప్పునడుచునా? నడువఁడు. మనదేతప్పు. (లెంపలువేసికొనుచు) ఆతని మహామహిమమును లవలేశమైన గ్రహించుటకు గొప్పయోగ్యత కావలయును గాని సామాన్యు లకు మనబోంట్లకు తరముగాదు. ఇంతకు శ్రీహరినిఁ గూర్చి యిదమిత్థమని చెప్పుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఆతఁడు స్వతంత్రుఁడు. అప్రమేయుఁడు. నిత్యసత్యస్వరూపుఁడు. నిరంకుశ ప్రతిభాభాసమానుఁడు. గాన—

తే. గీ. కర్మనామకసూత్రసంగ్రహ మొనర్చి
వచ్చెనా కృప, తిమ్మిని బ్రహ్మిఁ జేయుఁ
దీరెనా కృప, బ్రహ్మినిఁ దిమ్మిఁ జేయు
నీశ్వరేచ్ఛ మరల్పఁగ నెవ్వఁడోపు.

ఎట్టివారుగాని భగవదిచ్ఛను గ్రహింపలేరని నేను స్పష్టముగఁ జెప్పఁ గలను. నే నాతనిపై నిఁకఁ జేయివేయుట కెట్లు సాధ్యమని తలంపఁగలవు.

శంబ—అబ్బా - నాకేమో గొడవగ నున్నదండీ. ప్రారబ్ధ మెక్కువయో, యీశ్వరేచ్ఛ యెక్కువయో, సత్పురుషాశీర్వాద మెక్కువయో, తోఁచక చిత్తము లోలోనఁ బెనుచుకొని ముప్పిరి త్రాడువలెఁ గనఁబడుచు విడిబడుచు విసుగుచున్నది.

కాల—శంబరా! మిన్నకుండుము. ఇంకను జెప్పుచుండఁగనే యడ్డు వచ్చెదవేమి ?

బలి—(కాలనాభుని వారించుచు) నీ వట్లుండుము (శంబరునితో) శంబరా! సత్యము సరిగ సిద్ధింపనికారణమే కాని నీకుఁ గొవడగానుంటకు వేరొకకారణము లేదనుకొందును. కాని, వినుము. సత్యమైన యీశ్వరసంకల్పపరంపరను దేహి దురభిమానముతో దనదిగా నెంచి గర్వించి చేసిన సుకర్మదుష్కర్మఫలానుభవమే ప్రారబ్ధ మనఁబడును. అనఁగా ఒకనిసొత్తునుదొంగిలించినవాఁడు శిక్షకెట్ల ర్హుండో యట్లు. మఱియు నట్టి ప్రారబ్ధము ననుభవింపఁజేయు కాలవస్తురూపము లీశ్వరేచ్ఛానిర్మితములు గానఁ దత్ప్రారబ్ధా నుభవమీశ్వరేచ్ఛయనఁబడును. వెండియు, అట్టి యీశ్వరేచ్ఛా సముదాయమును నిరూపించుట కాదర్శప్రాయములే వేదశాస్త్రములు. వేదశాస్త్రాదిసమస్తచరాచరాత్మకసృష్టినెల్లఁ దన యాజ్ఞలో నుంచుకొనువాఁ డీశ్వరుఁడనఁబడును. అట్టి సర్వేశ్వరున కాలయప్రాయముగ హృదయము నర్పించి భక్తి యను పాశముల నతని నందు బంధించి యానందించువారు సత్పురుషు లనఁబడుదురు. గాన శంబరా ! నీవడిగినవారిలో నెవ రెక్కువో యోజించికొనుము.

శంబ—చిత్తము. ధన్యోస్మి. ధన్యోస్మి. నేఁ డెంతటి సుదినము.

నము—మఱికాదా నేఁ డన్నివిధములను సుదినమే.

కాల—సరే; ఇఁక నిందిరారమణుఁడు మనకు సాధ్యుఁడు గానివాఁడే కదా ?

బలి—మనకేనా ?

ఉ. మా ప్రపితామహాదులు రమామాధవుతోడ విరోధమూని తా
రప్రతిమానఘోరతపమున్ ధృతదీక్ష నొనర్చి దుర్లభ
ప్రప్రథితంబులైన వరవర్గము బ్రహ్మయొసంగఁ బొంది మృ
త్యుప్రియులైరి గాని హరి నోర్చి జయంబునుగాంచగల్గిరే.

అంతటి మహామహులగు హిరణ్యాక్షహిరణ్యకశిపులగు మా ముత్తాత లంతటివారే అటులైనప్పుడు మనమనఁగ నెంతటివారము, మనశక్తి యెంతటిది, కాని, జగత్సృష్టిస్థితిలయహేతుభూతుండగు వైకుంఠునితో విరోధింపఁగూడదని నా యభిప్రాయము. సకలశ్రేయోదాయకమగు నొక యుపాయము సత్పురుషులవలన వినినవాఁడఁ గాన నదియే ముఖ్యమగు కర్తవ్యమైనది.

శంబ—ఏదది ?

బలి—శ్రీహరి కేయేమార్గము లిష్టములో మన మామార్గములనే యవలంబించి జాగ్రతగ నడచుచుండుట ! మఱియొక రహస్య మున్నది చిత్తశుద్ధిగ నందఱు వినుఁడు.

అందఱు—చిత్తము.

బలి—సచరాచరజీవకోటి కాధారమగు భూమ్యాదిసకలలోకముల కేది యాధారమో ! సర్వేశ్వరు నుద్బోధించుటకును, సందర్శించుటకును, సంస్తుతించుటకు నే పవిత్రాక్షరశబ్దమాధారమో, బ్రహ్మానందసుఖసంధాన మొనర్చుట కేమహావ్రత మాధారమో అట్టి

నిష్కళంకమైన సత్యవ్రతమును హృదయమునఁ గఠినదీక్షగ నెలకొల్పుకొని తదాచరణమం దప్రమత్తులమైయున్నఁ జాలును.

కాల—దాన నే మగును?

బలి—తప్పక శ్రీవరుఁడు మనకు వశుఁడై తీరును.

శంబ—నమ్మకమేమి ?

బలి—త్రికరణశుద్ధిగా నాకు నమ్మకము.

శంబ—ఎట్లు ?

బలి—సత్యసిద్ధిగల్గిన సత్పురుషప్రసంగశ్రవణమునను బహుకాలమన నమహాత్వమునను.

శంబ—ఇంతమాత్రమున నమ్మకము స్థిరపడునా ?

బలి—తినఁబోవుచు రుచినడుగనేల ? మీారును నాయనుచరులే కాన కానున్న కార్యసిద్ధి ముందు మనకు స్వానుభవమునఁ గాన వచ్చునుగదా ?

శంబ—అటులైన మనమిప్పుడు దేవతలపైకి దాడి వెడలనున్నాము. దేవతలంద ఱాహరికి మిక్కిలి ప్రేమాస్పదులు. దేవతల యరికాలునఁ గించిత్తుముల్లునాటినను ఆనారాయణుఁడొడలెల్ల గశలుఁగ్రుచ్చికొనినట్లు తల్లడిల్లుచుండును. అట్టి పరమాభిమానియైన వనజాక్షుఁడు మనమిపుడేగి చేయుదేవతాపరాభవము సహించునా ! సహింపఁడు. క్షమింపఁడు. (స్మృతినభినయించి) అమ్మయ్యో ? సహించుటయే? ఆనాఁడు మనందఱి మోసగించి దేవతల కమృతముఁబోసినతఱి నిర్జరులకు మనకు జరిగినఘోరసంగ్రామమున భవన్మాయాబద్ధులైన యమరులు ప్రాణావశిష్టులైరని గరుడవాహనారూఢుఁడై తగుదునమ్మాయని పిలువనిపేరంటముగవచ్చి మన శూరులనెందఱిఁ దన చక్రధారఁబరిమార్పలేదు. అయ్యో

య్యా! మీకందఱకాసంగతులు మరపునకువచ్చెనేమో కాని నామమాత్రము తలఁచికొన్నపుడెల్లను యరికాలిమంట నెత్తి కెక్కుచునే యున్నది.

నము—ఇది మాత్రము నిశ్చయమే! ఆనాఁడు నారాయణుఁ డడ్డు పడనిచో నమరులు నామావశేషులై బహుకాలము గతించి యుండును.

కాల—ఆయమరులుండనీ మండనీ మఱేమైననఁగానీ ఘటించినపరాభ వమో! శివశివా! అంతటిదురవస్థ పగవారలకైన రావచ్చునా? మనముగావున కాలానుసారముగ మొండిప్రాణముల నిలుపు కొని దినములఁ గడుపుకొనుచున్నాముగాని—

బలి—సరే వెనుకటివలె మఱల నిపుడుగూడ శ్రీహరి దేవతలకు సాయ పడునందురా?

అందఱు—నిశ్చయముగ, తప్పక ముమ్మాటికి.

బలి—తప్పు తప్పు. ఆతఁడిప్పుడు రాఁడు. అట్లువచ్చుట కవకాశము లేదు. చూతుముగదా త్వరపడనేల—

శంబ—ఏల రాఁడు—

బలి—ఎట్లు రాఁగలఁడు? అతనికి ప్రియమగువర్తనము మన మవలంబిం చితిమిగదా?

శంబ—నా కివియన్నియుఁ దెలియవు. ఒకవేళవచ్చినచో నెట్లు?

బలి—వచ్చినచో నని యడుగుచున్నావా? వచ్చినచో మనకు యుద్ధ ములతోఁ బనియే లేదు. అడుగవలసినమాటలు రెండుమూఁడడిగి యటుపైనిఁ జేయవలసినిపనిఁ దగునట్లు సేయుదుము.

శంబ—ఆపని యేదని యడుగవచ్చునా?

బలి—పని లేదుకాని అదియు మీరెల్ల రెఱిఁగినదియే.

శంబ—నాబుద్ధి కసలే తోఁచుటలేదు సరికదా; నముచికాలనాభాకులుఁ గూడ గ్రహించినట్లు కనుపించుటలేదు.

నము& కాల—నిజమే మహాప్రభూ! దేవరవారి యాశయమమాత్రము గూఢముగ నున్నది.

బలి—ఏమంతగూఢము గాని, వినుఁడు. దేవతలు మనకు దాయాదులు. వారితో మనము భాగమునకై పోరుటధర్మవిహితమే. కాని విరుద్ధముగాదుగదా! మఱియు తన కత్యంతప్రియమైన సత్యవ్రతులము, ధర్మరతులము, బ్రాహ్మణహితులము, అసురగుణదూరులమైన వారము. ఇంకను సర్వవిధములఁ దన భక్తకోటిలోనివారమును తన కేయపరాధమునుఁ జేయనివారమును. ఇట్టి మనపై నతఁడేల వైరమూనును.

శంబ—వైరమూనును. వచ్చును. తా మడిగినమాటలకు మారుపల్కఁడు. మార్కొనఁ గడంగుననుకొనుఁడు. అపుడెట్లు?

బలి—అటులైన నింక నడుగునదేమి భగవానుఁడగు శుక్రాచార్యకృపాకటాక్షవీక్షణప్రభావముచే నిర్విఘ్నముగఁ గొనసాగిన విశ్వజిద్యాగఫలబలాతిరేక బలిచక్రవర్తి పరాక్రమశక్తి కాతఁడు లోఁబడుట సిద్ధము.

అందఱు—తథాస్తు. తథాస్తు.

శంబ—ఇంతవఱకు సంకల్పమున్నదికాన హృదయము తృప్తినొందినది.

[శుక్రుఁడు ప్రవేశించును.]

బలి—ఆచార్యోత్తముని పాదారవిందములకు భక్తిపూర్వకవందనములు.

(అందఱు నట్లొనర్తురు.)

శుక్రు—మనోవాంఛాఫలసిద్ధిరస్తు - దిగ్విజయోస్తు.

బలి—(చేమోడ్పుతో) మహాత్మా!

ఉ. ఓగురుదేవ! లోకముల కెన్నోర్చుమహత్వముగల్గు విశ్వజి
ద్యాగమొనర్పఁ దారిచి రథాశ్వధనుఃకవచాదిసాధన

శ్రీగలిగించి తీరు జయశ్రీసిద్ధియొకండె యటుండె వేగ నా
కీగదె దేవతాళిపయి శ్రీ కేగెద నాశిషపూర్వకంబుగన్.

(అని నమస్కరింపుచున్నాఁడు.)

శుక్రు—(బలిని లేవనెత్తి) వత్సా! బలిసార్వభౌమా! ఇంకను సంశయ మున్నదా! పదునాలుగులోకము లెత్తివచ్చినను నీకు రణంబున విజయము సిద్ధింపకతప్పదు. నీమనమున ననుమానింపకుము. త్రిలోకాధిపత్యము నీకరగతమైనదని భావింపుము.

ఉ. శ్రీమహనీయవైభవ విశేషనిరంతరభాసమానచిం
తామణిపీఠి నిన్నునిచి తత్పురినాకము నిండదానవ
స్తోమము నింపి సర్వసుఖసౌధూర్వహులౌనటుఁ జేసియంత సు
త్రామముఖామరాళికి సతంబని బిచ్చపుపెంకులిచ్చెదన్.

అందఱు—తథాస్తు. తథాస్తు. (అనుచున్నారు.)

బలి—గురూత్తమా! మా నాకముపై దండువిడియుట కెప్పుడు ముహూర్తము నిర్ణయించెదరో సెలవిచ్చెదరుగాక.

శుక్రు—ఎప్పుడోనా? నేఁడే నిర్ణయించినాను. పయనమున కాయ త్తుఁడ వగుము. లె మ్మాలసింపవలదు.

బలి—ధన్యోస్మి. ధన్యోస్మి. (అందఱు సంతోషమున నిష్క్రమింతురు)

---

2 వ రంగము—విజనప్రవేశము.

[ముండకుఁడు ప్రవేశము.]

ఎన్నిదినములకు నాకోరిక నెఱవేఱబోవుచున్నది. భగవంతుఁడు నామొఱ నేఁటికాలించినాఁడుకాఁబోలు. అన్నన్నా! ఎంతకాలమాయె. సముద్రమథనసమయమున నమృతకలశముఁ జేతఁబుచ్చుకొని యాయుర్వేదవేదియైన ధన్వంతరి క్షీరసాగరమునుండి వెడలి గట్టు నకుఁ జేరిచేరకముందే సురలమోసగించుటకసాధ్యులు, మాదానవు

ల్లరు బలాత్కారముగ నాతనిచేతనున్న సుధాకలశము నూడ దిగిచికొని యొకనిచేతిలోనిదింకొకఁడు వానిచేతిలోనిది మరియొకఁడు లాగికొనుచు పరస్పరకలహములకుపక్రమించి సంకులముగఁ బెనఁగికొనుచుండ, చేతఁగానివాఁడనుగదా యూరకుండ కూడను? నేనుఁ గూడ నమృతాపేక్షచేవచ్చినవాఁడనే గాన నప్పటికి నికుంభునిచేతిలో నున్నయమృతకలశము లాగికొందమని చివాలుననాగుంపులోనికిఁ బరువిడితి నంతవెంటనె వేయిమడుగులబరువుగలగుద్దు నాగూడలసందున నెవఁడో గుభాలునఁగుద్దెను. అంతే నాకుజ్ఞాపకము. నేనపుడు భూమినోటిఁగితిఁగాఁబోలు. అనంతరమేమిజరిగెనో, కాని, స్మృతిగల్గినేను కనులవిచ్చిచూచు వఱకు ఓయిబాబో దేవాసురసంగ్రామము మహాఘోరముగ జరుగుచున్నది. లెక్కలేక రాక్షసస్ఫీసులకళేబరములు పర్వతములచాడ్పున భూమిఁబడుచున్నవి ఆవిపరీతమునకుగుండెలవిసె పీనుగులచాటుఁ జేసికొని యెట్లో యీవలఁబడినాను. తదుపరి నారాయణసహాయకులై దేవతలుసంపూర్ణముగ దైత్యులఁబరాభవించిరఁట. ఇంతకు మహానుభావులు శుక్రాచార్యులవారికృపచే వచ్చినమావాండ్రెల్లరుబ్రతికి సాధనసామగ్రింబొంది నేఁటికి మహోత్సాహముతో స్వర్గముపైకిఁ దాడివెడలినారు. తప్పకవిజయము వచ్చునని నాకుఁగూడ ధైర్యముగనేయున్నది. నేనీరక్కసిదండులోఁగలిసి స్వర్గముఁజేరి నాకోరికఁ దీర్చుకొనఁ బ్రయత్నించెదను. (ముందుకుఁ జూచి) ఎవరోయిటువచ్చుచున్నట్లున్నదే ?

[మాయావి—ప్రవేశము.]

మా—ఎవరిచట (పరికించి) ముండకుఁడా.

ము—ఓరి నీతల్లికడుపువడ్డిల్లా ! యిక్కడికెందుకొచ్చావు?

మా——నీవెందుకొచ్చావు ?

ముం——నేనా-వూరకే-కాని-నీవెందుకొచ్చావో చెప్పు.

మా——నేనూవూరకేవచ్చానురా.

ముం——నేను పిచ్చివాఁడననుకున్నావాయేమి ? పనిలేకుండా వూరకే రావడమేమిటమ్మా ?

మా——నేనుమాత్రము వెఱ్ఱివాఁడననుకున్నావాయేమి నీవుమాత్రము వూరకే ఏలాగొచ్చావోచెప్పూ ?

ముం——అంతా వికటంగా మాట్లాఁడుతావే.

మా——అన్నీ విపరీతభావములేనే.

ముం——ఓహో ! మాటమాటకు వితర్కమేనె.

మా——మంచిభావమైనను నీదగ్గర మాలిన్యమొందుచున్నదేమీ ?

ముం——నోరెత్తనీయవె.

మా——మాటాడనీయవే.

ముం——సరే బాగున్నది.

మా——మంచిసరసముగనున్నది.

ముం——(కోపముతో) మాతండ్రీ- వెళ్ళూ- నీదారినినీవు వెళ్ళుబాబూ!

మా——నీదారినినీవె వెళ్ళరాదూ-నేవెళ్ళుటకు నీయాజ్ఞయేల ?

ముం——ఒరేవ్ ! నాకు రౌద్రమెక్కుచున్నది. మంచికే నే మంచివాఁడ గాని-లేనిచో నాయంత వెఱ్ఱివాఁడే లేఁడు.

మా——రౌద్రమెక్కితే-నేనుగూడ నీతాతనే.

ముం——ఏమిచేస్తావో చెప్పు.

మా——నీవేమిచేస్తావో చెప్పూ.

ముం——పీకినొక్కి పారవేసేస్తా.

మా——పిలకనూడలాగేసేస్తా తెలిసిందా ! (నవ్వును)

ముం—(తనలో) ఏఁడిముండమొయ్యా-గుండగొయ్యారకంలో మొదటి వాఁడుగనున్నాఁడు. సంగతినేదైనఁ దెలుసుకొందమనుకుంటె మొద్దుముండకొడుకు అడ్డదిడ్డముగ వాదులాడుచున్నాఁడే-వీని మర్మమరయుమార్గ మిదికాదు-వేరుత్రోవఁ ద్రొక్కెదను (ప్రి) బావా! మాయావీ (వెన్నుఁ దట్టుచు) నీసంగతియెట్లుండునో చూతమనుకొనినకొలఁది కల్లుఁద్రావినకోఁతివలె నీలాగెగిరిపడు చున్నావేమి?

మా—(ఎద నిమురుచు) అటులనా బావా! యెంతవఱకేగునో యని యెక్కించినకొలఁది శివమెత్తిన నక్కవలె చిందులాడుచున్నా వేమి?

ముం—అదిగో మరల నీవికటపుత్రోవకే పోవుచున్నావు.

మా—ఇదిగో తిరిగి నీవంకరమార్గమే పట్టుచున్నావు.

ముం—సరే-అటులైన—(ఆర్థోక్తిలో)

మా—సరే-అటులైన—

ముం—ఉండరా-మాట సరిగా చెప్పనియ్యరా.

మా—ఆగరా-చక్కగా విననియ్యరా.

ముం—చీకుకంపరాకాసిగాడిదవే.

మా—మొండిబండముండకొడుకువే.

ముం—(మాయావిచేతులఁ బట్టికొని మరియొకచేత నోరుమూసి) ఇఁక మనలోనెవరు వికటముగమాట్లాడినను శుక్రాచార్యులవారిపాద ములఁ దప్పినట్లే.

మా—(పై విధముననే ముండకునినోరుమూసి) మాటలలో నెవరు మర్మముగ మాట్లాడినను కులదేవతగుడి కూలఁ దీసినట్లే.

ముం—సరే-నాకుసమ్మతమే.

మా—మంచిది-నాకుఁగూడ యిష్టమే.

ముం—అటులైన మొదట నీ విట కెందుకువచ్చితివో చెప్పుము?

మా—నీకన్న వెనుకవచ్చినవాఁడను ముందుగ నాసంగతి నెట్లుచెప్పెదను.

ముం—(తనలో) వీఁడేదో నాకన్న గొప్పయోచనతో నున్నట్లున్నాఁడు. లోతు లాగెదను. బావా! అటులైననాసంగతినే మొదట (జెప్పెదవినుము.

మా—సరే చెప్పుము.

ముం—ఇప్పుడు మన వారందఱు స్వర్గముపైకి దాడి వెడలుట నీ వెఱిఁగినదేకదా ?

మా—ఆ! ఇంద్రాది దేవతలఁ బారదోలుటకు.

ముం—నేను యుద్ధభటులలోనివాఁడఁ గాకపోయినను మనసేనలోఁ గలసి స్వర్గమున జరుగబోవు దేవాసురమహాసంగ్రామాద్భుతములను యమరవాహినీనందనవనాది విచిత్ర వైభవములను కన్నుల పండువుగఁజూతమను తలఁపుగలిగి స్వర్గమునకుఁ బోవుదమా వద్దాయని యోజించుకొనుచున్నాను.

మా—ఓరి తెలివితక్కువనాయనమ్మా ! నీ విపుడు స్వర్గమునఁజూచుకొ త్తవింత లేమున్నవి. సముద్రమథనమునకుఁ బూర్వము మన మహారాజు బలిసార్వభౌముఁడు పాలించి విడిచినస్వర్గముగాదా? నీ వపుడు చూడలేదా?

ముం—నే నపుడు మీకన్నుల కగపడునట్లున్నా నా ? నన్ను రానిచ్చేలాగున్నారా? పోనీ పాపమని యెప్పుడైన దీసుకవెళ్ళినారా? నన్ను చీమలదోమలలోనైనఁ గణించినారా ? అనఁగూడదుగాని, బాబూ! మనకులమంతపాడుకుల మెక్కడ లేదురా? కొంచెమధికారము రాగానే చిగిరెంత సింగారమట్లు యెగసిపడుచుందురు. అందుననే కాదూ మనవాండ్ల కైశ్వర్యమే లేదు. సరి కదా ఉన్ననూ మూఁడున్నరరోజులకన్న మిగిలి నిలువలేదు.

మా—సరే! మీరనీయకుము. నోరుఁగట్టిపెట్టుము. గోడలకు చెవులుండును. రానురాను శ్రుతిమించి రాగమునకు దిగుచున్నదే! నేను గావున క్షమించితిని. మరియొకడైనచో నిన్నిప్పటికిఁ గాళ్లుఁజేతులఁగట్టి చచ్చినకుక్కవలె జరజరమని యీడ్చుకపోయి న్యాయస్థానమున నిలువబెట్టి నాలుక జీలికలు జేయించి పర్వతాగ్రము నుండి పడఁద్రోయింపకపోయినాఁడా? నీవు నలిగి నాశనమై నాయనమ్మతో గలియకపోయినావా?

ముం—ఆ- ఇంతమాత్రమునకేనా? తప్పేమిలేకయేనా?

మా—తప్పే లేదా?

ముం—ఏది?

మా—స్వకులదూషణము స్వమతదూషణము తప్పుకాదనుకున్నావా? జాగ్రత్త! ఇకనైన తిన్నగ మెలఁగుము. డొక్కఁ జీల్చివేసెదను. (పిడికిలిఁజూపును.)

ముం—(భయమున) అమ్మబాబో! తెలియకను నాతండ్రీ తెలియనివాఁగు డనుకో. నమస్కారము, వందనము. (కాళ్ళపైఁబడును.)

మా—సరే. క్షమించితి లెమ్ము. (లేచును.) ముండకా! బలిసార్వభౌముని శాసనము నీవు చక్కగా గుర్తెఱుఁగనట్లున్నావేమి?

ముం—నే నసలే యెఱుఁగను బావా!

మా—నీవు నాఁటినుండి సంఘములో లేవా యేమి?

ముం—ఆ. ఉన్నాను. ఏముండుటలే. లేనివాండ్లలో జమయే.

మా—మతిమాలినమాటలు మాట్లాడెదవేమి?

ముం—అవును. నిజమే నాయనా!

మా—అనఁగ-

ముం—ఏమున్నది. నాఁటనుండి మన సంఘములో నాతనువుమాత్ర మున్నది. మనసు లేదు.

మా—ఎందుచేత. నీమనసెక్కడున్నది ?

ముం—అందుకొఱకేఁగదా యిట్లొంటిగ యోజించుకొనుచు నేది తోఁచక మిడుకుచున్నాను.

మా—అబ్బా ! విసిగింపకు. ఎందుకొఱకో త్వరగాఁ దేల్చిచెప్పు.

ముం—సాయమేమైనఁ జేసెదవా ?

మా—చేసెదవా యేమిటి. చేసి తీరవలయును. మన సార్వభౌముని శాసన మిదియే. మహాప్రచండతరమైనది. అనేక సంఘసంస్కారములు జరిగినవి. జరుగుచున్నవి. ఇంకను జరుగ నున్నవి. నీకు సంక్షేపముగ ముఖ్యములఁ జెప్పెద వినుము.

ముం—సావధానుఁడనై యున్నాను.

మా—

సీ. వేదశాస్త్రాచార్య విప్రవిద్వేషియై
మనసంఘమున నుండ రెజనదెవండు
సర్వేశ్వరమహత్వ సదసద్విలాసముల్
పరిహసించి యొకండుఁ బలుకరాదు
మత కుల దేశాభిమానము ల్లవమేని
నిరసించువాఁడు మన్నింపఁబడఁడు
ధర్మ సత్య దయావ్రతంబుల నిర్దుష్ట
బుద్ధి నెల్లరొనర్పఁ బూనవలయు
తే. గీ. పాపకృత్యంబులనుఁబొరపాటుకలిమి
నెవ్వఁడెపుడేనిఁ జేయనూహింపఁదగదు

పౌరుషజ్ఞానకీర్తులఁ బ్రబలిలోక
ములఁ జయించి ప్రాభవమునఁ బొదలవలయు.

ఇందులకేవఁడు తప్పినను - కఠినశిక్షాపాత్రుఁడు గాకతప్పఁడు.

ముం—అనఁగా ?

మా—జీవితాశ మానుకొనుట.

ముం—ఆఁ! అటులనా - నేనెఱుఁగఁజుమా - ఇదియొక తెలుఁగకపోవు టేమి లే - నేనెట్లున్నానో - యేమిభక్షించితినో - మాత్ర మెఱుఁగుదునా.

మా—అవును. అదేమోయింకను చెప్పవేమి.

ముం—ఏమున్నది స్వర్గమునకెటులనైనఁ జేరుకుందామనియే.

మా—స్వర్గముపై నీకింతగాఢప్రేమకును చిత్తభ్రమకును కారణమేమి ?

ముం—చెప్పిన నీకేమికోపమువచ్చునో యని సందేహించుచున్నాను.

మా—కోపమెందులకు - తెలిసి తెలియని ప్రమాదముల సరకుసేయక నా తెలియునంతవఱకు నిన్ను దిద్దుపాటు జేసికొందును. మనసంఘని బంధన లిపుడే చెప్పియుంటి మరచిపోతివా ? మనసునకెక్కనే లేదా ?

ముం—ఎక్కకేమి - చక్కగానే తెలిసినవి. కాని, పొరపాటుల తప్పక క్షమింతువా ?

మా—అవశ్యము - ముమ్మాటికి.

ముం—అటులైనవినుము. నేను సముద్రమథనసమయమున నట్టివింతలఁ జూడ నటకువచ్చితిని. పర్వతమునకు జుట్టినపాము విషముఁగ్రక్కి నపుడు, సాగరమున హాలాహలముపొంగివచ్చినపుడు నాతల్లి కడుపుచలువఁదనముచేత నెట్లో ప్రాణంబులుదక్కి బ్రతికితిని.

పిదప-కామధేనువు, కల్పవృక్షము, ఐరావతము, ఉచ్చైశ్శ్రవము మొదలగు దివ్యవస్తువులెన్నో పుట్టినవి. తనుపరి, అబ్బా! బావా! తలచికొన్నంతనే యొడలు పులకరించుచున్నది చూడు. (చూపును)

మా—సరే-చెప్పుము.

ముం—అప్సరసలట! ఓహో! ఎందఱుపుట్టిరో నీవుజూచితివా ?

మా—చూచితిని. చాలమంది.

ముం—అందులో మొదటఁ బుట్టినది చూడు. మెఱుపువలె తళుక్కు మని పించినది. దానిపేరేమి ?

మా—నాకుమాత్రము పేరేమి తెలియును. ఇంకేమైన గుర్తులున్నఁ జెప్పుము చూతును.

ముం—సరే! బాగున్నదే! గుర్తులు చూచియేడ్చితే నిన్నడుగుటేల ? అది యట్లుతళుక్కుమనుటతోడనే నేనేమైతినో నాకే తెలియదు. మూర్ఛిల్లితిఁగాఁబోలు. నాకు స్మృతివచ్చుసరికి యమృతకలశము జేనిడికొని ధన్వంతరి వచ్చుచుండెను. వాండ్రేమైరో నాకెవరును చెప్పుట కవకాశమే లేకపోయినది. దేవాసుర యుద్ధానంతరమునమాత్రము స్వర్గమందున్నారని తెలిసినది. దాని నెట్లైన స్వర్గమున నాకుఁ జూపితివా నీఋుంటిముందు మరియొక జన్మమునఁ గుక్కనై పుట్టి నీఋుణముఁ దీర్చుకొందును.

మా—దానిఁ బ్రేమించితివాయేమి ? అందులకేనా నీ విట్లు మతిమాలి యుండుట ?

ముం—అవును (నిట్టూర్పువిడుచును)

మా—ముండకా! ఇది సంఘనిబంధనలలోని ముఖ్యమైనదురాచారము గాన త్వరగా నీమనసు మార్చుకొనుము.

ముం—బావా! భయముమాని నిజము జెప్పెద క్షమింపుము. మనము మొదటినుండి స్వేచ్ఛావిహారులము. నడమంత్రపు నిబాధన లిపుడు వచ్చినవేమో నే నెఱుఁగను. నిబంధనలురానీ-నిర్బంధములురానీ మీరెల్లరు కత్తికొకకండగా నన్ను నఱుకనీ, నేను చావనీ. నామనసుమాత్రము మరలదు.

మా—(తనలో) వీఁడు నిజముగ విభ్రమముఁ గొనియున్నాఁడు. సామాన్యముగ వీని పిచ్చివదలునట్లులేదు. (ప్రకాశముగ) ముండకా! మహారాజాజ్ఞ మిక్కిలి కఠినమైనదిసుమా?

ముం—మరణమన్న వెఱపులేనివానికి, మహారాజాజ్ఞయైననేమి, మరేమైననేమి?

మా—(తనలో) నిజమయినసంఘాభిమానినగు నేనిపుడు వీని నెట్లునిర్బంధించి బాధించినను నా కధికారమున్నది. కాని,మార్గమిదికాదు. నేను నిర్బంధించి దండించినకొలంది వాఁడు మాత్సర్యముతో తెగువకుఁ బూనుకొని చెడిపోవును. గాన, తెగినదాక బిగించుట తగవుకాదు. స్వల్పుఁడొకఁడు మననేమిచేయఁగలఁడు పోనిమ్మని విడిచిపెట్టిన, సంఘవృద్ధ్యాభ్యుదయమున కేదేని కళంకము వేరుపురుగువలె దారిచూపకమానదు. శక్తికొలఁదిపాటువడి వీనిచిత్తవృత్తిని మార్చినఁ గాని దేశసంఘాభిమానినని నిష్కళంకముగ మదంతరాత్మ సమ్మతింపదు. తెలివిగల జీవితముల కీమార్గమె గదా పవిత్రత చేకూర్పనగును.

చ. తననొరులెన్నిసంస్తుతులఁ గొ దన్నినఁ దిట్టిన మోదఖేదము
లన్మనమునఁ బొందుటుత్తముల కొ మార్గముగాదు, మరేమిటన్నఁ దా
నొనరుచు సర్వకృత్యముల కొ కోడకచక్కగనంతరాత్మయొ
ప్పిన నదెయుత్తమోత్తమవివేకపుజీవితమా దృఢంబుగన్,

కావున-నిట్టిసత్యవర్తనమునకు మదంతరాత్మలో ఘోరప్రమాణ మొనర్చిన నేను వీని నేవిధముననైన మంచిమార్గమునకుఁ ద్రిప్పుటయే నాకు ముఖ్యకర్తవ్యము. (ప్రకాశముగ) సరే ముండకా! నీయిష్టానుసారముగ సాయపడి సంతోషమును గూర్చెదరమ్ము (చేయిబట్టిలాగును)

ముం——ధన్యోస్మి. ధన్యోస్మి. బావా! నీ విటకేలవచ్చితివో చెప్పవేమి?

**మా——**నాకు వేరొకపనియేలేదు-నీకొఱకే. రమ్ము (పోవుదురు.)

ఇది ప్రథమాంకము.



ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము.

స్వర్గముననింద్రునియాస్థానమంటపము.

[ఇంద్రాగ్నియమవరుణకుబేరులుచితపీఠములఁగూర్చొనియుందురు.]

ఇం—(ఆర్తితో) ఈవార్త వినినప్పటినుండి నాచిత్తమెంతో తత్తరపడుచున్నది.

చ. మఖవునికేమి వైభవసమంచితకీర్తివిరాజమానది
ప్రముఖుఁడఁ ద్రిలోకపాలకుఁ డపూర్వపరాక్రమవిక్రమాఢ్యుఁడం
చఖిలజగంబులాఁకకొను నక్కట నామది కెప్డుఁ గష్టమే
సుఖమనువస్తువెవ్వనికిఁ జొప్పడు నిశ్చలవృత్తి సృష్టిలోఁ.

మఱలనిప్పుడు బలిదైత్యుఁడు మనపై దండెత్తివచ్చుచున్నాఁడనుట దూరమాలోచింపఁదగియున్నది. సుధాసేవానంతరయుద్ధమున దానవవాశనాశనమైనదనిసంతసించితిమి. కాని, ఎక్కడిమాట. మనకుసంతతము నిలుచునా? కల్ల. శుక్రాచార్యుఁడు మృతసంజీవనీప్రభావమున నెప్పుడురాక్షసుల బ్రతికించెనని తెలిసెనో నానడు మప్పుడే విఱిఁగినట్లైనది. సరే. మొన్నటి విశ్వజిద్యాగపరిసమాప్తితో ధైర్యలేశమైనను హృదయమున

నిలువ నీడలేక పటాపంచలుగా నంతరించినది. కర్తవ్యమిఁక నేమియుఁ దోఁపక మనసు బండగా మారిపోయినది.

కుబే—దేవరయంతవా రిట్లధైర్యపడిన తక్కినవమాకొలందు లెంతటివారు. మీ రెఱుఁగనిధర్మములు మాత్ర మేమికలవు. ఉత్తములకాపదల యందే ధైర్యావలంబనము ముఖ్యము. ఆపదలు సర్వప్రాణులకు ను కొంచెమురూపభేదమనిపించుఁగాని - అనుభవమువూత్రము సమానమే.

తే. గీ. ఏతరువునకుఁ దగినట్టు ♪ లాతరువున
కలిమి తూలించుగాలి య ♪ ట్లనుభవములు
గొప్పవారికి గొప్పగా ♪ నుప్పతిల్లు,
కొద్దివారికిఁ గొలఁదిగాఁ ♪ గుఱుఁరుకొనును.

ఎవరిమెక్కువవారికే. బలిదానవుఁడు విశ్వజిద్యాగమున సాధనసామ గ్రిఁ బొందినంతనే లోకములెల్లను మునిఁగిపోవలసినవియేనా? తాడెక్కు వానికి తలదన్ను వాఁడుండునుగదా ? అయిన నధైర్యపడినంతనే కష్టము లురానున్నవితొలఁగిపోవు, సుఖములు నిలువయుండవు.

యము—నిశ్చయము. వాఁడు గురుకృపావిశేషమున దుర్జేయుఁడే యగు ననుకొనుఁడు. సకలలోకగురుఁడగు శ్రీమన్నారాయణ కృపా లేశమున నమృతమును భుజించి మృత్యుదూరులమైన యమరు లందఱమిఁక నెత్తినిఁ గొంగువేసికొని వెడలిపోవలసినదేనా ?

వరు—మన కేయాయాసము వలదు. నిర్జర పక్షపాతియను బిరుదము వహించియున్న పక్షివాహనుఁడే రక్షింపఁగలఁడు.

ఇం—దిక్పాలకులారా ! మీరు దేశకాలపాత్రముల నెఱుంగనట్లు మాట్లాడు చున్నారు.

ఆ. వె. కనకకశిపుఁడాది ♪ గాఁగల రాక్షస
వీరులెట్లు మనల ♪ వేపుకొనిరి

హరికృపావిశేష ࿎ మపుడు లేదొ మహా
సాధనములు మనకుఁ ࿎ జాలలేవొ.

ఇవ్వార్తవివరముగఁ దెలిసికొని రానేగిన మనవార్తాహరులింకను రాలే దేమి! మఱచితి ఆచార్యులకొఱకేగిన జయంతుఁడేడి?

[బృహస్పతి ప్రవేశము.]

అందఱు—మహాత్మా! వందనములు (నమస్కరింతురు.)

బృహ—శుభమగుఁగాక (పీఠములఁ గూర్చుందురు.)

[వార్తాహరుఁడు ప్రవేశించి]

వార్తా—రక్షింపు రక్షింపు త్రిలోకనాయకా!

ఇంద్రు—బలిదానవుఁడు దండెత్తి వచ్చుచున్నాఁడా యేమి?

వార్తా—రానేవచ్చినాఁడు దేవా!

ఇంద్రు—(నిర్విణ్ణుఁడై) వచ్చినాఁడా!

యము—నగరు ముట్టడించెనా?

వరు—రణసన్నాహముతోనే వచ్చెనా?

కుబే—నగరద్వారచతుష్టయ మీశానాదిదిక్పాలురు కాచుచున్నారా?

వార్తా—ఆఁ ఇప్పటికిఁ గాచుచునేయున్నారు. రాక్షసులకుఁ జిక్కిరో యేమో!

ఇంద్రు—అటులైన సమవర్తీ! వరుణుఁడు, నీవును వారికి సాయముగఁ బొండు.

యము }
వరు } చిత్తము (అని నిష్క్రమింతురు)

ఇంద్రు—(వార్తాహరునితో) ఓయీ! నీవింతయాలసించితివేల?

వార్తా—దేవా! దేవరసెలవుఁ గొని దైత్యనివాసకాననంబులన్నియు మాయారూపంబులశోధింపుచుండ ముండకుఁ డను రాక్షసుని భార్య విషదంతియనుపేరు గలది పెద్దయెలుఁగున నేడ్చుచు నిజ

నాథునన్వేషించుచుంటఁ జూచి మేము రాక్షసరూపంబులఁ దాల్చి దానికెదురుపడి సంగతి విచారింప విశ్వజిద్యాగలబ్ధబల గర్వాతిరేకులైన బలిదానవాదులను శుక్రుఁడు ప్రోత్సహించి నేఁడు తప్పక యమరావతినిముట్టడింపుఁ డని పంపెనని తెలిసె.

ఇంద్ర—తరువాత ?

వార్తా—విచిత్రమగు వింతవార్త నొకటివింటిమి.

ఇంద్రు—అదియేది ?

వార్తా—బలి తనస్వకులస్థులందఱిని దురాచారములనుండి మరలించి వేదవిహిత ధర్మవర్తనులగునట్లు దిద్దుబాటుఁ జేసినాఁడఁట.

ఇంద్ర—ఏమేమీ (ఆశ్చర్యముతో) దానవులందఱు వేదవిహితధర్మ వర్తనులైరా ?

కుబే—అసత్యము. మాయపన్నుగడలు.

వార్తా—నిజమేకావచ్చును. విషదంతిమాటలలోని సందర్భమును బాగుగ పరికించితిమి. భావము నరసితిమి. అబద్ధమని తోపలేదు.

ఇంద్రు—సరే-పిదప.

వార్తా—బయలువెడలినారనుమాట వినినంతనే - మే మచ్చోటునుండి వేగముగ వెడలివచ్చుచుండ దానవసేవాసంబాధవివిధధ్వానము లు మిన్నంటమ్రోగుచుంట మాచెవిఁబడియెను.

ఇంద్ర—పిమ్మట.

వార్తా—మాకన్నముం దేగుచున్నరాక్షసులకంటఁబడకుండఁ దప్పుకొని నగరుఁ బ్రవేశించుసరి కింతకాలమయినది- సేనలుకూడ నందన వనాద్యారామసీమల కొల్లగొనుచున్నవి.

ఇంద్రు—కటకటా ! యింకనేమున్నది !

కుబే—అరులనెదిరించి జయమో పరాజయమో పొందుటయే.

బృ—ఎదురించుకాలము వెనుకపట్టినది.

ఇంద్రు—అంతేనా గురువరా ?

బృహ—లేక మరేమున్నది.

కుబే—కర్తవ్యమో ?

బృహ—ఏమున్నది ?

ఉ. కాలము వస్తురూపగుణకర్మఫలాఫలమూలమాట దు
 శ్శీల సుశీలదుర్బల విశేషమహాబలసర్వదుఃఖ సౌ
 ఖ్యాళిఘటింపఁ జేయును చరాచరపాళికిఁ గాననెవ్వఁడు
 న్గాలము మీర నేరఁ డనఁగా మనమెంతటివారమారయన్.

కాలానుసారముగ కర్మమును, కర్మానుసరించికాలమును బొత్తుపడు చుండును.

ఇంద్రు—భవదంతేవాసినగు నేను కాలమునతిక్రమింప సమర్థతనర్థింతు నా ? కాని, నాఁడట్లు మనచేతఁ బరాజితులైనదానవుల కింతలో నింతటిబలధైర్యాదులు గలుగుటయు, జయింపనేతెంచుటయు నత్యాశ్చర్యముగనున్నది.

కుబే—భగవదనుగ్రహమున సుధాపానజీవనులమై మృత్యుదూరగుల మైన మము దైత్యులెట్లు పారదరుమ సమర్థులగుదురా యని సంశయమూరక నన్ను బాధింపుచున్నది.

బృహ—సూక్ష్మబుద్ధిగల మీరు శంకింపఁ బనియేలేదు. కాని, నాఁడట్లు మీచేఁ బడినదానవులు—

సీ. భార్గవగురుకృపా బలమునఁ జావక
 జీవించి మదిని యోజించి స్వీయ
 సంఘసంస్కారముల్ శాసించుకొని సత్య
 ధర్మదయాసద్వ్రతంబులూని
 విగతదుర్మార్గులై వేదశాస్త్ర ద్విజే
 శ్వరమహా భక్తివిశ్వాసులగుచు

విశ్వజిద్యాగ నిర్విఘ్న సమాప్తిని
దోర్వీర్యసాధనోత్సుకతమీఱి

తే. గీ. పూర్వవైరముసాధింపఁ బూనియిపుడు
దండువిడిసిరి దైత్యులు గండుమిగిలి
వారినిత్తరి మీర లోర్వంగలేరు
యొదిగియెందేనిఁ జనుట కాలోచితంబు.

కాలమెఱిఁగి వర్తించువాఁడు కార్యనిర్వాహకుఁడు గాక మానఁడు. గాన, మీరు ప్రస్తుతము నాకమునువిడిచి యెందేనిఁ దలఁదాచుకొనుటకన్న కర్తవ్య మేమున్నది.

ఇంద్ర-కుబే—(చెవులుమూసికొని) హా! హా! పాపముపశమించుఁ గాక! పాపముపశమించుఁగాక!

ఇంద్రు—ఆచార్యవర్యా! స్వదేశమువిడిచి, మొండిప్రాణములఁ గాపాడుకొనుటకన్న, అవమానభాజనమైన జీవితమును మాను కొనుటే శ్రేయముకాదా? అయ్యయ్యో! యెంతటిదుర్దినము సంఘటించినది!

సీ. తనదేశమునుబాసి చనుటకంటెను మహా
కఠినదుర్మరణంబుఁ గనుటమేలు
తనరాజ్య మొరులపా లొనరింపఁ దలఁబూను
కంటె మండుచితిఁ బరుంటమేలు
తనమాతృభూమి శాత్రవులు పాలింపఁ జూ
చుటకంటె విషముఁ గ్రోలుటయెమేలు
తనజన్మధరణి నొంటడ్లనునిల్పిచేతు లొ
గ్గుటకంటెఁ దలఁగోసి కొనుటమేలు

తే. గీ. తనదుసర్వస్వమొకని కర్పనమొనర్చి
మనుటకంటెగుండెలు జీల్చి క్రొన్నుటమేలు

తనకు వైరులులొంగని ♩ తరిఘటింప
నెటకొ చనుటేల యెదిరి చ ♩ చ్చుటయె మేలు.

ఆహా! దైవమా! సకలదేశములలో నాదేశమును బోలినదేశము న్నదా?

చ. సిరులకుఁ బుట్టినిల్లు సుఖ ♩ సిద్ధిదమవ్యయ మద్వితీయబం
ధురవిభవం బమోఘము మ ♩ నోరథనిర్వహణంబగణ్యపు
ణ్యరతులుఁ గోరుదివ్యఫల ♩ మైవిలసిల్లెడు స్వర్గలక్ష్మి నె
ట్లరులకుఁ గట్టిపెట్టిగహ ♩ నాంతరసీమల నేఁ జరించెదన్.

కుబే—నిజముగురువరా! పనికిమాలినవాఁడై వైరులకుభయపడి, జీవితాశకలిమిసర్వస్వ మొప్పగించి, చేతులుముడుపుకొని, ప్రాణములుమాత్రము దక్కిన వింతేచాలు తండ్రీ యనుకొని, బాలసంతజోగివలెఁ బ్రభుఁడగువాఁడు వెడలిపోవుటకొప్పుకొనునా? అట్టివానిప్రభుత్వార్హుఁడని పౌరుషవంతులొప్పుకొందురా? అట్టిచేతఁగాని తుచ్ఛజీవితముకన్న మరణమే శ్రేయస్కరము కాదా? దైత్యులే బలవంతులుగాని మేముకామా? వారే పౌరుషవంతులుగాని మేము పందలమా? ఎంతమాటసెలవిచ్చినారు, అయ్యా!

మ. అరులన్మార్కొని విక్రమంబున నమో ♩ ఘాస్త్రానలాభీల దు
ర్భరకీలోగ్రపటుప్రతాపమున వి ♩ ధ్వంసంబుఁ గావించుటో
పరదోర్విక్రమశక్తికోటువడి స ♩ ర్వస్వంబుఁ బ్రాణంబులున్
దురమందప్పన జేయుటో ప్రభుని ని ♩ ర్దుష్టస్వధర్మంబగున్.

అంతియేకాని, ప్రాణభీతిని పౌరుషవంతులు తల దాచికొనుటకంగీకరింతురా, మీరెఱుంగనిధర్మములు గలవా?

(తెరలోఁ గలకలానంతరమున.)

ఓహో! శూరాగ్రేసరులగు దైత్యులారా!

ఉ. దండధరున్గదాహతి విరదల్చి జలాధిపుఁ గూల్చి యగ్ని ను
ద్దండతఁ బేల్చి కోణపుమ దంబుసడల్చి యుమాధినాథుమే
రెండుగఁ జీల్చి గంధవహు నిల్వఁగనీకనదల్చి శ్రీదుఁడా
ఖండలుఁ డున్నతావులఁ బెకల్చి నిరుద్ధులఁ జేయుఁడుద్ధతిన్.

ఇంద్రు—(ఆలించి) ఎవఁడువాఁడు ?

కుబే—బలిదానవుఁ డితఁడే కానోపునా ?

బృహ—బలీంద్రుని సేనానియగు నముచిసవ్వడిగానున్నది.

ఇంద్రు—(తనలో) పాపముపశమించుఁగాక ! అమోఘవచస్కులనోట బలీంద్రుఁడని వెడలుచున్నది. (ప్రకాశముగ) నగరద్వారములఁ గాచియున్న యీశానాదిదిక్పాలురకును దానవులకును సమరము జరుగుచున్నట్లున్నదే ?

బృహ—ఆ, ప్రారంభమైనది. తప్పకదానవులకే జయమగునని తోఁచుచున్నది.

ఇంద్రు—(విసుగుతో) సత్యసంకల్పులరు, తమకుఁ గలిగినసంకల్పము వృథయగునా ? కాని, గురువరా ?

మ. అత్యుత్సాహతదైత్యసంతతికి దేవానీకముల్ గెల్వ ని
ష్ప్రత్యూహంబగు శుక్రదేశికుకృపాప్రావీణ్యమేయున్నచో
ప్రత్యర్థిప్రచయంబు నుక్కడఁచు సౌభాగ్యంబుసుంతైన నా
దిత్యవ్రాతమునోమదే తమ మహాదివ్యప్రభావంబునన్.

తపశ్శక్తికన్నిశక్తులు లొజ్జనియు, సర్వేశ్వరునైనను గీటుగీచినిల్పుసమర్థత తపశ్శక్తికే కలదని నే నెఱుఁగకపోలేను. కావున, దేవా! శుక్రాచార్యులం బోలిన తపోవంతులు తాముకారా ? వారికున్నయట్లు శిష్యులయెడఁ దమకువాత్సల్యము లేదా ? దేవరకృపకుఁ బాత్రులమగుటకు మాకేమైన యనర్హతకలదా ? తొలఁగితలఁదాచుకొని బ్రతుకవలసినంతదుర్గతి మా

కేలరావలయునో శాంతహృదయులు తామే యూహింతురుగాక. మాకే దేని మఱియొక యుత్తమమార్గముఁ జూపింతురుగాక.

కుబే—నిశ్చయమాచార్యా! తమదయవలన మేమును నంతయసమర్థులముకామే.

ఆ. వె. చావులేనిమమ్ముఁ ద్రావినామఖిలశ
స్త్రాస్త్రదివ్యసాధనాన్వితులము
భండనమునఁ దగినపాండితిఁ గలమేము
శత్రువులకుఁ దొలఁగి చనుటదేల.

బృహ—మీయందు నాకు వాత్సల్యమున్నదో లేదో మీయంతరాత్మకే యెఱుక. మీరసమర్థులో మహాసమర్థులో సమస్తజగములకును యెఱుకయే. మహేంద్రా! తపశ్శక్తికన్న శక్తులు లొజ్జని నీవిప్పుడే వచించితివికదా? అట్టితపశ్శక్తికే మనము, మనమేలెక్కయేమి. మనపాలిటిభగవంతుఁడునుఁ గూడఁ దలదాచుకొనవలసియే వచ్చినది. ఏమందువా?

ఉ. శుక్రుఁడనన్నబోధనవిశుద్ధులలోఁ గడుమేటియెవ్వఁడు వా
గ్వక్రతలేనివాఁడు బుధసన్నుతుఁడు న్కవి బ్రాహ్మణోత్తముం
డే క్రియనేనిదానవుల కేజయమీయఁగఁ బూనియంత కా
ర్యక్రమముం దలంచె విజయం బెటులబ్బెడి మీకు నాజిలోన్.

నిజమాడమోమోటమేల, మావిద్యాబలము, తపోబలము, యాతని శక్తిముందుదివిటీక్రిందిదీపములు, గాన, శుక్రునిసంకల్పము నెఱవేరితీరును.

ఇంద్ర—అటులైననింకజీవించియున్న నేమిఫలము. పౌరుషప్రతాపహీనులమయి బ్రతుకుటకన్న చచ్చుటయే సకలవిధముల శ్రేయము. కావున, మాకేదేనిమరణమునకైన మార్గముపదేశింపుడు.

బృహ—(నవ్వుచు) ఎంతటిసమర్థుఁడైనను స్వకార్యనిర్వహణాతురతలో వెఱ్ఱివాఁడనిపించుకొనుట నైసర్గికము. దేవరాజా!

తే. గీ. చావుపుట్టువుల్గోరిన ♦ రావెవరికి
వచ్చునప్పుడువలదన్న ♦ వదలిపోవు
రోగికోరినవచ్చెనే ♦ రోగమటులె
పోవఁగోరఁదద్రోగము ♦ వోవఁగలదె.

అందుమీరు చావులేనిమందుఁ ద్రావితిరి. అమరులైతిరి. ఇట్టిమీరు మృత్యువుమాత్రము గోరినవచ్చునా ?

ఇంద్రు—ఇదియు నిర్బంధమునకే వచ్చినదా? తొలఁగి తలఁ దాచుకొను టకన్న మాకిపుడు వేరుమార్గమేమియును లేదా ?

బృహ—లేదని నిశ్చయించుటకు సమర్థుఁ డెవఁడు. నాబుద్ధికిమాత్రము దోపకున్నది.

ఇంద్రు—సర్వజ్ఞులు తా మింత నీరసపడిన మాకింక దిక్కెవ్వ రున్నారు ?

బృహ—లేకేమి. సృష్టిస్థితి లయములకును—సుగతిదుర్గతులకును—సంకల్పవికల్పములకును — ఎల్లదిక్కులకును — మీకును—నాకును—ఆధారభూతుఁడై, ప్రారబ్ధనామకసూత్రధారుఁడై—సర్వసాక్షియై — సత్యస్వరూపుఁడై — శాశ్వతుఁడై యెవఁ డున్నాఁడో - వాఁడే— ఆ పరమాత్ముఁడే—ఆ భగవంతుఁడే యెన్నఁటికైనఁ దిక్కు కాఁ గలడు.

ఇంద్రు—ఆ భగవంతుఁడు గూడ మనతోఁబాటు శుక్రుని తపశ్శక్తికి లొంగక తప్ప దంటిరే ?

బృహ—అవును- అయిన—

ఇంద్రు—మనకెట్లు దిక్కు కాఁ గలఁడు?

బృహ—ఇదివర కెట్లయినాఁడు.

ఇంద్రు—ఆకాలము మారిన దంటిరే ?

బృహ—ఈ కాలము మాత్రము మారక యిట్లే నిలుచు నంటివా ?

ఇంద్రు—ఏమెూ మహాత్మా! నాకేమియుఁ దోఁచకున్నది. గారడివలె చిత్తమునకు విభ్రమముఁ గూర్చుచున్నది. మిక్కిలి చికాకుగ నున్నది.

బృహ—మరి భగవన్మహిమమన నేమని తలంచుచున్నావు?

సీ. సకల చరాచర జంతుస్థితిగతుల
కాధారుఁడై కానిరాయట్లతోఁచు
జనన మరణ దుఃఖ సౌఖ్యములకుఁ గర్త
యైయుండి కాఁడు సత్యమనిపించు
అఖిలాండకోటి బ్రహ్మాండాధిపతియయి
దేని నంటనియట్లు తేజరిల్లు
నిర్మలుండుఁ బరుండు నిజమనుకొనఁడానె
యంతట నిండి యున్నట్లగపడు

ఆ. వె. ఇంకనెట్లు లాతని నిర్ణయింప నగును
పెద్దలగువారె తోఁపక వెఱ్ఱు లగుదు
రన్న మన మెంతయని మహామహిమము
నెఱుఁగ బ్రహ్మాదులకు నేనిఁ దరముగాదు.

స్వమాయానిర్మిత సకలలోకజాలుండును-స్వలీలానందసందోహుండును-స్వయంప్రకాశుండును- స్వతంత్రుండు నగు లక్ష్మీకాంతుని మహిమ మిట్టిదని యూహింప నెట్టివారికినిఁ దరము గాదు. ఆతని వైచిత్ర్యములు జరుగుచుంటఁ జూచి సంతసింపవలెఁ గాని- జరిగినవి కాని- జరుగ నున్నవి కాని యూహింపనెంచుట లాకసముఁ బిడికిటఁబట్ట నెంచిన ట్లగును గాన-

శా. ఏనాఁడేవిధి కష్టసౌఖ్యములు రానీ రాకపోనీ రమా
ప్రాణేశాద్భుత చిద్విలాసమని సంభావించి యెవ్వేళఁ ద

ధ్యానానందముతోడ జీవితము నేఁధన్యుండు సెల్లించు వి
జ్ఞానప్రాభవవైభవానుభవ సా క్షాద్విష్ణుతుల్యుండగుః.
అట్లగుటం జేసి మనము సర్వభారము లాశ్రీహరివిగానే భావించి కాలము
నకు వేచియుందము.

ఇంద్రు—ఇదివరకు మాత్రము స్వేచ్ఛావిహారులమా? (అర్ధోక్తిలో)

కుబే—గురువరా! నాకేమో తమయుపదేశము నిర్మలముగ బోధపడు
ట లేదు. కాల మతిక్రమింపుచున్నది. నగరద్వారములఁ గాచి
యున్న దిక్పాలురగతి యేమయ్యెనో యని చిత్తము భ్రమింపు
చున్నది. గాన, ప్రస్తుతకర్తవ్యమును ముఖ్యముగ మూఁడు
మాటలలో సెలవిండు.

[ప్రతీహారి ప్రవేశము.]

రక్షింపుము. రక్షింపుము దేవరాజా—

అందఱు—ఏమిఏమి? యేమి మూఁడినది?

ప్రతీ—ఏమిచెప్పను. దిక్పాలురను దానవులు బందీకృతులుగా నొనర్చి
నగరముఁ బ్రవేశించినారు.

ఇంద్రు—ఇఁక నెట్లు?

కుబే—ముందుగతియో?

బృహ—ఓయి ప్రతీహారీ! నీవు జయంతునిపాలికేగి కామగవి, సుధా
కలశము మొదలగు నమోఘవస్తువులును యింద్రాణిదొట్టి యంతి
పురవాసినులను శత్రువుల కంటఁబడకుండఁ దొలఁగించుకొని
యొందేనిఁ బొమ్మనిచెప్పి నీవు నాతనివెంట నుండుము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించును.)

బృహ—మీకు నేఁ జెప్పవలసిన విషయము లెన్నోయున్నను, సంక్షేప
ముగ మూఁడుమాటలు వినుఁడు.

తే. గీ. సకలమైనశక్తులు తపశ్శక్తికోడు
నా తపశ్శక్తియోడు మహాపతివ్రత
తామహిమకట్టి పుణ్యసాధ్విమతల్లి
సాయమే యెల్లరను బాగుసేయవలయు.

అట్టి సతీతిలకము ప్రస్తుతము మీ మాతృదేవతయైన యదితిదేవియే గాన, యామె కీసంతాప ముద్రేకించునట్లు చెవినాటఁ జెప్పవలయును. అటులైనఁ దప్పక మన మనోరథములు సిద్ధించును.

ఇంద్రు—ఇపుడామెకు సంతాపము లేక సంతోష మున్నదా ?

బృహ—(అర్ధోక్తిలో) నీ కుశంకలకు సమాధానముల కిది సమయము కాదు. ప్రస్తుతము మనస్త్రీలలో నిట్టియుద్రేకముఁ గలిగించుట మనకు కర్తవ్యమై యున్నది. పిదప సమస్త మెఱుకపడఁగలదు.

(తెరలోఁ గలకలానంతరమున)

ఇంద్రు & కుబే—(ఆత్రముతో) దానవులు రానేవచ్చినారే.

(తెరలో)

ఓహో దానవవీరులారా !

తే. గీ. సురపతి కుబేరులున్నప ట్టరయుఁడెల్ల
భవనముల పుష్పవనముల సవనములను
తక్కువేల్పులు దిక్పతుల్ జిక్కినారు
మిగుల ముఖ్యకర్తవ్యమే మిగిలియుండె.

ఇంద్రు—(సంభ్రమమున) ఇంక నేమి. అదో (వ్రేలుసూపి) వచ్చుచునే యున్నారు. గురువరా ! ఇపుడుగూడఁ బోరాటముఁ గూడదని యేనా ?

బృహ—పోరాట మనఁగా చావో జయమో సంప్రాప్తింపవలయుఁ గాన, నీ రెంటికిని మీకు ప్రాప్తము లేదు, త్రోలఁగుట చాల

మంచిదని తొలుతనే చెప్పితిని. రానిండు. మీకేమిచింత. నేనున్నానుగదా? ఎట్లో కార్యము సమర్థించెదను.

[ఒకప్రక్కనుండి బలి, కాలనాథ, శంబరాదులు ప్రవేశము.]

బలి—తే. గీ. సురపతి కుబేరులున్న (అను వెనుకటి పద్యముఁ జదువుచున్నాఁడు.)

[మఱియొక ప్రక్కనుండి ససేనుఁడై నముచి ప్రవేశింపుచు]

నము—ఉ. దండధరుగ్గదాహతి నఁదల్చి (అను వెనుకటిపద్యముఁ జదువుచున్నాఁడు.)

బృహ—దానవకులపావనులైన బలిచక్రవర్తిగారికి మనోవాంఛాఫలసిద్ధి కలుగుఁ గాక. (నముచిఁ జూచి) నిరుపమాన వీరవిహారులగు సేనానాథులకు దిగ్విజయప్రాప్తి చేకూరుఁ గాక.

నము—(బృహస్పతిఁజూచి) ఓహో దేవాచార్యులవారా! అట్టులైన దాసుఁడు నమస్కరించు చున్నాఁడు.

బృహ—సమరవిజయప్రాప్తిరస్తు.

బలి—మహేంద్రాది లోకపాలాస్థానవిద్వన్మణులగు సురాచార్యులవారి పాదపద్మములకు వందనములు.

బృహ—మనోవాంఛాఫలసిద్ధిరస్తు. త్రైలోక్యపరిపాలన ప్రాప్తిరస్తు.

శంబ—తథాస్తు.

బలి—దేవరవారి యాశీర్వాద మమోఘమగుఁ గాక.

బృహ—నిస్సంశయముగ- నిరాటంకముగ. ఆహా! ఎంతకాలమునకు చక్రవర్తి దర్శనము లభించినది!

శంక—దేవతాచార్యులకు మాసార్వభౌమునిపై నెంతటిదయ ప్రవహింపుచున్నది.

కాల—ఈప్రేమ నిజమైనదేనా?

నము—మీకుశలప్రశ్నము లటుండనిండు.

బలి—దేవగురూ! మావచ్చినపనిలేదు- మీశిష్యుఁ డింద్రునిటకు రప్పింపుఁడు- ఆతనిదర్శనముగాక చాలకాలమైనది.

బృహ—ఇడిగో- కుబేరునితో నతఁడుమీదర్శనమునకే వేచియున్నాఁడు.

ఇంద్రు—
కుబే— } దానవసార్వభౌమా! స్వాగతము.

బలి—(చూచి) ఓహో! తామిచటనేయున్నారా! ధన్యోస్మి- ధన్యోస్మి.

తే. గీ. దైత్యులను మాయఁజేసి సుధారసంబుఁ
ద్రావి కపటాత్ములగుచు ఘోరముగ మమ్ము
నచ్యుతుని సాయమునఁ గూల్చి నట్టి పటిమ
మరలఁ జూపింపు చూడఁగ మనసువొడమె.

బృహ—సత్కులసంజాతుండవును- ధర్మరతుఁడవునైన నీకు వేరుగఁ జెప్పవలసిన పనిలేదు చూడు—

తే. గీ. అక్కసెల్లెండ్ర సంతాన మగుటఁజేసి
పొసగు మిత్రత్వ శత్రుత్వములుఁ దమంత
వాని కిర్వురామోదింప వలయు నంతె
ఈర్ష్య లుంచుకోఁదగదు మీ యిర్వురెపుడు.

శంబ—(ఆశ్చర్యముతో) ఏమి ధర్మోపదేశము? తులసియుండ లూడి పడుచున్నవే.

నము—సముద్రమథనమునకుఁ బూర్వము మాబలిసార్వభౌముఁ డీ స్వర్గరాజ్యపాలన మొనర్చుతరి మీ, యీబిడౌజుఁడొనర్చిన నక్కటక్కులవలె లేవనియా దేవరవారి యభిప్రాయము?

కాల—ఔరా! దొంగదేవేంద్రా! ఆనాటి నీచర్యలు (చూపుచు) నాడొక్కలో మెదలుచున్నవిరా- అన్నయ్యలమట- తమ్మయ్యలమట- ఇంకేమేమని నమ్మించితివో జ్ఞాపకమున్నదా?

శంబ—అల్లమట- బెల్లమట- అమృతమట- సముద్రమథనమట- సమభాగములట- సమానులమట- అందరికి బలిచక్రవర్తియే ప్రభువట- కాదా? అనలేదా?

ఇంద్రు—(తలవంచి తనలో) ఆహా! దుష్కాలమహిమ!

కుబే—(తనలో) అమృతము మమ్మెట్టి మొండిజీవులఁజేసినది!

బలి—దేవేంద్రా! నాకు మిక్కిలి మాట లనవసరము.

బృహ—(అర్థోక్తిలో) చక్రవర్తీ! ఒక్కమాటకూడ ననసవరమే చూడు-

బలి—(అర్థోక్తిలో) మహాత్మా! తామట్లుండుఁడు. నాయభిప్రాయమును వినుఁడు.

బృహ—మంచిది. సరే. సెలవిండు.

బలి—వాసవా!

మ. సమరోర్వీతలమందు శాత్రవులు మెచ్చన్నిల్చి నిర్వక్ర వి
క్రమ మొప్ప న్మమునోటువుచ్చి జయము న్నైకొందుఁపో! యీసమ
స్తము మాకప్పనఁజేసి మన్నియమితాజ్ఞావర్తివై మాయమ
ర్మముల న్వీడి మెలంగెదో తెలుపు ధర్మంబిందు సాక్ష్యంబుగన్.

బృహ—మీయభిప్రాయానుసారియై దేవేంద్రుఁడు మిమ్మిపుడే చింతామణీ సింహాసనాసీనులఁజేయఁ దొరపడుచున్నాఁడు.

బలి—ఇంతే? ఇంతేనా? (నవ్వుచు) పరపరాక్రమమునకు శూరులు వెరచి-కిం-కం—అనక చేతులుఁగట్టుకొని సామ్రాజ్యపదవి సమర్పింతురా? వీరపురుషోచిత ధర్మమగునా?

నము—అబద్ధమబద్ధము. నమ్మఁగూడదు. మాయమాటలు.

కాల—నమ్మఁటయే ? అమ్మబాబో. అమాయకులవలెఁ గనిపించుటే గాని కడుపునిండ విషమేకాదు ?

శంబ—ఓయీ ! వెఱ్ఱివాఁడా ! ఈదేవతలకడుపులలో విషమేయున్న మనకిన్ని కష్టము లేలవచ్చును ? నాఁడే పీడబాసి పాడైపోదురు. మనపాలిట విషప్రాయులై కడుపులనిండ నమృతము నింపుకొనినారు. గండశిలలవలె నిలిచియున్నారు. గాన దేవతలందరు దొంగలు. దేవరాజు దొంగలమేటి. వారలకు గురువుగారు—

బలి—(అర్ధోక్తిలో) శంబరా ! నీవాగ్విజృంభణము మేరమీరుచున్నది.

శంబ—చిత్తము. పొరపాటు. క్షమింపుఁడు.

బలి—దేవగురూ ! నేనడిగినప్రశ్నకు ప్రత్యుత్తరము రాలేదు.

బృహ—దానవేంద్రా ! (చేతులు నలుపుకొనుచు) ఇదివరకే చెప్పితి. అక్కసెల్లెండ్ర బిడ్డలుగాన నెవ్వరికి ప్రభుత్వమున్నను నిరువెగల వారామోదమునఁ గలసిమెలసి యుంటయే సర్వశుభోదయావహమగును కావున ప్రశ్నోత్తరములతో బనిలేదు. ఈమహేంద్రుఁడు స్వయముగా మిమ్ము సింహాసనమం దధిష్ఠింపఁజేయును. నేను ప్రీతిపూర్వకముగ శుభాకాంక్షలుంచెదను. తక్కిన దేవతలందరు మీయాజ్ఞానుసారులై వర్తించుటకు సంసిద్ధులైయున్నారు. సంశయమేమికలదు. ఆలస్యమెందులకు.

శంబ—తథాస్తు. తథాస్తు.

బలి—ఇంకల కింద్రుఁ డొప్పుకున్నాఁడా ?

కాల—అదేచూచుచున్నాను. మాటలేదు. మన్ననలేదూ ?

నము—ఇంకేమిమాట ? బెల్లముఁగొట్టినరాయి- గుడిమీదబొమ్మ.

ఇంద్రు—(తనలో) విధి. (అని తలనూచి ప్రకాశముగ) దానవసార్వభౌమా ! త్రికరణశుద్ధిగా మదాచార్యోపదేశమున కంగీకరించినాను.

శంబ—అమ్మయ్యా! ఇంద్రుఁడిప్పు డూపిరి విడిచినాఁడు.

కుబే—(తనలో) నిజము యీపరాభవమునకన్న నూపిరివిడుచుటే చాలమంచిది.

బలి—అటులైన మదాజ్ఞఁ జక్కఁగ నాలింపుఁడు.

తే. గీ. యాగములరాఁబడెడు హావిర్భాగములను
ముట్టరాదు మీరేలోకమును త్యజించి
పొమ్మనినఁ బోవలెదమును రమ్మటన్న
వచ్చి చెప్పినట్లు మెలఁగవలయునిఁక.

ఇంద్రు—(తలనూపుచు.)

బృహ—నిరభ్యంతరముగ.

శంబ—(కుబేరుని వెన్నుఁదట్టి) నీవు మాటాడవేమి?

కుబే—విధి. (అని తలనూపుచు.)

నము—(తనలో) ఇంద్రదులు బేపలు గంగిరెద్దులవలెఁ దలలూపుచున్నారు. మంచిది. (ప్రకాశముగ) దేవగురూ! సత్యవ్రతులగు పెద్దలు తా మబద్ధమాడరని నాకు గట్టినమ్మకము. గాన మిమ్మొకటి నే నడిగెదను. నిజముఁదెలుపుఁడు. మేమిటకు వచ్చువరకు మీ రేదియో యోజింపుకొనుచున్నా రదియేమి?

ఇంద్రు—(తనలో) ఔరా! రాక్షసులకు బృహస్పతిపై దృష్టి విడిపోయినది. కాలమహిమ.

బృహ—ఆఁ- అట్లడుగుదు. మీతోఁగలసి దాడివెడలిన బలిచక్రవర్తి నెదుర్కొని తోడ్కొనివచ్చి తత్క్షణము ప్రీతిపూర్వకముగ స్వర్లోకసామ్రాజ్య మొప్పగింపుమని చెప్పితిని. వారును దానికు సమ్మతించిరి. ఇంతలో మీరే వచ్చితిరి.

బలి—సేనానీ! నముచీ! నీకునుఁ బొరపాటేనా?

తే. గీ. తల్లిదండ్రుల గురులఁ బెద్దల హరిశ్వ
రాములఁ బరీక్ష సేయఁగ రాదటంచు
సంస్కరించుకొంటిమి దాటఁ జనునె నీకు
ప్రథమదోషమగుట క్షమింపఁగఁ బడితివి.

బృహ—(తనలో) నీధర్మబుద్ధికి మెచ్చితి. కావుననే నీకింతటి యౌన్నత్యము.

నము—చిత్తము. పొరపాటే. క్షమింపుఁడు.

శంబ—ఇంకను పట్టాభిషేకమున కాలస్యమేల?

బలి—తొందరవలదు. మదయాచార్యుల వారేతెంచి యొనరింతురు గాక-బిడౌజా ! అంతవరకు నీవిలాసభవనమునకుం దారిఁ జూపుము.

ఇంద్రు—ఇటునటు (అని దారిఁజూపును.)

(నిష్క్రమింతురు.)

---

ద్వితీయ్యాంకము. 2 వ రంగము.

స్వర్గమందొక యారామ ప్రదేశము.

[విషదంతి ప్రవేశము.]

విష—జామున్నర ప్రొద్దుమీరినది. మామాపి యింకను రాలేదు. నాకేమీ తోచడము లేదు. మనసంతయు పిచ్చిపిచ్చిగ నున్నది. నడమంత్రపుకట్టుబొట్లట. ఏనాఁ డెఱుఁగని మాకిప్పుడు గొప్ప యిబ్బంది వచ్చింది. ఇదివరకు మాకులములో యెవరియిష్ట ప్రకారము వారువారు తిండిలోనేమి, తిరగడంలోనేమి, సంతోషంగా యుండేవాళ్ళం. పూర్వపుదొరల యేలుబడి చల్లగా యుండ, తాము, తమవారు ఏంచెప్పేది. బలే. అదిలించేవాఁడు లేకుండ కులాసగా బ్రతికినారు. పుట్టుకంటే వారికే దగుఁ గాని మావేం పుట్టుకలు. పాడుపుట్టుకలు. సీ, సీ, పగవాండ్లనా మావంటి

పాపపుపుట్టుకలు పుట్టకూడదుబాబూ ? ' దేనిమొగనితో నదే చావవలెనఁటగాని, రెండోవాణ్ని కన్నెత్తియైనఁ జూడఁగూడదఁట. ఈపాడుపాపపుకష్టం పూర్వీకులైన మావాండ్లు, తుదకు కలలోనైనా యెఱిఁగియుందురా ? ఏడాదికీ యేడు మనములూ, యార్నాలకావడీ మాకులంలో అందరికీ వుండేదె. అది యీబలిచక్రవర్తి యేలుబడిలో పేరుమాసిపోయింది. అబ్బా ! అనుకోగూడదుకాని, వెనుకటి ఆయనుభవమంతా తలచుకుంటే జ్ఞాపకంవచ్చి జీవంపై భీయనిపిస్తూంది. ఆహాహా ! ఆనంజుడు, ఆనల్ల,ఆకల్లూ, షోకుగా, మజాగా, మెహరుగా నుంచుకొని, అమ్మయ్యో, మళ్ళీజ్ఞాపకముచెయ్యకూడదు (అనిగుటకలువేసి సర్దుకొని) వేయిమాటలేల. కఠినపథ్యముజేసె రోగికైనను, మాయిప్పటిపాడుతిండి పెట్టరాదు. ఏమో, ఏలాగో, గతిలేక బ్రతుకు గడుపుకుందామనుకుంటే ! యీమొగుఁ డెక్కడి మొగుఁడో ? వీఁడుమొద్దుల్లోఁ జేర (మెటికెలువిఱచి) సముద్రమథనమునకు వెళ్ళి వచ్చింది మొదలొకటే పిచ్చి. ఒకటే వెఱ్ఱి. అదేంరోగమో గుర్తించినవారేలేరు, ప్రత్తికాయలట్లు గ్రుడ్లునిల్పి చూస్తూనేవుంటాడు. పాడుకల్వరింతలేమో కల్వరిస్తూనే యుంటాడు. పడుకొన్నట్టివాఁడు చివాలునలేచునా ? రాయీ, రప్పా తాకినను, తప్పినను, పడినను, లేచిననూ, తెలివి లేక, ఎండయనక, వానయనక, ఆకలియనక, నిద్రయనక, ఎప్పుడూ తిరుగూతూనేయుంటాడు. పడివుంటే, అట్లే లేపినా లేవకుండా వుంటాడు. అడిగినను తాను కారణమెన్నఁడు చెప్పదు సరికదా, చూచేవారికిని తత్కారణముతోచకున్నది. మాలో కొందరుతెలిసినపెద్దలు దయ్యంపట్టిందని నిశ్చయించి, మంత్రించి, పొగలువేసి, చెప్పులతోఁ జీపురులతోఁ దిగదుడిచినా

రు. ఎన్ని చేసినను, దినదినమా వెట్టి యెక్కువయేగాని, తక్కు-వన్నమాటయే లేదు. ఎంతకాలం యీకష్టాలుపడేది. పాచినకూడు భక్షింపవీలగునా? అని, యీమొగణ్ని వదలుకుందామా. అమ్మబాబో, మహాకఠినమైన నూతననిబంధనము. రాజాజ్ఞ అనుకోనేకూడదు. తప్పదు. (యోచించి) మాయన్న, మాయావి యీవెట్టికి మందెఱుఁగుదునని, కుదర్చెదనని, నన్నుఁ దనకు సాయముగా నుండుమనిన్ని చెప్పి, ఇప్పుడేవచ్చెదనని చెప్పి వెళ్లినాఁడుగాని, మరే. నాకుమాత్రం నమ్మకంలేదు. (ముందుకుఁ జూచి) అదిగో, అనుకొనునంతలో మాయావి రానే వచ్చినాఁడు.

[మాయావిప్రవేశము.]

మాయా—అమ్మాయీ! విషదంతీ! (చూచి) ఆఁ! ఇచటనేయున్నావా? నేఁ జెప్పినమాటలు జ్ఞాపకమున నుంచుకొన్నావా?

విష—మరచిపోలేదు. జ్ఞాపకముననున్నవి. కాని—

మాయా—(అర్ధోక్తిలో) ఉండు. మాట్లాడకు. బావ వస్తూనే యున్నాఁడు. నేఁ జెప్పినరీతినుండుము.

విష—(నిండుగముసుఁగిడి పండుకొనును.)

మాయా—ఇర్వురిరాక్షసుల మఱియొకచోట మరుగుగా ముసుఁగులు వేసి కూర్చోబెట్టును.)

[ప్రవేశము-ముండకుఁడు.]

ముండ—బావా! మాయావీ!

మాయా—ఆఁ! బిగ్గరగాఁ బిలువకు. యిటురా.

ముండ—చీకటిగనున్నదె, యెట్లురాను.

మాయా—రాక్షసుఁడవు కావా?

ముండ—అవును. అయిననేమి బావా ! నీవొకఁడవేయున్నావా?

మాయా—నామట్టుకు నేనొక్కఁడనే గదా.

ముండ—అనఁగా ?

మాయా—ఆఁ! నీమొగము, ప్రతివిషయమునకు ప్రశ్నోత్తరములు, అనుమానములును, సరే, త్వరగారా ?

ముండ—(వచ్చి) చెప్పవేమిబావా ! నాయదృష్టంపండినదా ?

మాయా—ఆహా ! చక్కఁగా. నీకోరికవ్యర్థమగుటయేనా ? మహాదృష్టవంతుఁడవు బావా.

ముండ—మరే, నాయదృష్టమనుటకు వీలులేదుకాని, నీయనుగ్రహప్రభావమనిమాత్ర మనకఁ దప్పదు. బావా! ఇటుచూడు. వచ్చినదా ?

మాయా—ఆఁ !

ముండ—ఇక్కడికేనా ?

మాయా—ఆఁ !

ముండ—(సంతోషమునఁ దనలో) ఇంకేమి, యింకేమి, ధన్యుఁడనైతి (ప్రకాశముగా) చూడుబావా ! మనదానవవంశముయొక్కయదృష్టము మిక్కిలి యుచ్చస్థితిలో నున్నట్లు కనుపడుచున్నదేమి ?

మాయా—కాలగతి.

ముండ—ఆఁ ! అట్లుంటివేమి ?

మాయా—తప్పేమి.

ముండ—తప్పోయొప్పో కాని కొంచెమశ్లీలమనిపించినది. అదిపోనిమ్ము. బావా ! యిక్కడెక్కడవుంచినావు ? నాకుఁ జూపవేమిా ?

మాయా—మంచిది. చూపెదను. కాని, నీవీరహస్యమును నీభార్యతో నెప్పుడైనఁ జెప్పితివా ?

ముండ—భార్యా, ఇంకెక్కడిభార్య. దానిసంగతి నాకడ రానీయకు బావా! నీకు దండమైనఁ బెట్టెదను.

మాయా—ఎందుచేత?

ముండ—చీ, చీ, కుంకరండముండ. నాకుమొదటినుండీ దానియందిష్టము లేనే లేదుగదా. ఇట్టినామతి నాకు లేనిస్థితిలో, ఆడవాండ్రందరితో దయ్యముపట్టినదని చెప్పిందికాబోలు. వెధవగాడిదతొత్తులు వాండ్రందరు వేలంవెఱ్ఱిగా నన్నుమూగి, చీపురుదెబ్బలు—ముంతపొగలు, అబ్బా, ఆపాడుగోల, యేమనిచెప్పుదు బావా! మొండివాఁడఁగాన బ్రతికినాను. లేనిచో చావవలసినదే బావా!

మాయా—నీకువెక్కసంబగు యనుభవ మెంతయో యింకనుభూమియందు బాకీయున్నది గావున బ్రతికితివి. కాని, నీకాయుపచార చికిత్సలన్నియు నీవు బాగుపడవలయునని చేసినదికాబోలు. నీభార్యత ప్పిందేమున్నది.

ముండ—తప్పు లేనే లేదా? మంచివాఁడవే. అబ్బా! ఆకాకిగోలకాగలేక మఱింత వెఱ్ఱివాఁడనై, అడవులబడియైనఁ బోదామనుకొని పోవుచుండ, మనవాఁడెవఁడో యొకఁడు వెదకి నన్ను బట్టుకోవడం. అదేమినాపాపమో. దానికే మళ్లీనప్పజెప్పడం.

మాయా—పాపముకాదు. పుణ్యమే. సంఘనిబంధనలు కావూ?

ముండ—కాబోలు. యేమైతేనేమికాని, దానిపేరుమాత్ర మిచటఁదేకు.

మాయా—అటులేగాని, నీవప్పురసపైఁ బెట్టుకున్నప్రేమను మరల్చుకొని, నీభార్యపైని నీప్రేమనుఁ బ్రవేశపెట్టుకొనుట మంచిదనుకొనెదను.

ముండ—ఇదిగో చూడు. నీకెన్నిమారులు జెప్పినను, నీవాప్రశంస మానవుగాన నీకన్నులయెదుటఁ దలఁబగులఁ గొట్టుకొని చచ్చె

దను. నీవు, నీచెల్లెలు కన్నులు చల్లఁగాఁజూచి సుఖముగ బ్రతుకుఁడు.

మాయా—పోనీ. క్షమింపుము. పరిహాసముకాదూ ?

ముండ—పరిహాసమునకు వేళయుండదా ?

మాయా—బావమరదులకు వేళయేమిటి.

ముండ—ఏదోలే. పోనిమ్ము. పాడుప్రశంస మధ్యఁ బడినది. బావా! అది యేదిచూపవు ?

మాయా—అవశ్యము. (అపవారించి) చూడు. దానికొక యుంపుడుగాఁడున్నాఁడని కర్ణాకర్ణికగా తెలియవచ్చినది. ఆతఁడు గంధర్వుఁడఁట. సమస్తమాయావేదియఁట. ఎట్లో యీసంగతి పసిఁగట్టి వాఁడే తెంచెనా నీవు నిజముగా చచ్చినవాఁడవే. చావక బ్రతికినను- వాఁడు యిక్కడికివచ్చి పట్టుకొనకున్నను- యీపాప మీరుగడియల కెక్కువ దాగదు. వెల్లడికాక మానదు. చక్రవర్తిగారి కఠినశాసనమువలన నీకు, నాకు తలగోట్లు తప్పవు. కావున బహు జాగరూకుఁడవై వర్తింపు సుమా.

ముండ—ఓ! అందుకేమి. మొదటినుండి శపథముజేసి నే నెన్నిసంసారములఁ గూలఁదీసితినో నా తెలివితేటలు నీవు బాగుగ నెఱుఁగవు. ఈవిషయమున నాకు మహాపండితుఁడనుబిరుద మీయదగినదిబావా!

మాయా—సరే. యింకనేమి. కడతేరితివి.

ముండ—అదేమి. అమంగళగర్భితముగ మాట్లాడెదవు ?

మాయా—చీ చీ. అమంగళ మేమున్నది. కృతార్థుఁడవైతివనుటయే కాదూ ?

ముండ—సరియే. ఇఁక దానిఁ జూపింపుము.

మాయాం——(పరున్న విషదంతినిఁజూపుచు) అదిగో పరున్నది. ప్రసన్ను రాలం [illegible]సికొని సుఖపడుము. నే నేగెదను. (నిష్క్రమించును.)

ముండ——(నమస్కరింపుచు) నీకడుపు వర్ధిల్ల. పరోపకారివన్న నీవేరా నాతండ్రీ! జీవితాంతమువరకు నీపాదసేవఁజేసినను నీఋణముఁ దీర్చుకొనుట కష్టము. (ముసుగును సమీపించి) దీనిపేరేమో? అయ్యో (చేయినలుపుచు) మాటలసందడి నడుగ మరచితినే. ఆ మాయావియైనఁ జెప్పకపోయెనే. మంచిది. దీనినే యడిగెదను. (పిలువలేక నిర్వేరపడి- ముట్టుకొనఁబోయి సిగ్గుపడి-మాన లేక వేగిరపడి - సంతోష లజ్జాశ్చర్యాభినయములు నటించి) పి-పీ-పీ-ప్రియురాలా!

ముసుగులో——ఆఁ-

ముండ——(సంతోషమున నెగురుచు) నె-నే-నే-నేను.

ముసు——నీవెవరు?

ముండ——ముండ - ముండకుఁడను.

ముసు——నేను ముండనా?

ముండ——కాదు. నేనే.

ముసు——నీవు ముండవా?

ముండ——కాదు. నేను ముండకుఁడను.

ముసు——అనఁగా?

ముండ——నీకుఁ బ్రియుఁడను.

ముసు——ఎప్పటినుండి?

ముండ——చాలాకాలమునుండి.

ముసు——నాకేమీ తెలియడం లేదు.

ముండ——నీ పేరేమి?

ముసు——చిత్రరేఖ.

ముండ—ఆఁ- ఆలాగా- కావుననే నాఁడు నాకన్నులట్లు మూతలుపడి పోయినవి. నాపేరు నీ వెఱుఁగనే యెఱుఁగవా ?

ముసు—నాప్రియుఁడవే నేమో ?

ముండ—కానా ?

ముసు—అయిన నెఱుఁగ కేమి ?

ముండ—ఏదీ నాపేరుతో నన్నుఁ బిలువుము ?

ముసు—ఏమో నాకు సిగ్గుగ నున్నది.

ముండ—(సంతోష వికారములు నటించుచు) మొదలు నీపేరుతో నిన్ను నేను బిలచెదను. పిదప నన్ను నీవట్లు బిలచెదవా ?

ముసు—ఆ !

ముండ—(బిగ్గరగా) ప్రియురాలా ! చిత్రరేఖా !

(దాగియున్న యిరువురిరాక్షసులలో నొకఁడు లేచి)

1 వ రాక్ష—ఓయ్- ఏమండోయ్- (అని ముండకుని సమీపించును.)

ముండ—(భయమున) అమ్మో. (అని అరచుచుండును )

ముసు—(విషదంతి లేచిపోవును.)

1 వ రాక్ష—(ముండకుని జుట్టుఁబట్టుకొని) ఎవఁడవురా గాడిద ?

ముండ—(వడకుచు) అమ్మో. మే-మే-మే. (అనును.)

1 వ రాక్ష—(జుట్టూపుచు) చెప్పవేమి ?

ముండ—అయ్యో ! అయ్యో ! ఆ- (వడకుచు )

1 వ రాక్ష—అయ్యో, మాకు నీవయ్యవటరా ? (అని లెంపకాయ వేయును.)

ముండ—కాదయ్యో- ముండ- ముండ- ఆ- ఆ-

1 వ రాక్ష—ముండా- ముండవటరా ? (జుట్టులాగును.)

ముండ—అమ్మో! కాదుబాబో ! కాదయ్యో.

1 వ రాక్ష—మరియేమిరా ?

ముండ—నీవు ముండవుకాదయ్యో.

1 వ రాక్ష—మరియెవరురా ?

ముండ—నేను ముండకూ- డను.

1 వ రాక్ష—నీవు ముండకూడువా నాతోఁ బరిహాసమా ? (అని మరి యొకలెంప వేయును.)

ముండ—కాదయ్యో- కూడుగాదయ్యో.

1 వ రాక్ష—మరియేమిటిరా? ఊ. త్వరగా ? (జుట్లూపును.)

ముండ—అయ్యో! బాబో! నాపేరు ముండకుఁడయ్యో.

1 వ రాక్ష—నీపేరు ముండకుఁడా ?

ముండ—ఊఁ.

1 వ రాక్ష—చిత్రరేఖా యని పిలిచితివే ?

ముండ—ఆఁ-

1 వ రాక్ష—ఏదీ ఆచిత్రరేఖ ?

ముండ—ఇదిగో (అని ముసుగున్న చోటుఁ జూచి డిల్లపోవును.)

1 వ రాక్ష—ఏదిరా ? చూపవేమి ?

ముండ—లేదయ్యా.

1 వ రాక్ష—నాతో పరిహాసమా? దొంగమాటలా ?

ముండ—కాదయ్యా- నిజమే.

1 వ రాక్ష—నిజమని- లేదని- అపభ్రంశసంభాషణమా ? అసలుసంగతియేమో నిజము చెపుతావా లేదా ? (అని కాలిచెప్పును దీసి చూపుచు) చెప్పూ- ఇక- నిజముచెప్పు ?

ముండ—(భయమున) అమ్మో- నిజమే- చెప్పె- చెప్పె- (అని కేకలు వేయును.)

(డాగిన రెండవరాక్షసుఁడు క్రోడకుఁడు లేచి)

క్రోడ—ఎవరు ? ఎవరు ?

అందఱు—దొంగలు- దొంగలు (అరతురు.)

ముండ—(అందఱికన్న నెక్కుడుగ నరచుచు) చస్తి చస్తి బాబయ్యో.

క్రోడ—(1 వ రాక్షసునితో) వీనిపిలుకఁబట్టినావు నీవెవరు ?

1 వ రాక్ష—దొంగ కావున నీవెవరు ?

క్రోడ—సార్వభౌమ నగరరక్షకభటులము. నీవెవరు ?

1 వ రాక్ష—మేము నట్టివారమే.

క్రోడ—నీపేరేమి ?

1 వ రాక్ష—చెప్పఁ గూడదు.

ముండ—(తనలో) వీండ్రు రక్షకభటులురా బాబూ, నాకొంపమునిఁగి
నదిరా తండ్రీ.

క్రోడ—వీఁడెవ్వఁడు. ఏమిదొంగతనమొనర్చినాడు ?

1 వ రాక్ష—చిత్రరేఖా ! యని యీయర్ధరాత్రినెవ్వతెనో వీడుపిలచి
నాఁడు. వివరమునడుగ నడ్డదిడ్డముగ వాగుచున్నాఁడు.

క్రోడ—(ముండకునితో) ఏమిరా, నీకుభయమువలదు. నిజముచెప్పు
ము. చిత్రరేఖనుపిలచితివా ?

ముండ—ఆ ! పిలచితిని.

క్రోడ—చిత్రలేఖయెవరు ?

ముండ—అప్సరస.

క్రోడ—ఎందుకుపిలచితివి ?

ముండ—నాప్రియురాలు గనుక పిలిచితిని.

క్రోడ—నీవెవరు ?

ముండ—చక్రవర్తిసేనలో నొక చేతగానివాఁడను.

క్రోడ—చక్రవర్తిసేనలోనివాఁడవా ? దానవుఁడవా? అప్సరస నీకుఁ
బ్రియురాలా ? దానికి నీకు నిండరికసంబంధమా ?

ముండ—లేదు లేదు. ఇదివరకు లేదు.

1 వ రాక్ష—అదిగో తప్పుకొనుచున్నాఁడు. వెఱ్ఱిమొగుఁగుళ్ళు మొదలిడుచున్నాఁడు.

క్రోడ—(ముండకునితో) ఇదివర కేమి లేదురా.

ముండ—మిండరికము- సంబంధము.

క్రోడ—ఇప్పుడున్నదా ?

ముండ—లేదండీ.

క్రోడ—వెఱ్ఱిమాట లేమిరా ?

ముండ—(బిగ్గరగా) వెఱ్ఱివాఁడనే- వెఱ్ఱివాఁడనే.

[ప్రవేశము విషదంతి.]

విష—ఏడీ ? వెఱ్ఱివాఁడేడీ ?

క్రోడ—నీవెవరు ?

1 వ రాక్ష—(నవ్వుచు) ఇదియే చిత్రరేఖయేమో ?

విష—మీరంటే నే నౌతానండీ? నాపేరు విషదంతి. దానవాంగనను.

ముండ—(భార్యనుగుఱ్ఱించి) అమ్మా. (అని కౌఁగిలించుకొని యేడ్చును.)

క్రోడ—అదేమి విషదంతీ! వీఁడెవఁడు?

విష—నా పెనిమిటి నాయనా !

క్రోడ—ఏమీ! నీపెనిమిటియగు ముండకుఁడా యితఁడు ?

విష—అవును తండ్రీ.

క్రోడ—ఏమో చిత్రరేఖనుగూర్చి వెఱ్ఱిగ మాటలాడుచున్నాఁడేమి ?

విష—చిత్రరేఖ లేదు- మ రేమీ లేదు. నామగనికిఁ బిచ్చియెత్తి చాల కాలమైనది. మనవారందఱు గుర్తింపగలరు బాబూ.

క్రోడ—నేనుకూడ నెఱుఁగుదును. ఈపిచ్చివానితో నీవు స్వర్గమునకు వచ్చినావా ? సరి- ప్రమాదముతప్పినది. నీవు నీమగనితో నగరిలోనికేగుము. (1 వ రాక్షసునితో) రహస్యవేదీ! భ్రమపడితిమి. వీఁడు పిచ్చివాఁడే. పోదమురండు.

(అందఱు పోయెదరు.)

---

ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము

## తృతీయాంకము.



### ప్రథమరంగము.

కశ్యపాశ్రమ ప్రదేశము.

[అదితి, బ్రాహ్మణవేషధారియైన యింద్రుఁడు ప్రవేశము.]

అది.—తండ్రీ! ఇంతకు నేనే దురాగతను చూడు.

మ. తమసంతానముతో సమానముగ మాకెల్గూడఁ గష్టంబో సౌ
ఖ్యమొ పాల్గైకొని జీవితంబు నడుపంగా ధర్మమార్గాని దు
ర్గమ దుర్వారవిపద్దశాత్మజ వియోగప్రాప్తిచేకూరి దుః
ఖములిట్లొందెడిభాగ్యహీన లెట నింకన్బుట్టఁబో రక్కటా!

దుఃప్రాప్తి కేమిచేయగలము కాని నాతండ్రీ! యూరడిల్లుము. మనకు మరల మంచిదినములు రాకుండునా?

ఇంద్రు.—అంతేనా తల్లీ! మనకు మంచికాలమే తెంచువరకు పౌరషమును దిగద్రావి గాజులు తొడిగికొనిన ట్లొకనియాజ్ఞకులోనై ప్రాణమానము లాతనికర్పించి తదనుగ్రహప్రాప్తికిఁ దపింపుచు కాలముఁ గడుపుమనియేనా మీయభిప్రాయము గూడను! ఆహాహా! పరమపవిత్రమగు భవద్గర్భంబున జనించి మహామహుఁడగు కశ్యపబ్రహ్మసంతానమునం దుత్తముల మనిపించు

కొని నిరుపమానమగు గౌరాబమున నీహ స్తపద్మములలో వర్ధిల్లి త్రైలోక్యప్రాభవవైభవానుభవతేజోవంతులమై, పటిష్ఠసాధన పరాక్రమోపేతులమై, జగజ్జేగీయమానకీర్తనీయులమైన మేము చేతగాని సోమరులఁబోలి బలిదానవునియనుచరులఁ గొలుచుచు బ్రతుకవలసినదేనా ? మాగతి యింతేనా ?

అది—దుష్కాలము మనపాల నిట్లున్న నింకేమిచేయఁగలము తండ్రీ ?

ఇంద్రు—అయ్యయ్యో ! ఎంతకష్ట మెంతకష్టము ! దుష్కాలము వచ్చిన దని మహాసమర్థులమగు మేము పౌరుషశూన్యుల మేలకావలయుఁదల్లీ?

సీ. దేశహర్తలనాజి ధిఃకరించి పెనంగఁ
జాలిన విక్రమ శక్తిలేదొ
పరమహాతకులైన ప్రతివీరులకువలె
కదనోర్వి నిలచు పట్టుదలలేదొ
నిన్న మొన్నటిదాక నీచాతినీచతఁ
బొంగు వైరులకున్న బుద్ధిలేదొ
అన్యోన్య వైరులౌనరి వీరులకుఁబోలె
నైజకులాభిమానంబులేదొ

తే. గీ. సౌఖ్యమననేమొ తెలియఁగఁ జాలనట్టి
పిశితభుక్కుల కటుసుఖాపేక్ష లేదొ
నాగరకతావిహీనకా ననచరులగు
గోత్రబజలంతైన పౌరుషములేదొ.

సంతతమధుపానమత్త చిత్తవిభ్రములగు క్రూరరాక్షసులకు నూతనముగ మధ్యవైష్ణవునివలె మతసాంఘికాది సద్వర్తనము లలవడిన మాత్రముననే సహజధర్మప్రసిద్ధులై, సత్కులీనులై, సర్వేశ్వరప్రియులై సుధాపానతిరస్కృతమృత్యువులై లోకపూజ్యులైయున్న దేవతలు

చేతులుగట్టుకొని కిక్కురు మెక్కురనక దాసానుదాసులై పాదము లొత్తుచుఁ బాదరక్షలఁ దుడుచుచు వారల యనుగ్రహప్రాప్తికిఁ బడ రానిపాట్లుబడుచు చేయరాని నీచకృత్యములు జేయుచు చెప్పరానిమా టలఁజెప్పుచు మొండిప్రాణముల భారమనక భరించిబ్రతుకుమనియే కదా తల్లీ నీయభిప్రాయము ?

అది—హరిహరీ. నాకర్ణరంధ్రము లింకను బ్రద్దలుగాకున్న వే? (నిట్టూర్పు విడిచి) వత్సా ! దూరదృష్టిగల కులగురువరేణ్యుల యభిప్రాయ మిట్టే యున్నదంటివికదా ?

ఇంద్రు—కులగురుని యభిప్రాయ మెట్లున్న నేమి ? మీరుమాత్రము గురువులుకారా ? మీ యాశీర్వాదము మాంపాలిట కమోఘ ముకాదా ? మీరు మాకు నిష్కంటకసామ్రాజ్యప్రాప్తిఁ జే కూర్ప సమర్థతకలవారుకాదా ? అమ్మా! నిక్కముగ మాకు మీకన్న నెక్కుడగు ముఖ్యులెవ్వరున్నారో యోచింపుము. చూడు—

తే. గీ. దైవబలమె ప్రాముఖ్య మర్థానికన్న
గురుకృపాబల మద్దాని ♦ గుణముకన్న
తండ్రిడీవనబల మెచ్చు ♦ తథ్యమన్ని
మించు జననియాశీర్వాద ♦ మంచు వినమె.

సమాతుః పరదైవతమ్మను నీతి మీ రెఱుఁగనిదియా తల్లీ !

అది—కావచ్చునేమో కాని నిరంకుశతపః ప్రభావులును, బ్రాహ్మ ణోత్తములును, అమోఘవచస్కులునగు శుక్రగురుకృపాప్రాప్తు లు రాక్షసులైనారనియు శుక్రునిసంకల్పము తప్పక నెఱవేరి తీరునని మనగురువరులే చెప్పినారంటివే ?

ఇంద్రు—అవును. నిక్కువమె. ఇదియొక్కటే మనగురుఁడు చెప్పినాఁడా? వినుము.

తే. గీ. సకలమైన శక్తులు తపశ్శక్తి కోడు
నాతిపశ్శక్తి యోడు మహాపతివ్ర
తామహిమ కట్టి పుణ్యసాధ్వీమతల్లి
సాయమే యెల్లరను బాగుసేయవలయు.

అట్టి సతీతిలకమవు ప్రస్తుతము నీవేననియు, నీయనుగ్రహముగాక యితరము లెవ్వియు నిరర్థకములే యనియు గట్టిగ నొక్కిచెప్పినారు తల్లీ !

అది.—అంతటి ప్రభావము నాయందున్నను లేకున్నను, అస్వతంత్రను, పతి యాజ్ఞాబద్ధను, నాతండ్రీ! నీవెఱుఁగనిదేమున్నది. అయిన నింకను నేనేమి చేయఁ గలను. నాయందేమి సమర్థత యున్నదంనువు ?

ఇంద్రు.—నీయందుసమర్థతయే లేదా ? నీవేమియుచేయలేవా ? సమర్థత కలవారు చెప్పకుందురా? తల్లీ ! నీయస్వతంత్రబలమే—నీపతి యనుసరణబలమే— నీ పాతివ్రత్యమహాప్రభావమే మముఁ గృతార్థులఁ జేయఁ గలదు. నిజముగ మేము పడుచున్న కష్టము లన్నిటిని నీ మనసున కెక్కించుకొని, మననహాపమున నించుక మధించిచూచితివేని, నీహృదయకుహరమున చిటచిటారావ విస్ఫులింగసంగత ప్రళయాగ్నిజ్వాల భగ్గునినుండి దానవవంశ మహాకాననంబుల దహింపఁ జాలకుండునా? మాహృత్తాపముల హరింపలేకుండునా ?

ఉ. చూపులుచాల్లగత్సునిరి ప్రస్ఫురించుచవాగ్ని రేప, హృ
త్తాపము చాల్చరాచరవితానము ధ్వంసముగా నొనర్ప, నీ
శాపముచాలదే తుదకు సర్వముశూన్యముజేయ తల్లి ! మా
పాపఫలంబునీకుఁ దగు భావముగల్గనీయదింతకున్.

అమ్మా! నీవు చేయరానిపని యేమున్నదో చూడుము. అంతకుసహజ శాంతచిత్తవును, అనవరతభర్త్రానుకూలవర్తనవును, స్వాభిలాషదూరవు

ను, గాన, నీసంతానకష్టపరంపరను మనసునకు రానీయకున్నావు. తల్లీ! సురలనుభవించుపాట్లును, దిక్కుమాలిన విలాపములును, ఘోరరాక్షసాధములొనర్చెడి బాధలచే నల్లాడుటలును, కన్నులనిండఁ జూచినవాఁడ నగుటచే, ప్రేవులు దరిగినట్లు, గుండెనుండి పోవుచున్నట్లు, రక్తనాళములు పెల్లుమని ప్రేలి వెచ్చనినెత్తురు స్రవించుచున్నట్లనిపించి, యొడలు జలదరింప, బ్రతుకు విసుగుతోప, కర్తవ్యము కనిపింపక, దిక్కు లేక దిక్కులు బరికించి, నిరర్థకసాధనములని వజ్రాదియాయుధముల దూరముగ నేలకు మోది, యమృతపానమునకు మిక్కిలి విచారించుచు, ఉత్తుంగతరంగములతో నుబికి పొంగి పొరలివచ్చెడి దుఃఖసాగరవేగమున కాగలేక, నిట్టనిలువున నేలకొరగి, దరిలేనిపరితాపమునం బొరలుచుందు. తల్లీ! తలంచు కొన్నంతనే నాతనువు భగ్గుమనిదహించుకొనిపోవుచున్నది. ఇంకనేఁ జెప్పఁజాలఁ జెప్పఁజాల, (అని నిట్టూర్పువిడుచును.)

అది—ఆహాహా! (చెవులుమూసికొని) పాపముపశమించుఁగాక! పాపముపశమించుఁగాక! (ఎదపై చేయినుంచి నిట్టూర్పు విడుచుచు) దుర్భరము. దుర్భరము. (ఇంద్రునితో) నాతండ్రీ! యింకఁజెప్పకు. నీకష్టము వినఁజాల. భరింపఁజాల.

ఇంద్రు—తల్లితోఁ దులతూఁగఁగలవస్తువు సృష్టిలో నెద్దియులేదనియు, కన్నతల్లితో విన్నవించుకొనక కడుపునుంట చల్లారదనియుఁ జెప్పుకొనుచున్నాను. కావున, వినక నీకుఁ దప్పదు. చెప్పక నాకునుఁ దప్పదు. (స్మృతినభినయించి.)

సీ. లోకపాలన సౌఖ్యలోలురౌపూజ్య ది
కృతు లడవుల శ్రమఁబడుటఁ జూచి
దివ్యసాధంబులఁ బిరుగనేరనిసతుల్
కాందిశీకప్రాయగతులఁ జూచి

నందనాద్యారామకబృందచరామర
కంటకాగమన నిక్రాంతిఁ జూచి
ఎంకడన్నెమాత్ర మెఱుఁగని వేల్పుటిం
తులు విపద్దశల మొత్తుకొనఁ జూచి

తే. గీ. అమరయువతీమణులు యాడికగములొనర్ప
నిరుపమానందమునఁ దేలు నీకుముద్దు
కోడ లిడుమలఁ గ్రమ్మగ్గ యల్లాడఁ జూచి
మోడువలెనుంటిఁ జావుకు మొగము వాచి.

అది—(చెవులుమూసికొని) అమంగళము ప్రతిహతమగుఁ గాక ! ప్రతిహతమగుఁగాక !

ఇంద్రు—ఉన్నవి. ఇంకెన్నో కష్టములున్నవి. అవ్వి యనుభవైక వేద్యములు. తల్లీ! తుది నామనవి యేమనఁగ, నింకుల కేదేని విముక్తి మార్గ మాలోచించిచెప్పుము. తోచదంమువా ?

చ. అమృతముద్రావి మొఁడినయి యక్కటవైరినెమర్ప లేక, మృత్యుముఖమునందుఁ జొచ్చుటకు యోగ్యతయుస్గనలేక వ్యర్థజీవములు భరించి నీకునపచారముఁ గూర్చెదువీనినన్ను శీఘ్రమున శపింపు మన్వయ వకల్మషమయ్యెదుగాక తల్లిరో.

ఇటులగాక నీపాదమాన, నేనిటనుండికదలను. (అనిపాదములంటును.)

అది—హాహా ! (అని కొడుకును గౌఁగిలించుకొని) నాతపఃఫలమా ! నేఁటికెన్ని విషమసంకటములు ప్రాప్తించెనోయితండ్రీ! (వెక్కి వెక్కి యేడ్చుచు) అయ్యయ్యో! లోకపాలమకుట మాణిక్యప్రభా విభాసితపాదారవిందుఁడవై--జగత్త్రయప్రాభవవిభవాభిరాముఁడవై — నిరుపమానసుఖసమృద్ధినోలలాడు మహేంద్రుండవైన, నీవు, యిట్లు, దీనాతిదీనునిపోల్కి యంగలార్వ, సహించుట కెట్టికఠినాత్మనైతిరా తండ్రీ ! (తనలో)

క. దీనాననమున నసుతులే
మైనం బెట్టుమని యేడ్చి కోనంతనె తమలో
లోననె దల్లులు వడుశ్రమ
యేనుడువఁగరానిదన, నకోదెట్లు భరింతుర్.

నాతండ్రీ! యూరడిల్లుము. కానిమ్ము. విచారింతును. త్వరపడకుము.

కాని—

ఉ. నేనన నెంత బ్రహ్మకుల కోనిరధి చంద్రుఁ డనూనసత్తప
శ్శ్రీనిధి వస్తుకాలపరిశీలనదక్షుఁడుఁ గాన నీపిత
న్నే నెటులోయొడంబరచి కో నీహితము న్నెఱవేర్తునింతకు
న్మానవుకాలకర్మ లను కోమానము లేక గలంప కెవ్వరిక్.

ఇంద్రు—అదిగో. ఆ మాటలోనే నాకుఁ గొప్పసందేహమున్నది. కర్మసూత్రమే యాధారమని మిన్నకుండక, కార్యప్రయత్నమే లచే యవలయును. సృష్టిస్థితిలయములకు కర్మమే కారణమైనచో, సర్వేశ్వరుఁడొకఁ డున్నాఁడని యాతనికేల భయపడవలయు. వేయేల; మాతా! కాలమును కర్మమునుఁ గట్టిపెట్టి, నీవు పట్టుఁబట్టి సంపూర్ణముగ నికార్యము బ్రయత్నింపకున్న—

అది—అర్థోక్తిలో) ప్రయత్నింపక మిన్నకుందునా? ప్రయత్నించెదను. సాధించెదను.

ఇంద్రు—అటులైన నాకోరిక సిద్ధించితీరును.

(తెరలో)

తప్పదు. తప్పదు.

అది—తథాస్తు.

ఇంద్రు—ఎక్కడిదీయుపశ్రుతి?

(మరల తెరలో)

తే. గీ. సార్వభౌముఁడు నూరు యజ్ఞములొనర్ప
దీక్షఁబూనె సత్యవ్రతదక్షుఁడతఁడు
దానవులలోన నిట్టియుత్తముఁడు లేఁడు
తప్పదిఁక జేసితీరు సిద్ధాంతిగారు.

ఇంద్ర—ఓహో! బ్రాహ్మణభోజనమైనట్లున్నది. వారివారియునికిపట్లకేగుచు బలిశతాశ్వమేధదీక్షనుఁ గూర్చి ప్రశంసించుకొనుచున్నారు. తల్లీ! స్త్రీప్రయత్నము తప్పక నెఱవేరితీరును. బ్రాహ్మణవాక్యము నామాటకుఁ దోడైనిలిచినది. నే నిటనుండరా దీబ్రాహ్మణులలోఁ గలసిపోయెదను. బ్రాహ్మణులఁదప్ప మఱెట్టివారినైన రాక్షసులు పరీక్షించి పట్టుకొనకమానరు, గాన నన్నాశీర్వదించి సెలవిమ్మ. (నమస్కరించును.)

అది—ఇష్టసిద్ధిరస్తు. పగరకంటఁ బడక జాగ్రతగఁ బొమ్ము తండ్రీ!

ఇంద్ర—చిత్తము. (నిష్క్రమించును.)

అది—ఔరా! దుర్విధి. నాబిడ్డని నోటినుండి నేఁడెంతటిదీనవాక్యముల వినవలసివచ్చెను.

చ. జనకుఁడు బ్రహ్మతుల్యుఁడుఁ బ్రశస్తబుధాగ్రణి దేశికుండు సం
జననము సత్కులంబున నిశాచరమారణహేతువై జనిం
చిన పవి యాయుధోత్తమము సేస లహో! యమరుల్ త్రిలోక పా
లనమిడియున్న యింద్రుఁ డిటులన్నపియించె సుఖాత్ముఁ డెవ్వఁడో.

ఉత్తమోత్తములగు దేవతలగతు లిట్లున్న నిఁక మానవుల నడుగువారెవ్వరు. (యోచించి) ప్రస్తుతము నిర్బంధవశమున ధర్మవర్తనులైనంత మాత్రమున దైత్యులకింతటి మహోన్నతదశ ప్రాప్తించినచో సహజసత్వభావులై సర్వేశ్వరహితులైన దివ్యుల కధోగతి రావలసినదేనా? ఇదేమి వైపరీత్యము? (కోపోద్రేకములతో) ఇదేమిధర్మము? ఇంత

మాత్రమున నేక్రూరులు—దురాత్ములు—సత్యధర్మదయారహితులు--రాక్షసులనియెడి దుష్కీర్తి సర్వలోకములలో నశించిపోయినదా? (తలపంకింపుచు) చూచెదంగాక! సర్వజ్ఞులగు కశ్యపప్రజాపతి మత్ప్రాణపతి. నే నీవిషయమునుంగూర్చి మందలించినపుడెల్ల దుష్కాలము దుష్టాలనుసు నన్నాశ్వాసింతురు. కానిమ్ము, నేం డీధర్మసందేహమునుగూర్చి యడిగెదను. సమాధాన మేమిచెప్పెదరో వినికాని కర్తవ్యమాలోచింపను (మరల తలపంకింపుచు) కానీ- కానీ- సర్వసాక్షియైన భగవంతుండు నాయిష్టమెట్లు నెఱవేర్పడో చూచితీరెదను.

[కశ్యపుండు ప్రవేశించి.]

కశ్య—శ్రీమన్నారాయణ నారాయణ-

అది—ధన్యాస్మి. ధన్యాస్మి. (లేచి) అనుకొనునంతలోనే నాభగవంతుండు నాకు ప్రసన్నుండైనాండే. ఇది మంచి శుభసూచకము.

(భర్తకు నమస్కరించును.)

కశ్య—ఇష్టసిద్ధిరస్తు.

అది—ఈపీఠ మలంకరింపుండు.

కశ్య—(కూర్చొనును.)

అది—(భర్తసమీపమునం గూరుచుండి) ప్రాణపతీ! ఎంతకాలమునకు నన్ను ధన్యాత్మను జేసితిరి?

కశ్య—ఇప్పుడైతివా? ఇదివరకు ధన్యవుకావా?

అది—మహామహులగు తమదాస్య మెప్పుడు నాకు లభించెనో యప్పుడే సర్వవిధముల ధన్యనైతిని. కాని సంతతపతిసేవాభాగ్యమునకుమాత్రము విచారింతును.

కశ్య—గుణమహశివగు నీకును విచారమున్నదా? పరమార్థవేదినివగు నీకును విచారమేయున్న నింకనెట్లు? నీవు సంతతము నాసేవం జేయుటలేదా?

అది—అయ్యో! లేకపోవుటేమి? సర్వకాలసర్వావస్థలయందు మన్మనఃపీఠిం దా మధివసించియుండ లేకపోవుటేమి. నాథా! నా యభిప్రాయ మదికాదు. ప్రత్యక్షముగ మీదివ్యమూర్తిని సందర్శింపుచుండక పోతినని.

కశ్య—ఓహో! ఇదియా విచారము. మంచిది. ఈవిచారము మాత్రము నీబోటి యుత్తమనాయికకుం దగునా?

అది—నిజమగుంగాక- మా కిది స్వభావసిద్ధముకాదా?

కశ్య—జ్ఞానవంతులు స్వభావమునుమాత్రము లెక్కంగొందురా? వాఁరిని బాధించునా?

అది—అంతగా లేదేమో, కాని బాధింపక విడుచునా?

కశ్య—అనంగ?

అది—ఏమున్నది. దేహధారులందరిని సహజవికారములు కొంచెమైన బాధింపక విడువవందును.

కశ్య—ఎట్లు?

అది—ఎఱుంగనట్లడుగుచున్నారేమి? ప్రస్తుతదృష్టాంత మనుభవములో నున్నదానిం జెప్పెదం జిత్తగింపుఁడు. ఇపుడు నాసంతానము నగరమువిడిచి సకలసుఖములం గోల్పోయి భార్యా పుత్రకులతో నగకాననగహ్వరముల (దుఃఖముతో) నానాకష్టములం బడుచున్నారుగదా? ఆసంతాపము నన్నుపడప్పుడైన బాధింపకవిడుచుచున్నదా?

కశ్య—ఈసంతాప మొక్కనీకేనా? నాకుమాత్రములేదా?

అది—లేకేమి సంతాపమున్నది. అటులే సంతోషమున్నది.

కశ్య—అదెట్లు?

అది—దేవతలు పూర్వదేవతలు మీసంతానమే యగుటచేత.

కశ్య—ఆహా! తెలియనట్లనుచున్నావు!

చ. కొడుకులు కోటులున్న గుణకోవిదులై సుఖులై చెలంగిన
న్నడకొకఁడేని దుఃఖపడఁగాఁ గనితండ్రి తపించుఁ గాని యొ
క్కఁడుఁ దనుమోదఖేదముల కెట్లనువయ్యెడిఁ దేనెబిందెలోఁ
బుడిసెడు నీరుపోయఁ జెడి పోవదె తేనియతత్వ మంతయున్.

కావున స్వభావమెఱుఁగనివారియట్లు నీవుఁ గూడ మాటలాడ నే నేమ నఁగలను! (కన్నీరుఁ దుడిచికొనును) ఆగర్భశ్రీమంతులైన నాముద్దు బిడ్డలు మహేంద్రాదుల దుర్దశలు స్ఫురణకువచ్చినపుడెల్ల ప్రాణయుత మైన యీదేహము దహించుకొనిపోయి కడుపులోఁ జేయివైచి కలఁచి నట్లై నాలో నేనే కుమిలికుమిలి మ్రింగిమ్రింగి దుర్విధియని నొసలుఁ గొట్టుకొని చేయునది లేక మిన్నకుందును. పుత్రులనుఁ గూర్చి తల్లులకు న్నయంతపరితాపము తండ్రుల కుండదందురు గాని అదియెంతవరకు నిజ మైనమాటయో అనుభవజ్ఞులగు బిడ్డలఁగన్న తండ్రులకే యెఱుక.

అది—(ఏడ్చుచు) అయ్యో నాథా! గర్భపరితాపాతిశయమున తెలిసీ తెలియక పలికినపలుకులలో మీ యీదాసిపొరపాటులున్న క్షమింపుఁడు. (పదములపై నొఱఁగి) దీనురాలనగు నన్ననుగ్ర హింపుఁడు. దురదృష్టవంతులగు కొడుకులఁ గన్నతల్లిని నన్ను నిరసింపక దుఃఖసాగరమునుండి దరిఁజేర్చి యాదరింపుఁడు. మహా మహులై సర్వజ్ఞులై నిరంకుశతపఃప్రభావులై నిగ్రహానుగ్రహ సమర్థులై సాక్షాద్బ్రహ్మపుత్రులగు దేవరవారి పాదసేవకురాలి కిట్టి విషమసంకటములు రాదగినవేమో దూరమాలోచింపుఁడు.

కశ్య—(నిట్టూర్పుతో) శ్రీమన్నారాయణ. నారాయణ.
(అని నిమీలితనేత్రుఁడగును).

ఆది—పోనిండు నాగోడు విచారింపవలదు.

తే. గీ. త్రిభువనవిభుండు నిరుపమ విభవయుతుఁడు
వినుతచరితుఁ డనూనసద్వివమలయశుఁడు

దైవగురు జనపదభక్తికిఁ తత్పరుండు
నైననీముద్దుకొడుకు గోకైనఁగనుఁడు.

కశ్య—మానినీమణీ! యింకను నాయభిప్రాయమును నీవు వేఱుగనే భావింపుచున్నావు గదా?

అది—వేఱుగ భావించుటలేను ప్రాణకాంతా! (పదములంటి) మీపాదములాన, మీయభిప్రాయము వేఱనికాదు. కొడుకులయిన యింద్రాదులఁగూర్చి మీకు సంతాపము లేదనికాదు. కాని—

చ. పరమవిరాగవంతులయి భావము బ్రహ్మమునందుఁ జేర్చిత
త్పరతఁ దపస్సమాధి నిరుపద్రవమోదసముద్ర మగ్నులై
వరలెడి మీకు నెట్టితరబాధలు చిత్తముసోక నేర్చు నం
చరయుదుఁ గాని వేఱుతల పౌనెమనంబుననాకు వల్లభా.

కశ్య—ఇదియు నిక్కువమే. నీ వినవరకన్నయట్లు దేహధారులైనవారందఱిని మోదఖేదము లెక్కానొకప్పుడైన బాధింపక విడువవనుటయు నిక్కువమే.

అది—ఏమో యేదియెటులైననేమి ధర్మసూక్ష్మములఁ గూర్చి తమతోఁ దర్కింప నా కంతయవసరమేమున్నది. అధికారమేమున్నది. కాని, జీవితేశ్వరా! స్వలాభదూరులైన తమకిట్టి యైకహిసంబంధబాధను లంతగా బాధింపనిమాటమాత్రము వాస్తవమనక పీలులేదు. సహజముగ అబలలము, బేలలము, స్త్రీలమని తా మెఱుఁగక పోలేదు. కావున (ఏడ్చుచు) నాకు సర్వకాలసర్వావస్థలయందు కొడుకులఁ గూర్చిన చింతామహాగ్ని నిలువెల్ల దహించు చుట్లుండ నిపుడిపుడే ఇంద్రుఁడు, వైభవ, అబ్బా మహేంద్రుడు, భిక్షుకబ్రాహ్మణవేషుఁడై నా యీ పాదుకన్నులయెదుటఁ బడి తమతమ కష్టపరంపరలను అతిదీనాలాపరూపమున వినిపించెను. అదిమొదలొక్కని తత్సంతాపోద్రే

కము హాలాహలము పగిది నాపాదమస్తక మెగబ్రాకి నే నెవ
తెనో—యేమిచేయఁగలదాననో—యేమనుచుంటినో తెలియ
కున్నాను. ఎంత ధైర్యమున మనసును బిగబట్టినను నిలుచునట్లు
లేదు. సరికదా ప్రపంచ మున్న ట్లే తోఁచుటలేదు.

కశ్య—సత్సతీమణివైన నీకిట్టి యుద్రేకము తగదూరడుము. చూడు.
మహేంద్రుఁ డిటకువచ్చినాఁడా ? యేడీ ?

అది—ఏడీ ! వెడలిపోయినాఁడు.

కశ్య—ఎక్కడికి ?

అది—కాందిశీకప్రాయునకు తా వెటనుండును ?

కశ్య—హరిహరీ (యోచించి) ఇక్కడి కేట్లు వచ్చినాఁడు ?

అది—దొంగతనమున—

కశ్య—శివశివా (చెవులుమూసికొని) పాపము శమింపుఁగాక (తల
నూచి) ఆహా ! యీశ్వరా ! ఎట్టివాని కెట్టిగతి తటస్థించినది !

అది—ఇంతమాత్రమునకే సంతాపమా ?

కశ్య—అయ్యో కాదా ! నాబిడ్డనినోటినుండి యెట్టిదీనాలాపములు
వెలువడెనో చెప్పఁగలవా జీవేశ్వరీ !

అది—హరిహరీ ! రామరామా ! ఆకష్టదుష్టాక్షరము లీ నోటికిరావు.
భగవంతుఁడా ! రావు.

కశ్య—అయ్యో ! సంక్షేపముననైన వినిపింపలేవా ?

అది—వాఁడే సంక్షేపముగ వినిపించిన నందింకేమి సంక్షేపము? హాహా!
దుర్భరము ! నాథా ! మహాదుర్భరము.

కశ్య—నాకు మాత్రము మీకష్టమున భాగమురావలదా ? ఎట్లో
చెప్పుము.

అది—చెప్పెదను. నేను మిక్కిలి మొండినికాన, నెట్లో చెప్పెదను.
నాథా! మీరుమాత్రము విని భరింపలేరు.

కశ్య—నీవు మొండి వేలకావలయు? తిన్నగాచెప్పుము.

అది—మొండి నేలకావలయునా? ఏలకాను ?

సీ. వైభవాఢ్యుండగు ♦ వాఁడు దీనుండౌటఁ
జూచుకన్నులుప్రేలి ♦ సుక్కలేదు
తనవారికష్ట సంతాపవాక్యాలముల్
జొరినచెవుల్వ్రీలి ♦ సురుగలేదు
కొడుకిడుమలు జెప్పుకొన బనులూరడు
మనునిరర్థకజిహ్వ ♦ తునియలేదు
ఎత్తిపెంచినవాని ♦ నేగుమంచనిపిన
చేతులు నలియయి ♦ చిముకలేదు

తే. గీ. సుతవియోగాగ్నిఁ గ్రాగిక్రా ♦ గితనువింత
కాలమునకైనఁ బూదియై ♦ కూలలేదు
మెందరెందరొ తనవారి ♦ నెడసిగుండె
బండవలెనుండె సుంతైనఁ ♦ బగులలేదు.

ఇఁక మొండి నెట్లుగాను ? సర్వజ్ఞులగు మీరు నేనే చెప్పవలయునా ? దివ్యదృష్టిగల తాము నానోటనే వినవలయునా? హా! హా! దుర్భరము దుర్భరము ! (నిలచును)

కశ్య—(చూచి) దుర్భరమే ! నిశ్చయముగ దుర్భరమే ! (అదితినిఁ జూచి నివ్వెరపడి) ఓహో ! కుమారకష్టసంతాపోద్రేకమున మై మరచియున్నదే ! క్రోధావేశపరవశయై మహాకాళింబోలి తీక్షించుచున్నదే ! మరేమి విలయము లేదుకదా ? (యోచన నటించి చికాకుపడి) సాత్వికచిత్తుఁడనై శాంతమే తపఃఫలమని నిశ్చలతనున్ననాకే తదభిమానవికార మంటుకొని బుద్ధి నేమో చనకుఁబోనీయకున్నది. ఔరా! మాయామహిమము! కానిమ్ము, చిత్తమా! (ఎదపైఁ జేయిడికొని) శాంతింపుము. త్వరఁబడకుము.

(భార్యంజూచి) అదితి నిట్టి సమయమున మందలింతునా ? వల దా? నాకే భయంకరాకారిణియై కనిపించుచున్నదే! సామాన్యుల కిపుడు తేరిచూడవశమగునా ? మందలించిన యేమనునో? యే మగునో? (యోచించి) నే నెదుటనున్నానుగాన మరేమియు విపరీతము జరుగదు. (ప్రకాశముగ) ప్రేయసీ! శాంతింపుము.

అది.—(ఆవేశమునటింపుచు) నాథా ! శాంతిలేదు. సంతాపము మితి మీరుచున్నది.

కశ్య.—ఏ మిట్లున్నావు. సంతాపమెంతయున్నను, ననుభవింపవలయుం గాక మరేమిచేయఁగలము.

అది.—ఎవరేమిచేయవలను. వలదు. ఇదిగో మీపాదదాసి. (ఎదపైఁ జే యిడి తన్ను నిరూపించుకొనుచు) మీపాదదాసి ఇదిగో ఇదియే. ఇది మీపాదపరాగసంగతపావనతనుధారిణి. సంతత భవన్నా మభజనామృతప్రభావసిద్ధసంకల్పచిత్త. ఇదిగో భవదాజ్ఞాశృంఖ లబద్ధ నిలచియున్నది. నిరీక్షింపుచున్నది. సెలవు సెలవు.

కశ్య.—ఏమిసెలవు ? ఏమిచేయుటకు ?

అది.—ఏమిసెలవా ? తమసెలవు ఏమిచేయుటకా ? చెప్పవలయునా ? తమ యాజ్ఞాలేశసాహాయ్యనై తత్క్షణమే సహజధర్మవర్తనులై దేవతలఁబరాభవించి లోకాధికారదురాశాతమోనిర్మగ్నుఁడై గురుకటాక్షలబ్ధమహాసాధన సంపన్నదోర్దేకియై స్వర్లోకసామ్రాజ్య పట్టభద్రుఁడై మిట్టిపడుచున్న బలిదానవాధము నాచార్యసహి తముఁ జుట్టుబట్టి సింహాసనమునుండి క్రిందికిలాగి గిరగిరఁద్రిప్పి భూలోకమహాకాననముల నూడిపడునట్లు విసరివైచెద—మారి మసంగినట్లు, మహాకాళి తాండవించినట్లు సమస్తరాక్షసులఁ బొదివిపట్టి నేలఁగొట్టి కాలఁజమిరి పేలాలవలెఁ దచ్ఛిరములఁ బటపటఁ బగులఁగొరికెద—కరతలములఁ దత్కళేబరముల నలిచి

కలపముగ మేన నలఁదుకొనియెద—తద్రక్తధారలఁ గడుపారఁ గ్రోలి తాపశాంతిఁ జేసికొనియెద. శుక్రాభిమానమునఁ బితామహాదు లడ్డగింతురా? మూర్తిత్రయ నిర్మూలనముఁగావించెద. మత్సంతానముదక్క తక్కిన సమస్తసృష్టిని ధ్వంసమొనర్చెద. నాబిడ్డలఁ గడుపునఁ బొదువుకొని రక్షింపుకొనుచు భూమ్యాకాశములఁ దాళములుగ వాయింపుచుఁ దాండవించెద. పిదప సకల లోకాధిపత్యమునకు నాపెద్దకొడుకును పట్టభద్రుఁజేసెద. శాంతించెద. మీపాదములకుఁ బ్రణమిల్లెద (భర్తపాదములఁబడును.)

కశ్య—ఆహా (అని భార్యను కౌఁగిటఁబొదవుకొని) ప్రమాదము-ప్రమాదము (వెన్నునిమురుచు) శాంతింపుము. శాంతింపుము. (స్వగతము) పతివ్రతలమనసు నొచ్చి కన్నుఁదెరచినచో నద్దే మున్నది. ఆహా! మానినీమణులన లక్ష్యపెట్టరుగాని అంతటి ధన్యమైనజన్మము లున్నవా? ఒక్క పాతివ్రత్యప్రభావముననే లోకాతీతమాహాత్మ్య మార్జింపగలరు.

సీ. వేదవేదాంత సకలవిద్యాప్రవీణ ప్ర
భావులార్జించెడి ఫలముకన్న
సత్యధర్మదయాది సద్వ్రతులగు యోగు
లందెడు పరమసౌఖ్యమునకన్న
ఆస్థపంచాగ్ని మధ్యస్థులై తపియించు
పరమమునుల తపోబలముకన్న
అష్టవిభూతి సంతుష్టమానసుల య
ప్రతిహతదివ్యవైభవముకన్న

తే. గీ. దైవతముల కొప్పెడు మహత్వంబుకన్న
జ్ఞానులైన భక్తుల మహచ్ఛక్తికన్న

హరిహరుల మహిమాతిశయంబుకన్న
పడఁతియైన పతివ్రతకే ప్రతిభమిన్న.

స్త్రీల కే వ్రతములతోఁ బనిలేదు. క్రతువు లవసరము లేదు. త్రికరణశుద్ధిగ నొక్క పతిసేవామాత్రము నిర్దుష్టముగఁ జేసిరేని.

కం. తాము తరింతురు దేశ
గ్రామకులాదులఁ దరింపఁగాఁ జేతురు వే
రేమైన నేతురు సా
ధ్వీమణి కడ్డుపడలేవు వివిధజగంబుల్.

ఏశ్రమ లవసరములేక నొక్క పతిసేవాప్రభావముననే జగజ్జాలముల నుద్ధరింపఁగలరు. (వెన్నుఁదట్టుచు) ప్రాణేశ్వరీ! యింకను నీయుద్రేకము శాంతింపలేదా ? మదాజ్ఞ యైనఁ దాని నభ్యంతరపెట్టలేదా ?

అది—(లేచి) ఇస్స ! అబ్బా నాథా ! యొడలు కంపింపుచున్నది.

కశ్య—శాంతింపుము. చూడు నేఁజెప్పఁబోవుమాటలు సరిగా మనసున కెక్కునట్టిస్థితిలో నున్నావా ?

అది—(నిట్టూర్పు విడిచి) చిత్తము సెలవిండు. వినఁగలను.

కశ్య—నేను దివ్యదృష్టినంతయుఁ దెలుసుకొన్నాను. జ్ఞానులగువారే కార్యమునకును స్వతంత్రింపఁగూడదని నీవెఱిఁగినదియే కాదా ?

కం. తనయులు పలువురుగలిగిన
మనముల నీర్ష్య లెటులైన మానకగలుగుణ్
జనకుఁడవి చూచిచూడక
జనవలె నతఁడేమిచేయఁ జననగు యువతీ.

అంను ముఖ్యముగ నాసంతానమున ననోన్యవైరము లుపశమించుట కల్ల. ఇంతకు గుణాగుణ నిరూపణముననేమి—మరియేకారణముననేమి త్రైలోక్యాధిపత్యము స్వర్లోకనివాసము వానవాది దేవతార్హములుగాని

దానవార్థ్యమని యెవ్వరు చెప్పుటకు సాహసింపరు. నీ వనినయట్లు దేవ దానవులు నాదృష్టికి సమానులే గాన నిట్టి ధర్మనిర్ణయమును నేను సర్వసాక్షియగు భగవంతునియందే నిల్ప నిశ్చయించితి. నీవుగూడ న న్ననుసరింతువుకాదూ ?

అది—చిత్తము. త్రికరణశుద్ధిగ.

కశ్య—అట్లైన నేను నీకొకవ్రత ముపదేశించెదను. దాని బహుజాగరూకతగా—నిర్మలభక్తిపూర్వకముగా నీ వాచరింపవలయును.

అది—అవశ్య మట్లాచరింతును.

కశ్య—ఫాల్గుణశుద్ధ ప్రతిపదాదిద్వాదశీపర్యంతము పండ్రెండుదినము లీవ్రతము నిష్కళంకచిత్తవై పరమేశ్వరసమర్పణబుద్ధితో నా చరింపవలయును. దీనిఁ బయోభక్షణవ్రతమందురు. వ్రతాంత మున నియతవై తదేకధ్యానమునఁ జేమోత్సవతో వేచియుంటి వేని అవాఙ్మానసగోచరుండును—ఆదిమధ్యాంతరహితుండును— సర్వసాక్షియును—ఆశ్రితవత్సలుండు నగు సర్వేశ్వరుఁడు నీకుఁ బ్రసన్నుఁడగును. నీకోరిక నెఱవేఱితీరును.

అది—తథాస్తు. అమోఘవచస్కుల పల్కు రిత్తయగునా ? ధన్యనైతి.

కశ్య—అగును. తదుపవాస, దాన, భోజన, కాల ప్రకారములును, తన్మాత్రంబును నీ కుపదేశింపవలసియున్నది. అందులకు నీకు శాంతచిత్తము, ఏకాంతప్రదేశము, అవసరము గాన బోవుదము రమ్ము.

అది—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము.

### ఒకానొక విపినప్రదేశము

[మాయావి ముండకులు ప్రవేశము.]

ముండ—నీమాట నమ్మునట్లు లేదు బావా! ఆసంగతిఁ దలచుకొన్న నాగుండె లవిసిపోవుచున్నవి. ఇంతకు నాపెండ్లాము మంచి ముండ కనుక తటాలునఁ దల్లివలె యడ్డుపడి నాప్రాణములు దక్కించినది. లేనిచో యిప్పటికి నాపేరు చక్కగా మాసిపో యియుండును.

మాయా—అటులైన (నవ్వుచు) చిత్రరేఖపై నింకేటికి మనసుంచినావు? నన్నేటికి వేధించుచున్నావు?

ముండ—ఏమి చేయమన్నావు? ఎంతనిలుపఁ బ్రయత్నించినను నా పాడుమనసు నిలువకున్నది. కార్యమేదైన సంకల్పించుకొన్నప్పు డది కొనసాగువర కూరకొనదు. అనఁగా పట్టుదలగలిగిన మన సన్నమాట. దానికది స్వభావమైపోయినది. సాధ్యంలోలేదు. కాని బావా! అదరు బెదరు లేని నామనసు కానాఁటి చెప్పు దెబ్బలతో మాత్రము కొంచెము జంకుగలిగినది.

మాయా—అటులైన యీపాడుపని నీకెందులకు? ఈతప్పుడు తార్పు టుద్యోగము నాకెందులకు? ఎట్లో యీకొంచెము నీమనసు కు బుద్ధిఁజెప్పి దిద్దుకొనుము. మనముభయులముగూడ బాగు పడుదుము. చూడు! నీభార్యయే నాఁడడ్డుపడకున్న మన ముభయుల మిప్పటికేమగువారము?

ముండ—కొలుత మరణము. తనుపరి పిశాచములము.

మాయా—పైగా పిశాచములమేల కావలయును?

ముండ—మనోవాంఛ సిద్ధింపకపూర్వమే మరణించినవారు పిశాచము లయ్యెదరఁట కాదా ?

మాయా—అటులైన మరింత నిన్ను బ్రతిమాలుకొందును. ఆచిత్రరేఖ పైఁగల మనసును సంపూర్ణముగ మరల్చుకొనరాదా ?

ముండ—అదిగో ! అక్కడనే యున్నది. పెద్ద నల్లబండి యోగము.

మాయా—అనఁగా ?

ముండ—నీవెఱుఁగనిదేమున్నది ? కాని అది నావశమున లేదు బావా ! తుదకు చావనీ మరేమైనగానీ !

మాయా—అటులైన నీతోపాటు నాకుఁగూడఁ జావు తప్పనట్లేకదా ?

ముండ—అట్లేలయగును ? మరలఁ బట్టుపడితేకదా ? అమంగళముగా మాట్లాడకు.

మాయా—ఏమో నమ్మరాదు. రక్షకదైత్యభటు లసాధ్యులు.

ముండ—అట్టీసారి జరుగదు. చూడరాదూ ! ఇక్కడిసంగతిసందర్భములు నాకు సరిగా తెలియవుగాన పట్టుబడ్డాను. లేనిచో నన్నుఁబట్టుకొన బ్రహ్మతరమా ? (స్మృతినభినయించి) చూడు బావా ! మించినదాని కిప్పుడేమనుకున్న నేమున్నది. కాని చేతఁజిక్కిన ఫలమును స్వయముగా నేనే యానాఁడు జెడఁ గొట్టుకున్నాను.

మాయా—(తనలో) వీని కింకను నున్మాదము తలనుండి దిగలేదు. ఈసారి ప్రాయశ్చిత్తముతో సాంగముగ వీనిరోగమున్ను వీనితోఁ బాటు పూజారియగు ఘోరశర్మరోగము గూడ నశించుఁగాక. (ముండకునితో) నేఁడింకను నీ ప్రియురాలైన చిత్రరేఖ రాన ట్లున్నది. ఇంతలో రావచ్చును. నీవుమాత్రము జాగ్రతగ నీచీఁకటిలోఁ గూరుచుండుము. రక్షకభటులనుమాత్రము గని పట్టియుండుము.

ముండ—ఓ! (అని యోచించి) బావా! ఒకవేళఁ గీడెంచి మేలెంచ మన్నారుగదా! నూఱువిధముల నేఁ బట్టుపడను. నమ్మకమే. కాని గతిఁదప్పి ప్రమాదవశమున నేరక్షకభటుఁడైనఁ దటస్థించిన నెట్లు?

మాయా—అదిగో! పట్టువడనంటివే! ఇంతలోనె యధైర్యపడుచున్నావే?

ముండ—పట్టువడనయ్యా! ఒకవేళఁ దప్పివచ్చెనేని చో నెట్లంటిని?

మాయా—అంతగా తప్పివచ్చినప్పుడు నీపేరడిగినను జెప్పకుము. రాజాజ్ఞ లేదనుము. రహస్యవేది ననుము. దేవతామర్మము లరయును ద్యోగి ననుము.

ముండ—ఔనుసుమా! ఆనాఁడు నన్నుఁ జెప్పుదెబ్బలు గొట్టినది రహస్యవేదియగు నుద్యోగియే. సరే మంచిసంగతి జ్ఞాపకము చేసితివి. ఇంకేమి? ధైర్యమువచ్చినది. నీవంశమువర్ధిల్లా! నీవంటి యభిమానముగల హితుఁడు నాకు చచ్చినా దొరకఁడుబావా!

మాయా—(తనలో) దొరుకఁడు. ఇదిమాత్రము నిజమే? నీబాగుఁ గోరి యెవఁడింత శ్రమఁబడఁగలఁడు. మరచితి. నే నింక గంధర్వ వేషము ధరించవలయును. (ముండకునితో) బావా! నే నిఁక బోయెదను.

ముండ—మంచిది.

మాయా—(నిష్క్రమించును.)

ముండ—(కూర్చుని తనలో) నే నేమో తెలివికలవాఁడనని మనసున గర్వింతును గాని వట్టి తెలివితక్కువపందలలో మొట్టమొదటి వాఁడను నేనే. కానిచో బంగరుబొమ్మలాగు పరుండి యెప్పుడు వచ్చునాయని నాకొఱకెదురుచూచుచున్నది కదా? చిత్రరేఖ.

దానితోఁ దగురీతి సౌఖ్యపడలేక పేరులని, ప్రస్తావములని గోల పెట్టుకొని బేలనై ముందరికివచ్చిన విస్తరినిఁ బొందలోఁ ద్రోసి కొన్నట్లు సిద్ధముగనున్నసుఖమంత నష్టేటఁ గల్పుకొంటిని. మంచిది. కానిమ్ము. మిలిగినపనికి వగచిన లాభమేమి? (దిక్కులు పరికించి) నేఁడు తగినజాగ్రత్తగ మెలఁగవలయును.

[మాయావి ముసుఁగుతోఁ బ్రవేశము.]

ముండ—(చూచి) అదిగో వచ్చుచున్నట్లున్నదే (మరల నిక్కినిక్కి చూచి) నిజమే. అదియే అదియే. చిత్రరేఖయే. అదిగో మరల ముసుఁగే. మాట్లాడఁగూడదు. (నోరుమూసికొని లేచి మెల్లగ నడచుచుఁ బోయి బిగ్గ కౌఁగిలించును.)

ముసు—అమ్మో! అయ్యో బాబో! (అని అరచును.)

ముండ—ఓఓఓ (అని యదరి నేలఁ గూలఁబడి) ఓఓ (అని అరచును.)

ముసు—(ముసుఁగుఁ దీసివైచి) నీకు నమస్కరించెదను. తండ్రీ! కేకలిడకుము. నిన్ను బ్రతిమాలుకొందును. (అని కాళ్లపైఁ బడును.)

ముండ—ఊఁ (అని గంధర్వునిఁ జూచుచు యులికిపడుచు) నీవెవరు?

గంధ—నేను కాంచనుఁడను.

ముండ—ఆఁ! ఏమిటీ?

గంధ—బిగ్గరగ మాట్లాడకు తండ్రీ! నీకు నమస్కారము (నమస్కరించును.)

ముండ—వీఁడు రక్షకభటునివలె లేడే (కాంచనునితో) కాంచనుఁడంటే నీకులమేమి?

గంధ—బాబూ! నేను గంధర్వుఁడనండీ.

ముండ—(ధైర్యముతో) గంధర్వుడవూ! ఏమీ-చెప్పవూ? నీపేరూ?

గంధ—కాంచనుఁడని చెప్పితిగా బాబూ!

ముండ—(తనలో) అమ్మయ్యా! బ్రతికితి. కొంపదీసి మతల పట్టుబడ్డా ననుకున్నాను. వీఁడు గంధర్వుఁడఁట. భయములేదు. రక్షకభటుఁడనని వీనిమీఁద నాప్రతాపము గొంచెముగుపరచెదను. (చప్పున జుట్టు నొడిసిపట్టుకొని) అరే గంధర్వాధమా! యీనడు రేయి నెందుకువచ్చితివిరా?

కాంచ—అయ్యా! మీకు నమస్కారము. నన్నేమనకండి. సవిస్తరముగ నాసంగతి మీకెఱింగించెదను.

ముండ—(తనలో) లోకంలో నేనే ననుకుంటె వీఁడు నాకన్న పిరికిముండకొడుకువలె నున్నాఁడు. సరే, వీనిమీఁద నిఁక నాప్రతాపము బాగాసాగితీరును. (కాంచనునితో) ఇదిగో చూడూ? ఒక్కగ్రుద్దుతో గుండెలుపగులును. చెప్పు నిజముచెప్పు. అబద్ధమాడవలదు.

కాంచ—చిత్తముబాబూ! నిజమే చెప్పుతానండి.

ముండ—అటులైన గంధర్వుఁడనఁగ నెవఁడవో తొలుతఁ జెప్పుము.

కాంచ—దేవతలలో మాదియొక తెగ.

ముండ—ఏమీ! నీవు దేవతలలోని వాఁడవా?

కాంచ—అవును.

ముండ—(తనలో) సరి, ఇంకేమి? ఈ క్షణమే వీనిరక్షకభటుల కొప్పింతును. వారు నాకు బిరుదపత్రము నిప్పింతురు. (కాంచనునితో) అయిన నీవిట కెందుకు వచ్చితివి?

కాంచ—మా బావగారి కొరకండీ.

ముండ—మీ బావయెవరురా?

కాంచ—ఎవరంటే యేమో మా బావగారే నండీ.

ముండ—అనఁగా వివరంగా చెప్పరా?

కాంచ—నాకది తెలియదండీ. వారుమాత్ర మ్మా బావగారే బాబూ!

ముండ—ఓరి నీబాబుబుండలుగాను మీబావ పేరేమిరా ?
కాంచ—నాకు పేరు తెలియదు—పెంకులు తెలియదు బాబూ !
ముంగ—పేరు తెలియని బావకొరకు నీవెట్లు వచ్చినావురా ?
కాంచ—ఇక్కడుంటాడని మాయక్కగారు చెప్పితే వచ్చాను బాబూ !
ముండ—మీయక్కయెవరు ?
కాంచ—చిత్రరేఖ.
ముండ—(జుట్టువిడిచి నివ్వెరపడి) చిత్రరేఖ! అప్సరసయగు చిత్రరేఖకు నీవు తమ్ముండవా ?
కాంచ—ఔను బాబూ !
ముండ—ఓరి తెలివితక్కువకుంకగాడిదముండకొడుకా ! అప్పటినుండి అట్లా చెప్పవేమిరా ?
కాంచ—మీరుచెప్పనీయందే ఎట్లాచెప్పను బాబూ!
ముండ—ఓరి వెధవా! నే నెవరోయనుకున్నాను. నిష్కారణంగా తన్నుల్దింటివే. మంచిది. నేడు నిద్రలేచినవేళ చాలామంచిది.
కాంచ—తంతే యేంచెస్తాబాబూ !
ముండ—చీచీ వెధవా ! బాబూ అనకురా నేనే మీబావనురా.
కాంచ—(చూచి ఆశ్చర్యము నటింపుచు) ఏలాగు ? మీరేనండీ ? మీరేనా బావగారు ?
ముండ—ఔను.
కాంచ—అందుకేనా ? బావగారైయుండేనా ? నాకిన్ని బహుమానాలు ? సరేలేండి. జ్ఞాపకముంచండి. ఇంతకు పదింతలుగా మాయక్కగారితో చెప్పి వడ్డీముత్తంగా మీకుగూడ యీలాటి బహుమానాలె యిప్పిస్తాలేండి. తొందరపడకండి.
ముండ—(నవ్వుచు) ఓరికుంకా! నన్నుఁ గొట్టించెదవఁటరా ?
కాంచ—రెండు లెంపకాయలు ఒక్కమొట్టికాయ మాత్రమేనండీ.

ముండ—అటులైనను సంతోషమే లెమ్ము. మిక్కిలి ప్రసంగమువలదు. చూడూ. కాంచనబావమరదీ! యిక్కడికి మీాయక్కవచ్చినదా?

కాంచ—ఎబ్బే - లేదండీ.

ముండ—(నోరుఁదెరచి నివ్వెరపడి) దానితోగాక నీవొంటిగ నిక్కడికేల వచ్చితివి ?

కాంచ—మాటఁ జెప్పుటకు.

ముండ—ఇంకేమిమాట ? రానన్నమాటయేనా ?

కాంచ—ఎబ్బే. రా ననన లేదు, యేమీాలేదు. ఇదిగో. (అపవారించి) రక్షకభటులు రానీరఁటగా ? మీా కెఱుకయేనా ? అట్టి రక్షకభటులభయ మొకప్రక్కను, మీాయందలి వలపువేగిరము మరియొక ప్రక్కను లాగుచుండ డోలాందోళితచిత్తయై యూరకవెనుక ముం దాడుచుండ నేనే యూహించి మరియొకయుపాయము జెప్పితిని. దానికి సంతసించి నన్ను మీాకడ కంపినదండీ?

ముండ—ఏమి యుపాయ మది ?

కాంచ—బ్రాహ్మణపరీక్ష రాక్షసులు చేయరు గాన బ్రాహ్మణముత్తైదువులతోపాటు యావేషము వేసికొని నగరముఁజేరి ప్రసాదవినియోగము లైనపిదప దేవాలయమున నెవ్వ రుండరు గానయెట్లో అందుఁజేరి చాటున డాగి అంద రేగినపిదప నుభయులుగలిసికొందాం దని చెప్పినానండీ.

ముండ—ఔర పిడుగా ! బలే యుపాయశాలివిరా ? నిజమే. అటులైన నిర్భయమే. ప్రసాదవినియోగానంతరమున సింహద్వారము తలుపులు మూసెదరు. రాత్రి యంతయును స్వేచ్ఛయే. బలే మంచియుక్తి బావమరఁదిగా ! (వెన్నుఁ దట్టును.)

కాంచ—అబ్బో ! యిప్పటి మ్మాటలే లెండి. పిదప నేను మీా కగుపడుతానా ?

ముండ—మంచిది. నీ వింకఁబొమ్ము. నేను బోయెదను. రేపు తప్పక వచ్చునా ?

కాంచ—ఓ ! తప్పక. (నిష్క్రమింతురు.)

---

## తృతీయ రంగము.

వీధి-ప్రదేశము.

[తిమ్మంభొట్లు ప్రవేశము.]

తిమ్మం—అదృష్టమంటే మా బ్రాహ్మణజన్మలదే యని చెప్పక తప్పదు. కాదని వాదించేవాని తెల్వికి తత్క్షణం బహిష్కారం యిప్పించి తీరవలసిందే. బ్రాహ్మణులంటే దూరాలోచన లేని కొందఱు నిర్లక్ష్యంగా చూస్తుంచారు గాని వాళ్ళమొహం. మాతత్వం వాళ్ళకెట్లా తెలుస్తూందంచా. (మొలలోనున్న పొడుముకాయఁ దీసి చేతిలో వేసికొనుచు) పంచ పంచ ఉషఃకాలమున నిద్ర మేల్కొని పడకపైకిఁ జేరువరకును, నిత్యవిధిగాఁ జేయు షట్కర్మలవలన నెంత ఫల మున్నదో, యెంత యానంద మున్నదో, (అహ్హా అని నవ్వుచు పొడుము బీల్చుకొనుచు) అనుభవపరులగు మహాత్ములకుఁ దప్ప, శుంఠల కేం తెలుస్తూంది ? మేమాచరించు సత్కర్మలవలన మాకును, లోకమునకును అమితమైన క్షేమ మున్నది. కావుననే బ్రాహ్మణమాత్రుఁ డగువాఁ డెట్టివాఁడైనను, మహాపూజ్యుఁ డనక తప్పచున్నది కాదు. కాదూంచా. అష్టాకానిచో అందరికన్న మాకే మెక్కువుందనీ? వేదశాస్త్ర లుద్ఘోషిస్తూండడం ? పుట్టువులోను, బుద్ధులలోను, రూపములలోను, నలువురుమానవులతోపాటు గాక మాకేమీ నొసట శృంగం లేదుగదా! ఇటువంటి మాకు ప్రతివాఁడు

చేతులు గట్టుకొని, కాళ్ళుఁ బట్టుకొని, వినయవిధేయతలతో గృహమునకుఁ బిలుచుకొనిపోయి, యున్నతాసనము వేసి, పూజించి, పురస్కరించి, దానములిచ్చి, దండములుబెట్టి, ధన్యులమైతి మని, దయయుంచుఁ డని, మమ్ముఁ బ్రార్థింతురా? ఏ మహిమము లేనిదే సమస్త కార్యములయందు బ్రాహ్మణులే తృప్తి నొందవలయు నను నాచార మెందుకున్న దీంచా. చూడూ! బలిచక్రవర్తి పాట్లు చూడూ! శతాశ్వమేధ దీక్షఁ బూని బ్రాహ్మణదాసానుదాసుఁడై జన్మ తరింపు జేసికొనుచున్నాఁడు. బలే. దాతయంటె బలిచక్రవర్తియేగాని మరియొకఁడున్నాఁడని వ్రేలుమడిచి యెవఁడైనఁ జెప్పఁగలఁడా? ఆతఁడొసంగు బహుమతులవలన సంపత్సమృద్ధి నోలలాడుచు, మావాండ్లిప్పుడు మాటలాడు నట్లున్నదా? కశ్యపప్రజాపతి. అమ్మయ్యో! మహామహుఁడు. పేగుమాత్రమునసే గుండె లావలింపవలయునే. అట్టి మహాపూజ్యుని భార్య, దేవమాత, అదితిదేవి పయోభక్షణవ్రతమునకు దానములు గైకొనుట కొక్క బ్రాహ్మణమాత్రుఁడైన సరిగా సకాలమునకు వస్తూన్నాఁడా? మరే. దానము లీకాలమున నెవఁడికి గావలయును. మావాండ్లే ధనముఁ బాతళ్ళువెట్టి, పారవేసి, విసికి, రోసి, రామరామా! అనఁగూడదు గాని, మావాం డ్లంతటి గర్విష్ఠు లున్నారా? లక్ష్మియం దింతనిగ్రక్ష్యమా? రాఁబోవు కాలమున గుమ్మముల ముందు దీనులై పడియున్నను తుదకు ముష్టికూడ నిడని దాతలు దొరికినపుడు గాని వాండ్లగోగం టక్కునఁ గుదురదు.

[పేరిశాస్త్రి ప్రవేశించి]

పేరి—రోగంవచ్చి చచ్చినను సుఖంగా యుండు నేమో?

తిమ్మం—(చూచి) ఓహో పేరిశాస్తుర్లా! నమస్కారమండోయ్.

పేరి—పదివేలు బాబూ, ఇక్కడికి నీబాధ మాకుతప్పినట్టేకదా ?

తిమ్మం—ఆఁ నేనుమాత్ర మిమ్మాజోలికిరాను. పాపము. మహాతపస్వికశ్య పప్రజాపతి దేవుడు గనుక కులాభిమానమైనఁ జూపకున్న బాగుంచుందా? అని నే నీబ్రాహ్మణులఁ దీసుకవచ్చుపని కొప్పుకున్నాను. శివశివా ! పగవాళ్ళకైన నీబాధరాగూడదుబాబూ. (లెంపలు వేసికొనును.)

పేరి—నిజమే పాపం. నీవు మనవాళ్ళకొరకు తిరుగలేక చచ్చావు తిమ్మంభొట్లు.

తిమ్మం—చచ్చానా, మరిచచ్చానా? నేనుగావున సరిపోయుంది.

పేరి—దానములు పట్టలేక ధనమ్మూటలు మోయలేక ప్రాణం విసిగింగోయ్. చస్తేబాగనిపిస్తూంది. నాల్గుఘుళ్లుకూర్చుందామంటేవీల్లేదాయె. ఏంచేయమంచావు. లేనపుడు యిచ్చేవాఁడు లేకపోయెనే యని అష్టాచచ్చాం. అట్టిమహాదాతవచ్చేవరకు దక్కించుకోలేక యిష్టాచస్తూంచున్నాం. జన్మలకుసుఖమెప్పుడో తెలియదుగదా ?

తిమ్మం—సుఖమో నా మొహమో, కాని అదితిదేవి వ్రతాంతమైనది. నామనస్సు కుదుటఁ బడినది. పెద్దలతో బ్రాహ్మణుల భారమొప్పుకొంటినని మహాభయపడ్డాను.

పేరి—ఇక్కడికిసంతోషించావుగా-సార్వభౌముని యజ్ఞములు సాంగోపాంగముగా నెఱవేరవిదే ? తక్కినవి పూర్తియగువరకు మనబ్రతుకు లేమగునునుకొన్నావు ?

తిమ్మం—నిజమేకాదూ ? ఏమోలే చూచుకుందము ముందుసంగతి. యిప్పటికిగండంగడిచింది (నడుస్తు) పోదాం రాదాంచా.

(నిష్క్రమింతురు.)

---

ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము

## చతుర్థాంకము.



### ప్రథమరంగము.

[నిమీలితలోచనములతో చేతులుమోడ్చి అదితియుండును.
శ్రీమహావిష్ణువు ప్రసన్నుఁడగును.]

అది—ధన్యాస్మి; ధన్యాస్మి; నిరుపమానభక్తవత్సలబిరుదాభరణా! నిఖిల భవబంధ నిర్మూలననిపుణా! శ్రీమన్నారాయణా! భవత్ప్రభావం బెట్టివారలకైనఁ దెలియ దన నేనెంతవాఁడఁ దండ్రీ.

సీ. బ్రహ్మాదిసకలజీవప్రపంచమునిల్పి
జనకభావంబునఁ | దనరినావు
ఏప్రాణి కెపుడేది | యెటులీయవలె నటు
లిచ్చిరక్షకుఁడవై | యెసఁగినావు
ధర్మమధర్మమ | న్నారులఁజూపి స
ద్గురుఁడవై స్వేచ్ఛనూ | ల్కొల్పినావు
కర్మసూత్రమ్మును | గరముసంబూని బ్ర
హ్మాండప్రభుఁడవయి | యలరినావు
తే. గీ. తుదకుఁ బుట్టింపఁ బోషింపఁ | ద్రుంపఁ గర్త
నీవయైభక్తులన్దని | యించినావు

యెట్టివారి కందీయంద ॥ నట్టినీవు
చెలియయని యెంచకిట్లు వేం ॥ చేసినావు.

దండకము.

జయజయసద్ధర్మసంరక్ష సాధుక్షమాదీక్ష దైతేయశిక్షాపరంజ్యో
తిసాక్షీ స్వభక్తావనోల్లాసకైలాసవాసాబ్జగర్భాదిసంస్తుత్యచారిత్ర నిత్య
ప్రకాశా రమేశా పరంధామ పాపాటవీదావదావానలా సత్యశీలాబుధా
రాధితాంఘ్రిద్వయా సత్కథామోదితస్వాంతదాసప్రియా చిన్మయా
యవ్యయానందరూపా జగద్దీపలీలాకలాపా విచిత్రప్రహర్షాద్భుతామో
ఘభావా నిరాకారసాకార దేవాదిదేవా భవాంభోధినిర్మగ్నజీవోద్ధరా
నిర్వికారా నిరాధార నానాఘటాంతర్బహిర్వ్యాపకాదుష్టసంతాపకా
త్వత్కృపాదృష్టి యేప్రాణిపైప్రాలునో వానిలాలించిమన్నించియుబ్బిం
చినమ్మించియేనట్లుగాకున్నఁ గోపించి రూపించి శిక్షించి యేనెట్టులో
సత్పథుంజేసి సృష్ట్యాదిగానెట్టి దుష్కర్మముల్జేసెనో వానినిర్మూలమూ
నట్టులంజేసి నీలోకమో లేక నీసన్నిధానంబొ నీరూపమోయిచ్చి నిష్కా
రణప్రేమదివ్యప్రభావంబులోకంబులన్నింటవ్యాపింపఁగాఁ జేసినీసాటి నీవ
న్మహాకీర్తిసుజ్ఞానుతావారుగీర్తింపఁగావిందుగోవిందనీనిశ్చయంబిట్టిదోకావో
కోయంచు నెవ్వారలున్నిర్ణయింపంగ లేరన్న నేనెంతదాన న్విచారించి
నిర్ధారముజ్జేయు నారాయణాయంతకున్సర్వభారంబులన్నీపయినైవ్చియే
తీరుగాఁ జేసిన న్మంచిదేయంచు నిష్కల్మషస్వాంతనైయుంటి నీచిత్తమీ
మీాదసర్వేశ్వరా భాస్వరాపన్నివారా నమస్తే నమస్తే నమస్తే నమః॥

(నమస్కరింపుచున్నది.)

విష్ణు—సాధ్వీమతల్లీ! నిర్దుష్టమగు నీ వ్రతనిష్ఠకును, నిర్మలమగు నీభక్తి
కిని మెచ్చితి. నీవేది యర్థింతువో దాని వచింపుము?

అది—శ్రీహరీ! సర్వజీవాంతర్యామివైన నీ వెఱుగనిది లేదు. నన్నుఁ గూర్చి నే నెవ్వరి నేదియు నర్థింపను.

విష్ణు—మరెవ్వరిఁ గూర్చి యైన సరే యర్థింపుము.

అది—మరెవ్వరిఁగూర్చియు నర్థింపను. కాని నీవారిఁగూర్చియే. అనఁగ నీ దాసుల గూర్చియే (కన్నీరు నింపుచు) వగచెద.

విష్ణు—ఆహా! దేవమాతా! నావారినిఁగూర్చి నీవు వగచుచుండ నాకు మాత్రము బాధాకరము గాదా? కానిమ్ము. సక్రమముగనున్న కోరిక యగుటయే నాకిష్టము.

అది—సక్రమమో కాదో నీవ నిర్ణయింపవలయు తండ్రీ!

విష్ణు—అది వివరింపుము.

అది—చిత్తము. సత్యము సత్యమై నిత్యమగుఁ గాక.

కం. సురలు పవిత్రులు భక్తులు
నిరత దయా సత్య ధర్మనిష్ఠానుమతుల్
పరమాభిమాను లట్టి సు
చరితులు దుర్గతులఁ దూలఁజెను నే తండ్రీ!

విష్ణు—దేవతలయెడ నా కెంతటియభిమాన మున్నదో నీ వెఱుఁగనిది కాదు. గాని—

తే. గీ. కష్టసుఖము లెవ్వారికిఁగాని సరిగ
బంచియిత్తు మంచినిఁగూర్చు భావమునను
తెలియలేరు, జాగ్రత్స్వప్నములు సమాన
ముగ నొసంగినఁ దన్నిజమ్ముఁ గనరటుల.

అది—జగద్రక్షకా! సంతత భవత్తత్వచింతనామృతపానస్వాంతులైన పండితులు భవద్స్వరూపము లైన సచ్ఛాస్త్రములం దీయర్థ మంతయు గ్రహించియు, వైరాగ్య బోధోపరతులం దసమాను

లని ఖ్యాతి నందియు, నదేమి నీమాయామహిమయో, సుఖ కష్ట సంఘటన సమయములందు కొంచెమైనను సంతోష సంతాపము లొందక మానరుగదా? తండ్రీ!

విష్ణు—దేహధారు లందరి కిది నైజగుణమని వేర చెప్పవలయునా? కాని, మీవంటి వివేకవంతులను, సత్యహృదయుల నవి బాధింపవు. క్రమక్రమముగ ననుభవమగు కొలఁది సంతాపతాపము శాంతముగ మార్పుఁజెంది సర్వము సంతోషముగానే యనుభవమునకు వచ్చును. కాని, నాయభిప్రాయ మిదికాదు. అదియు నీవెఱుఁగనిదికాదు.

అది—సర్వేశ్వరా! నీమహిమ మబలను నే నెఱుఁగఁగలనా తండ్రీ!

విష్ణు—సబలుల మనుకొనువా రసలే తెలియలేరు. సత్యాన్వేషకులై, తనుబలము, తెలివి, కష్టము, సుఖము, విమర్శించుకొని నీవలె నస్వతంత్రమే పరమగతిగా నవలంబించినవారికిఁ గొంతలోఁగొంతయైనఁ బోధగాకపోదు. సుఖమునకు సమానముగ కష్టమువచ్చుచుండఁగనే గర్వించి చెడుచున్నారు. లేనిచో వేర చెప్పవలయునా? వేయేల! నీయిూప్సిత మెఱిఁగితిని. దేవతల యథాప్రకారముగ స్వర్గమున నెలకొల్పుటేకాదా?

అది—అంతే. శ్రీపతీ! నీవాజ్ఞాపించిన ట్లిది సక్రమమేకాని యక్రమ మెంతమాత్రమును గాదు. చూడు తండ్రీ! యొకమనవి—

సీ. స్వర్గంబు దివ్యుల కే సంస్థానమగుఁగాని
యధమదైత్యులకు యోగ్యమనగలమె
ఆనంద మమృతాశనకర్హమౌఁగాని మాంసాశనులకు నర్హమనఁగఁ దగునె

ఆకలి నిద్దుర ల్లనుతెలియఁగనిపేటి
కింటింట వంట పేరుంటలగునె
గంధర్వ గానసౌఖ్యముగల్గుపట్టణ
మ్మసురభీమరవాళి నెసఁగ ఘనమె
తే. గీ. దేవ దేవర్షి వరులకుఁ దావలమగు
నగర మడవిమ్రుగమ్మురులకుఁ దగినదగునె
కాకిముక్కున రత్నంబుఁ గట్టనగునె
అంచమెడ నత్తగవ్వపే ర్గుచ్చఁదగునె.

(కన్నీరుఁ దుడుచుకొనుచు) దుర్మదాంధులై నాసూనులఁ బరాభవించి పారఁదరిమిన దైత్యహాతకుల నింక స్వర్గమున నెన్నినాళ్ళుంచెదవో యని ప్రార్థించుచున్నాను.

విష్ణు—కన్నకడుపుగాగ నట్లు దేవులాడెదుగాని నాకు దివిజదైత్యులలో పగవార లెవరు?

అది—ధర్మద్రోహులు.

విష్ణు—అట్టివా రీయుభయపక్షములలో నేపక్షమువారు?

అది—రాక్షసు లనఁగూడదా?

విష్ణు—ఎట్లు?

అది—వంశపరంపరగా సహజమగు దుర్గుణముగలవారుగాన—

విష్ణు—చాలవరకు నిజమేయగుఁగాక! పశ్చాత్తాపచిత్తులై దుర్మార్గము ను విడిచి యెపుడు సన్మార్గులైరో తత్క్షణమే ధర్మదేవతచేత రాక్షసులు క్షమింపఁబడిరి. బంధవిముక్తులైరి. ఇంక దుర్మార్గు లని, ధర్మద్రోహులని నే నెట్లందును?

అది—సరే. ఇఁక నాకుఁ గృపసేయువరమెట్లు? నే నర్థించువరమిదియే.

విష్ణు—తప్పక నీవాంఛ నిర్వర్తించెదను.

అది—ఇఁక నెట్లు?

విష్ణు—నే నేపాట్లుపడిన నీ కేమి? దనుజుల యధీనముగనున్న ప్రభుత్వము నీతనయులకు రావలసినదనియేకదా నీకోరిక ?

అది—నాతనయులకుఁ బూర్వమువలె ప్రాభవసంపద రాఁదగినదనియే నాకోరిక.

విష్ణు—తథాస్తు. ఇచ్చెదను. నిర్విచారముగ నుండుము.

అది—ధన్యాస్మి. ఇంతే నాకుఁజాలు తండ్రీ.

విష్ణు—ఇంతేచాలునా ? నాయంతవాని సందర్శించి కోరినకోరిక మాత్రమే నెఱవేర్చుకొనుట యొక గొప్పగాదు. చూడు-

కం. తనయుఁడనై నీగర్భం
బున జన్మించెదను నన్నుఁ బోషింపుము కో
రనికోర్కె నీకొసంగితి
జననీ నీవరసు నపుడ సఫలమొనర్తుక్.

నీకడుపునఁ బుట్టుటకు సమయమిప్పటికి లభించినది. పరమపవిత్రమైన నీగర్భంబున నుద్భవించి గర్భసంబంధ పరితాపము నివారించెదను.

అది—ధన్యాస్మి. ధన్యాస్మి. (నమస్కరించును.)

విష్ణు—కల్యాణమస్తు. (అంతర్ధానమగును.)

అది—(ఆనందమున) ఆహా ! భగవత్కృపావిశేషము—

ఉ. కోరినదాని నిచ్చునధికుండన లీనను వాఁడొ యుత్తముం
డారక త్రిప్పిత్రిప్పి తుదఁ గొప్పనఁజేయును మధ్యముండటే
నేరక త్రిప్పి లేదనును నీచుఁడు, గోరినవెల్ల నిచ్చియుక్
గోరనిదిచ్చు దేవుఁడను గోవిదవాక్య మసత్యమెట్లగుక్.

(నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

### వింధ్యావళి శయనమందిర ప్రదేశము.

[బలి ప్రవేశము.]

బలి—(స్వగతము) ఇఁక నీయజ్ఞమొకదానితో నాయొనర్చినదీక్ష నిర్వర్తించును. శతాశ్వమేధములు సంపూర్ణమగును. ధన్యుఁడనైతినని యపుడుగాని యనుకొన వలనుపడదు. ఇంతకు మంచికిఁగాని చెడ్డకుఁగాని కాలాత్మకుఁడైన పరమేశ్వరుఁడు సాధనములన్నియు సంఘటించి సరిపుచ్చుచుండును. లేనిచో—

చ. గురునుడికీర్తి నేనడుచుకొన్న స్వకీయులునైజమున్వృథా
సురులు సధర్మశాట కడుఁగ జోద్యము సర్వసమర్థ శాత్రవు
ల్దురమొనరింప కూరకయె దోసిటఁ బ్రాభవవైభవంబు లె
ట్టిరహహా మంచికాలము ఘటించినఁగాకిటు లబ్బుటల్పమే.

ఇట్లు కష్టసౌఖ్యసంప్రాప్తములు సర్వప్రాణులకు సహజమైనవియే కాని చాలవర కింపుఁ బొరపాటులఁబడి బుద్ధిమంతు లనుకొనువారుఁగూడ బద్ధులయ్యెదరు.

తే. గీ. కాలపరిమాణదశను సౌఖ్యములుగలుఁగ
స్వపురుషార్థంబటంచుఁ గర్వపడుచుంద్రు
అటులఁ గష్టకాలంబు రా నా స్వశక్తి
మరచి దైవముఁదూరుచు బరితపింత్రు.

ఇదియే దేహధారులందఱి నైజవికారములలో ప్రాముఖ్యమైన వికారము. ఇట్టి వికారములు కేవలము భగవత్కృపాపాత్రులై ధన్యులగువారికిఁ దప్ప తక్కినవారినందఱ బాధించియేతీరును. (స్మృతినభినయించి)ఓహో! మరచితి నేఁడింతవరకు యాగశాలకు మత్ప్రాణేశ్వరియగు వింధ్యావళి రాకఁ దడయుట కేమికతమో యని యేతెంచిన నన్నీమందిరమున సబహుమానముగ నెవ్వ రెదుర్కొనుటకైన రాకున్నారేమి ?

(యవనిక రొత్తింబడును. వెనుక నొకశయ్యపై వింధ్యావళిపరుండును.)
(చూచి) ఇదేమిచిత్రము ? నేడింతవరకు నాయర్ధాంగలక్ష్మి మేల్కొనక నిద్రించుచున్నదా ? లేక నాయందేమైనఁ గినుక వొడమినదా ? హరి హరీ! పొరపాటు. సహధర్మచారిణియై—మహాగుణవతియై—పరమసాధ్వీతిలకమనిపించుకొనిన వింధ్యావళికిఁ గినుక యనుకళంకముండునా ? కాదు. కారణమేదేని యుండనోపును. (సమీపించి చేయివైచి) ప్రియురాలా! యిదేమినిద్దుర—

వింధ్యా—(లేచి శయ్యదిగి) నాధా! క్షమింపుఁడు నమస్కరించెదను. నేఁడేమో మనసున నూరక నూతనమగు వికారమొకటి యాందోళనరూపమున వ్యాపించినది. నిదురకాదు, జాగ్రత్తుకాదు. కన్నులు దెరచినను మూసికొనిపోవుచున్నవి. లేచి యజ్ఞశాలకేగుట కుద్దేశింప, మనస్సునఁ దగనివిసుగు. లేవలేకున్నాను. భావప్రపంచమున విచారచిత్రములు గోచరింపుచున్నవి. ఏమితోఁపకున్నది.

బలి—అటులనా ? వేరేమియుఁ గాదులెమ్ము. శతాశ్వమేధాదీక్షాపరతంత్రులమగుటచేత తత్కార్యభారమునఁగల శ్రమమున నింతమాత్రమైనఁ జిత్తమునకు వికారమొదవకుండునా ? అయిన నావికారము లేవియో చెప్పఁగలవా ?

వింధ్యా—చెప్పలేకేమి. కాని, అట్టివికారములకు నాకేమొ యొకవిధమగు భయముగూడ మనసున నాటుకొన్నది.ఏమిచేయవచ్చును?

బలి—నిర్దుష్టప్రభావసంపన్నవగు నీకు స్త్రీసహజమగు భీరుగుణము కలుగఁదగనిదే. కాని నీమనోనేత్రములకుఁ గోచరించినవికారము లేవియో తొలుతఁ జెప్పుము ?

వింధ్యా—భావవికారములన్నియు నిహూపించుటెట్లు ? చెప్పక దాచుకొనుటెట్లు ?

తే. గీ. నిర్మలామృత సేవావికసితచిత్తు
లగుసురాసురానుభవము లట్లు సత్య
దీక్షకారణమ్మనను దైతేయులకు న
ధోగతి సురలకుసుగతి గాఁగఁదోచె.

బలి—(చెవులు మూసికొని) అమంగళము ప్రతిహతమగుఁగాక ప్రతి హతమగుఁగాక (యోచించి) సత్యదీక్షాకారణమున దైతేయుల కధోగతియా? ఎంతటి పిడుగువంటిమాట! హరిహరీ! మిగుల నాశ్చర్యముగను యపూర్వముగ నున్నదే. (మరల యోచించి) చూడు ప్రాణేశ్వరీ! నీచెప్పినవిషయమంతయుఁ బరస్పరవిరుద్ధము గనున్నదిసుమా? నేననినట్లు నీ కాహారవిహారసంబంధమగు ప్రకృతివికారమే కాని వేరనినాకుఁ దోచుటలేదు.

వింధ్యా—కాదుజీవితేశ్వరా! నాయంతరాత్మ నా కట్లుదోబ్ధించుట లేదు. కీడును శంకింపుచునే యున్నది.

బలి—నిరుపమపవిత్రపాతివ్రత్య ప్రభావాంతఃకరణవైన నీనిర్మలహృదయ మున నసత్య సంకల్పములుద్భవింపవు. కాని సత్యదీక్షాకారణ మనుటలో మాత్రము నామనస్సు తద్వ్యతిరేకముగనే శంకింపు చున్నది.

చ. నిరుపమతేజమూర్తి నళినీహితుఁ జీకటిమంటు నేని దు
ర్భరమగు నగ్నికింజెదలు పట్టునయేనిఁ బదాపవన్నె బం
గరినుము గావిషాంశమును గాంచెడు నేనిఁ బవిత్రసత్య ధ
ర్మరతులకా నధోగతి తిరంబుగ నంచెద విశ్వసింపుమా.

హా! ఎంతటిమాట. సత్యవ్రతులకే యధోగతి లభించిన నింక సర్వము శూన్యమై నామావశేషము గాదా?

వింధ్యా—అదియునిజమే. కాని ప్రాణపతీ! చూడుఁడు. దూరమాలో చింపుఁడు. మన్మనఃప్రపంచ సంబంధమగు వికృతియుఁగూడ వృథ

కాదనియేగట్టి నమ్మకముతో మనవిఁ జేసికొనుచున్నాను. వేరు గమాత్రము భావింపకుఁడు.

తే. గీ. దనుజవాసంబయిన స్వర్గ ధామమమర
వాస భూలోకమౌర వ్యత్యాసముగను
మీఁదక్రిందయినటుఁ గ్రిందు మీఁదయినటు
కానిపించెఁ దర్కింపనిక్కమనిపించె.

బలి—మంచిది. నీ కెట్లనిపించినను నా కవసరము లేదుగాని వచ్చిన చిక్కిదియే. సత్యవ్రతుల కధోగతి యనుటమాత్ర మసత్యమనక వీలులేదు. చూడు.

సీ. హితసత్యరతుఁ డధోగతుఁడైన సకల లో
కములు భగ్నమండి కాలిపోవొ
సూనృతసద్వ్రతాశీశుఁడూర్ధ్వగతికిఁ
జనకున్న సృష్టినాశనముగాదొ
సన్మార్గుఁడు తరించి చనఁడేని నక్షత్ర
గోళముల్ పెళపెళ వ్రేలిపడవొ
నిత్యసత్య నిమగ్ననియతుఁడే చెడినచో
ముమ్మూర్తు లామీఁద వమ్ముగారొ

తే. గీ. సత్యమే క్రుంగిపోయి నిస్సారమైన
యుండఁ గలదేదియుండుట కూతయేది
దేవుఁడెవఁడు వానినెవండు దేవులాడు
సుగతిలేదు దుర్గతిలేదు దిగులులేదు.

నే నొక్కఁడనే యిట్లనుటకాదుసుమా? వేదాదిసమస్తశాస్త్రములును, సర్వప్రాణులును సత్యవ్రతుల కధోగతియని పరిహాసమునకైనఁ బలుక సాహసించునా? కావున నట్టిచింతమానుము.

వింధ్యా—నేఁ జింతించినమాత్రమున కానున్నది కాకమానునా? భావ ప్రపంచమున నేదేనివిషయము గోచరింపఁ దర్శించుకొనుచుఁ దగలోఁ దాను దాచుకొనుట నిర్మలవర్తనులకు ధర్మముగాదు గావున, నిజమును మనవిఁజేసికొంటి. తాము నిష్కళంకచిత్తులు గారా ? ఇట్టియనుభవ మెన్నఁడేనిఁ బొత్తుపడకయున్నవారా ? ఇంతకుఁ బ్రాప్తసూత్రమున కడ్డేమున్నది.

బలి—(యోజించి) నీవ్రారక నాచెవిని నూరిపోయుటచేతనో, యింకే కారణముచేతనో, కాని, నాచిత్తముగూడ డోలికవలె నూగుచునే యున్నది. అనుమానాస్పదముగ నంతరాత్మ శంకింపుచుఁ గూడనున్నది. (గడ్డమువట్టికొని) ఇంతమాత్రము నీ వాచర్చనిఁకఁ జర్చింపక విడువుము. ఆలసింపకుము. మనము యజ్ఞవాటిక కేగవలసియున్నది. ఎట్లో నాలుగుదినములు కష్టపడితిమేని శతాశ్వమేధములు నిర్వర్తించును. సర్వవిధముల ధన్యులమగుదుము.

వింధ్యా—చిత్తము. అభ్యంతరమేమి ! ఆజ్ఞానువర్తననుగదా ? జీవితేశ్వరా ! మరియొకమనవి. తాము సత్యధర్మదయావ్రతములు నిరుపమముగ నొనర్పుచున్నారనుటకు సందేహము లేదుగాని నాకు మాత్ర మిప్పట్టున నొకసంశయము బాధింపుచున్నది. మనవి జేసికొనుటకు సెలవా ?

బలి—మరల నేమివచ్చెను ? అయినఁ గానిమ్ము ?

వింధ్యా—చిత్తము. దయయన నర్థమేమి ?

బలి—దయయనఁగా నితరములగు సర్వజీవములదుఃఖములనుఁ జూడలేకుండుటయు, చూచి విచారముతో యథాశక్తి యుపకారమాచరించుటయును, జీవితాంతమువరకిదేవ్రతమును నిరుపమనిష్ఠతోఁ గడుపుకొనుటయు నని పెద్దలందురు.

వింధ్యా—అట్లయైన దేవతలు పాప మెన్ని కష్టముల కిపుడు లోనై యెంతెంత దుఃఖమనుభవింపుచున్నారు ? కన్నులారఁ జూచు చుండియు నుపకార మేమాచరించినారు ?

బలి—అది లౌక్యము, తత్సంబంధమును బట్టి ద్వేషించినట్లు నడుచుటే కాని, యంతరంగము నిర్వికారమే. దేవతలఁ గూర్చి యట్లుండక వీలులేదు.

వింధ్యా—అనఁగా నాకుఁదెలియుటలేదు. స్పష్టముగా సెలవిండు ?

బలి—స్పష్టముగాక మర్మమేమున్నది ? ఎవ్వాఁడుఁగాని దేహమున్నంత వర కిహపరములఁ జూచుకొనుచు జీవయాత్ర నడుపుకొనవల యునని—

వింధ్యా—ఇపుడు దేవతల ద్వేషించినట్లు నడువకున్న జీవయాత్ర నడువదా ?

బలి—ఎట్లు నడువఁగలదు ?

వింధ్యా—రాజ్యాధిపత్యము వీరభోజ్యమనుసూక్తి ననుసరించి యెట్లో ప్రభుత్వమాక్రమించుకొన్నారిది ధర్మమే నేమో కాని, పగతుర నిశ్శేషముగఁ బారఁదరిమి, దుర్గతులు గలిగించి, కడునిడుమల నలయింపుచుఁ దుదకు లోకమునకైన వచ్చుట కవకాశమీయక నిర్బంధశాసనము లెన్నో సృష్టించి వేధించు టిదేమిధర్మము ? క్షమించి నాసంశయము నివారింపుఁడు.

బలి—సముద్రమథనమునకుఁ బూర్వము మనకున్న ప్రభుత్వమును మాయోపాయములు పన్నుకొని మర్మహృదయులై టక్కరి మాటల నమ్మించి మోసగించి యాక్రమించుకున్నది దేవతలను మాట మరచితివా? పోనీ, వారాక్రమించుకొని యంతతో నూరకున్నారా ? ఎన్నెన్ని నిర్బంధనిబంధనలు సృష్టించిరి. ఎన్నె న్ని యాపదలపాలొనరించిరి. మారణసాధనము లెన్నిప్రయో

గించిరి. నీవట్టికష్టపరంపరలకుఁ గురి గాలేదా ? మాయకులఁ గూర్చి నిర్మాయగా చరించుట రాజధర్మము కాదని నీవెఱుఁగవా ? ఇంక నా తప్పేమున్నదో యోచింపుము.

వింధ్యా—నిశ్చయమే ! నేనుమాత్రము మరచినానా ? తామువచించిన దంతయు సత్యమే. కాని, వారునడిచినట్లే మనము నడువవలయునా ? అట్లైన నెంతకాలమునకైన నీవైరభావము లుభయపక్షములవారికి శాంతించునా ? వారోనర్చిరని మనము, మనమోనర్చితిమికదాయని వారును కక్షలకుఁ బూనుకొనుచుంట శ్రేయోదాయకమగునా ? అంతరాత్మ నిష్కళంక వర్తనులమని యొప్పుకొనునా ?

బలి—అటులఁగాక యింకెట్లునడుచుట యుక్తమగునో నీకుఁదోఁచినరీతిఁ జెప్పుము. బాగుగనున్నచో దానినే యనుసరింతను.

వింధ్యా—మీ యీ సేవకురాలి కంతటిసమర్థత కలదా ? కాని యేదేని సంశయము గలిగిన నాకు మీకన్న నివారింపఁగల సమర్థులెవ్వరు ? నాపాలిట దైవస్వరూపులు తాముగాన నిట్లు మనవి పూర్వకముగ విన్నవించుకొనుచున్నాను. వేఱుకాదు. క్షమింపుఁడు.

బలి—నీ యూహయ మట్టిదే. సందేహములేదు. చెప్పుము. విననపిదపఁ జూతము.

వింధ్యా—వారు పగతురని మనము, మనమువిరోధులని వారు ద్వేషముఁకుఁ దావిచ్చినకొలఁదిని వైరగుణము హృదయములఁ బరస్పరము స్థిరముగఁ బాదుకొని తగినఫలానుభవము సంఘటింపక మానదు. కావున మనసాంఘికులగు దానవులకువలెనే దేవతలకుగూడ నున్నతోద్యోగపదవు లొసఁగి దైత్యుల నెట్టి నిర్మలాభిమానముతోఁ జూచుచుంటిమో యట్లె నభేదవృత్తితో

సురలఁగూడఁ జూచుచున్నఁ గ్రమక్రమముగ నుభయపక్షము లలో వైరభావములు నశించి ధర్మసిద్ధినొంది సుఖపడఁగలరు. దూరమాలోచింపుఁడు. సూక్ష్మబుద్ధిగలవారు గాన మిక్కిలి మాట లనవసరము. తప్పులున్న మన్నింపుఁడు.

బలి—ఇపుడు నీపలికిన పలుకులన్నియు నిర్మలధర్మబద్ధములే. కాని లౌక్యముబట్టి మాత్రము ప్రత్యక్షాచరణమునకు వీలులేదు.

చ. అరులనుఁ జేరదీసితనకేమాయనుపట్టుల నిల్పి వైరము
న్మరువగనేమి వారునటు కే మర్మనుమానిచరింతురే? మరే
తరుణమెు చూచి స్వామికిఁ కే గృతజ్ఞతఁజూపుట నైజమింటిలో
నురగులనుంచి పెంచిన విశేషోగ్రగుణంబెపుడేనిఁ జూపవె.

సహజసుస్వభావుఁడగు యజమాని ద్వేషలేశమైనఁ దనహృదయమున లేక నాదరభావములోనున్నను విరోధియగువాడూరకొనఁడు. ఎప్ప టికి వాని నమ్మరాదు. వానికెందెందుకుల నేమాత్రము నవకాశ మీయ రాదు. ఇది ప్రపంచకధర్మము. అనుభవైకవేద్యము.

వింధ్యా--చిరకాలానుభవపరులగుతమవాక్యముల సత్యములుగావు.కాని మీయభిప్రాయము క్రూరస్వభావులగూర్చి నిర్ధారింపుచున్నది. దేవతలు సహజక్రూరులు కారు. మనమెన్నఁడు వారినట్లుగనివినలే దు. పైగా సత్ప్రధానువర్తనులనియు, సహనసంగతశాంతచిత్తులని యు, పరోపకారణపరాయణులనియు, భగవత్పరతంత్రులనియు, సత్యమూర్తులైన మహర్షులెందరో కీర్తింప వినియున్నామే. అట్టిగు ణవంతులు సహజవైరమునఁ గీడాపాదింతురని శంకించుట హృద యదైన్యమనుకొందును.

తే. గీ. సత్యహృదయునకేటికి కేజంకుమెవని
వలననేకీడురాదు ధృకేవమ్మునుమ్మ

నిజపుటంబునబంగరు కై నిగ్గుదేలి
కగ్గునెటునీళ్లకెండకు నగ్గిసెగకు.

కావున వారిచే ఘోరమగు ప్రమాణములఁ గైకొనినయిన మర్మముల విడిచిపుచ్చి పాలునీరులవలె నభేదవృత్తితో సుఖకష్టముల సమానానుభవులై మెలంగెదరేని మీరుమీరానందులగుటేకాక, యిందుధరేంది రేశాదులుగూడ బ్రహ్మానందమొందెదరు. సమస్తప్రాణులకు హాయి కలుగును. అట్లుజరుగుటసంభవమంకురా ? సహజమగు వైరులము మే మనుకొంకురా ? ఇదిమిక్కిలి పొరపాటనకపీలులేదు.

చ. అరులగువారుబొత్తగుట కై నర్హమె కాదనఁ గానిమీకు ని
గ్గరులరుతాటదెట్లొక ప్రజాపతిసంతతిసంతతి కాదెమీరువా
రిరుతెగలైతిరిట్టు లగుకై నేమొటనన్నలుఁ దమ్ములుమ్మడి
న్బరగరెకష్టసౌఖ్యములఁ కై బాల్యాను వేళలవీడికూడరే.

అన్నదమ్ములకు నెటనేని వైరమెట్లో ప్రేమయునట్లే. సహజమగుధర్మము కాదా ? ఆపత్సంపదలలో వంశాభిమానరూపమగు ప్రేమచూపనివా రుంకురా ? మీకుమీకును సర్వకాలసర్వావస్థలయందు వైరభావము లేలయుండవలయును ? ఇదిలోకవిరుద్ధముగాదా ? ప్రార్థనాపూర్వకమగు నామనవిని వృథసేయకుఁడు.

బలి—నీమాటలుయథార్థములే. కాని, మాకుమా కైకమత్యముఘటిల్లు
ట కలలోనివార్త యనకఁ దప్పదు ఏలయన ?

తే. గీ. కశ్యపబ్రహ్మవంశమే కద యనిమిష
దానవపతంగ భుజగాదు లైననిందు
నొకరికే నొకప్పుడుమైత్రి యొదవినట్లు
గాంచిరెవరటులేముందుఁ గాంచలేరు.

మేమీపట్ల లోకముతోఁ బాటువారముగాము. మాకు మాకైకమత్యత యెన్నఁటికినిఁ గలుగదు.

వింధ్యా—అయినచో నాసంశయమింకను బలపడుచున్నది సుండీ !

బలి—సత్యవ్రతుండకధోగతినిగూర్చియేనా ? కానిమ్ము, బలపడనిమ్ము. [illegible]. అంతటిమహావిరుద్ధము సత్యమునకు రానుండ చూడఁగోరదగినదేకదా ? కానిమ్ము, కానిమ్ము.

వింధ్యా—అధోగతియని నాకుమాత్రమేకాని ఆనందము దివ్యానందమేయున్నట్లున్నది.

బలి—నీభావమంతయు నేఁడు పరస్పరవిరుద్ధముగనే యున్నది.

వింధ్యా—అవధరింపుఁడు. మనమున్న స్వర్లోకము మారినపుడు మీరు బంధములఁ జిక్కియున్నట్లును, ఎట్లోకాని, క్రిందిలోకమునకుఁ జేరితిమి. అప్పుడు మీబంధములేమయ్యెనో కనిపింపలేదు. సరికదా ! మహేంద్రవిభవము లెక్కఁగొనని మహానందమునఁ దేలుచున్నట్లును నాకుఁ బొడకట్టినది.

బలి—(నవ్వుచు) ఇఁకఁ జాలూరకుండుము. నీవాగ్వైఖరి వెఱ్ఱివెంకటాయను బోలుచున్నది. మనమిటఁ దడయరాదు. యాగశాల కేగవలయు రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు)



ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము.

## పంచమాంకము.



ప్రథమరంగము.

ప్రదేశము - వీధి.

[వామనుఁడు ప్రవేశము.]

వామ—అస్మన్మాయావ్యామోహిత సృష్టివిలాసములఁ గాంచిన, నాలో నాకే నవ్వువచ్చుచుండును. ప్రొద్దుపోనివానియటుల నిష్టిపనిఁ గల్పించుకొని, కపటనటుఁడనై, విష్ణ్వల్లతఁబోలి తోఁచితోఁపనట్లున్న నన్నూహించి విజ్ఞానులును, నావలెనే నవ్వుకొనుచుందురు. మొత్తమున నిది నాటకమని నాకును విజ్ఞానులకును తెలిసినదియే, కాని నాకును, వారికిని నడుమనకు, ప్రేక్షకులకువలెనే కొంతతారతమ్యము లేకపోలేదు.

తే. గీ. నటుని నాటక మెఱిఁగియు నవరసజ్ఞు
లట్టి యాటనె కనితన్మయత్వమొందు
పగిది నామాయకుభ్రమఁబడకమాన
రెట్టివిజ్ఞానమానవు లేనిఁగాని.

అటులఁగాకున్న సర్వజ్ఞుఁడగు కశ్యపప్రజాపతియే నాఁడంతగా నెఱుఁగని పుత్రవ్యామోహమునఁ జిక్కుకొనునా? దివ్యదృష్టిసంపన్నుఁడు గాన ఋణబద్ధుఁడనైతిఁగదాయని యపుడపుడు తెలుసుకొని తన

లోఁ దాను నవ్వుకొనుచు మరల నంతలో మరచి స్వనియములనైతమం తగా బాటింపక మద్విలాసములఁ గాంచుచు కాలముఁ గడుపుకొనుచున్నాఁడు. ఇట్టిమహాత్ముల భ్రమనుఁ గాంచి నేనును నవ్వుకొనుచుందును. మొత్తమున మహాత్ములభ్రమంగాంచి నేనును, నామాయామహిమగా గ్రహించినపుడు మహాత్ములును నవ్వుకొనుచుందుము. మదీయలీలావిలాసములలో నాకెక్కుడానంద మొసఁగునది ముఖ్యముగ నిదియే.

[వటులు ప్రవేశింతురు.]

(చూచి) అదిగో! నాతో నాడుకొనుటకు గొందఱుకుఱ్ఱవాం డ్రేతెంచుచున్నారు. చూడనటుల నటింతును. (ఎటోచూచుచుండును.)

1-వ, బాలు—పొట్టెయ్యా! వెఱ్ఱివానివలెఁ జూచుచున్నావేమి?

2-వ, బాలు—అదేమిరా! అట్లుపిలిచెదవు? ఆయనవామనుఁడుకాదూ?

3-వ, బాలు—నీతెలివి తెల్లవారినట్లేయున్నది. వామనుఁ డన్నను, పొట్టెయ్యన్నను అర్థమొకటియేకాదురా?

4-వ, బాలు—మీవితర్కము లట్లుండనిండు. ఏనాఁడుగాని మనరాక కెదురుచూచువామనుఁడు నేఁడిట్లు మనము మాటలాడుచుఁ దన్ను సమీపించినను మనవంకఁ జూడక నెటోచూచుచున్నాఁ డాకారణ మేమికావచ్చును?

అందఱు—(వామనునిఁ జూతురు)

1-వ, బాలు—నిజముగనే. ఇదేమి! యిటులఁజూచుచున్నాఁడు? (చప్పట్లుకొట్టుచు) ఊశ్! పొట్టెయ్యా! (బిగ్గరగాఁ బిలుచును.)

వామ—(చూచి) ఓహో మిత్రులారా! ఎప్పుడువచ్చితిరి?

4-వ, బాలు—అదేమి వామనా! పరధ్యానముగనున్నావు?

వామ—పరధ్యానము నాకెక్కడిది?

3-వ, బాలు—మరి నీదిపుడేధ్యానము?

వామ—మీాధ్యానమే.

1-వ, బాలు—అదేమి పొట్టెయ్యా! మీాధ్యానమనఁగ ?

వామ—మిత్రధ్యానము.

1-వ, బాలు—మాకొరకే చూచుచున్నావా యేమి ?

వామ—మీారుగాక నా కింకెవరున్నారు ?

1-వ, బాలు—మేముగాక నీకు మిత్రులెవ్వరిఁక లేరా పొట్టెయ్యా ?

2-వ, బాలు—అదేమిమాటరా ఛాందసుఁడా! వామనుఁడన్నమాటలో మననలుపురిఁగూర్చినయర్థమేయున్నదా ? మిత్రమండలిని సాంగముగ సూచించుటలేదా ?

1-వ, బాలు—ఇంతయర్థము తెలిసిన మహాపండితుఁడవేమోమిత్రమండలియనుచున్నావేమి ?

2-వ, బాలు—అనినఁ దప్పేమి ?

1-వ, బాలు—తప్పుకాకయొప్పు మరి? మనపొట్టెయ్య కెన్నివేలమంది మిత్రులున్నారమ్మా ?

వామ—అదేమిమిత్రమా! మిత్రభావమే ముఖ్యముగాని, యింతయని సంఖ్యకావలయునా? మేరయుండునా? మైత్రితత్వముగలవానికిఁ జరాచరమయమగు ప్రకృతియంతయుఁ బ్రేమాస్పదమేకదా ?

1-వ, బాలు—ఏమో పొట్టెయ్యా! నాకు తత్వం తెలియదు. తప్పు తెలియదూ. తినడం తిరగడం.

3-వ, బాలు—అన్నిసరియేకాని, మాటిమాటికినీ పొట్టెయ్యా పొట్టెయ్యాయని సంబోధింతువూ ?

4-వ, బాలు—నిజమేరా! పేలవముగాను, శ్రుతికటువుగానున్నది. కావున నీవిఁక ననకుము.

2-వ, బాలు—పేఁడన్నాఁడని విన్నవాండ్రందఱును వేలము వెఱ్ఱిగ నిట్లు పిలువరా? చూచినవాఁడెల్లఁ బిలిచినపుడు పేలవముగాక ప్రియ

మగునా? వామనుఁడు మంచివాఁడుగాన సరిపోయినది. అదితి కశ్యపులే విన్నచో వీని సాగదీసి చంపివేయకుందురా?

1-వ, బాలు—ఓరీ వెఱ్ఱిమొగమా! నీయంతమాత్ర మభిమానము, ప్రేమము నాకు లేదనుకున్నావు గాఁబోలు. వాగకు. ఇఁక నోరు మూసికో.

3-వ, బాలు—నిజమాడ నిష్ఠుర మన్నట్లు పైగా వానిఁ గొక్కరింపుచున్నావే. నీవు పొట్టయ్యా! యని పిలుచుట ప్రేమయు, నభిమానము గూడ నేమి? మరల నీసారి యటులఁ బిలువుము. నీసంగతి, వాఁడుకాదు, నేను చెప్పెదను. ఓహో! నోరుమూసికొనవలెనా? జాగ్రత. (గద్దించును.)

4-వ, బాలు—నిజమేరా! నీ వట్లు పిలుచుటేల? నీది మమ్మాటిక్కనిఁ దప్పే. నీపేరు విస్సాయ యనుకో. బుస్సాయ యని యెవరైనఁ బిలిచిన నీకుఁ గోపమురాదా?

1-వ, బాలు—ఓరి వెంగళప్పా! అదికాకు—

2-వ, బాలు—(అర్ధోక్తిలో) ఇఁక నోరెత్తకు. మాటాడిన జుట్టూడదన్నెదను.

1-వ, బాలు—ఆఁ! తన్నెదవా?

2-వ, బాలు—నిన్నా నీతాతనుగూడనురా? (అనికను లెఱ్ఱజేయును)

3-వ, బాలు—నీముత్తాతను కూడను. (అనిచేయెత్తును.)

4-వ, బాలు—నీముత్తాత తాతను గూడను. (అని జట్టుఁబట్టకొనును)

1-వ, బాలు—(నాలుగవబాలుని జుట్టునొడిసిపట్టి) నీవు నాజుట్టుఁబట్టుకొందువఁటరా?

వామ—(ఉభయులవారింపుచు) ఇదేమి మిత్రులారా! మీకీయకృత్యము తగునా?

1-వ, బాలు—చూఁడుపొట్టెయ్యా! వీనిపొగరు.

4 వ బాలు—అదిగో! నిన్నదే వద్దన్నది.

2 వ బాలు—ఛీ ! నీకు సిగ్గులేనేలేదేమిరా ?

వామ—విస్సయ్యమాట తప్పుకాదు. నన్ను మాతల్లిగారు ముద్దున నపుడపు డట్లు పిలువగ విని పిలుచుచున్నాఁడు గాని వేరుకాదు. నాకదియిష్టమే.

1 వ బాలు—అట్లా మొగముపైఁగొట్టు. (బాలురఁజూచి) ఇపుడెవరు సిగ్గుదెచ్చుకొనవలసియున్నది ?

వామ—(వారింపుచు) వైరము బెంచికొనకుఁడు. అది మనకపకార వస్తువు.

2 వ బాలు—వాఁడట్లు బిలుచుట నీకిష్టమైనపుడు మాకేమికావలయు నులే. వానితో నీవట్లే పిలిపించుకో బాబూ! మాదేమిపోయిందీ.

వామ—మిత్రులారా! కినుకవలదు. మనసుఁ జూడవలయుగాక మాట తో నేమిపని ? యన్నట్లు పిలిచినంతనే యాయనకు నాయందు ప్రేమ లేదేమో విచారింపుడు.

2 వ బాలు—ఉండనీ లేకుండనీ. మాకేమవసరము. మాటతోఁ బని లేనివాఁడవు నేఁడిట్లైద నిన్ను కోపము రాఁగూడదు- మనసు నేచూఁడవలయు.

3 వ బాలు—ఇట్లుకాదు. వానిఁగొట్టుట కపుడు చెయ్యెత్తినాను. ఆ దెబ్బ నీకిపు డంటించెదను. నీవు పోటు చూడవలదు. నాబుద్ధినే చూడుము.

4 వ బాలు—శ్రుతిమించి రాగమునకు దిగుచున్నది. ఇదియంతయు ననురాగముగనే చూచుకో పోట్లైయ్యా !

వామ—(నవ్వుచుఁ దనలో) ఇదియే మద్విలాసము (ప్రకాశముగా) నన్ను మీయిష్టానుసార మొనర్పుఁడు, చలింపను. మొన్నటి

కోతికొమ్మంచియాటలో మీరందఱు నన్నుఁ గొట్టినా శాంత భావమరసి నీ వచలుఁడవని నన్నంటివే జ్ఞాపకమున్నదా ?

4 వ బాలు—లేకేమి. అట్లెంతవర కుందువు ?

వామ—ఎంతవరకైన నుందును.

4 వ బాలు—అంతులేకయుందువా ?

3 వ బాలు—అనంతుఁడవా ?

వామ—అనుభవమునఁగాక యెట్లు తెలియనగును.

2 వ బాలు—సరి. నీయభిప్రాయమిపుడు దేహశుద్ధి కానిమ్మనియేనా?

1 వ బాలు—ఓరి తెలివితక్కువపెద్దమ్మా ! నీకు జ్ఞానము ముదిరినట్లున్నది సుమా ?

2 వ బాలు—ఇదిగో. నిన్నిపుడు బిలువలేను నోరుమూయి. (మీఁది కేగును.)

వామ—మరలఁ గలహమున కుపక్రమింపవలను. నామాటలను సాంగముగ వినుఁడు. ప్రేమమయుఁడగు నుత్తముఁ డెప్పుడునుఁ జలింపఁడు. హితాహితుల సమానముగనే మనసునఁ బ్రేమించును. కాని, మార్గరూపములుమాత్రము వేర్వేరుగనుండును. ఎటులన-

తే. గీ. హితునెపుడుఁగూడి మైత్రినే వృద్ధిచేయు
నహితునెడ విరోధించి వేరగుచునతనిఁ
దిట్టియో, కొట్టియో, వినుతింబియొ, నెటో
వైరము నశింపఁజేయఁగఁ బాటువడును.

ఇట్టివారినే మహాత్ములని మన మెఱుఁగవలయును. వారి యిష్టముల ననుసరింపుచు, వారియుపదేశములను శిరసావహింపుచు జీవయాత్ర నెవఁడు గడుపుకొనునో ఆతఁడొందని శుభములే లేవు.

3 వ బాలు—సరేనయ్యా ! నేనిపుడు నిన్నుఁగొట్టెదను, నాతో విరోధించి నీవు నన్నుఁ గొట్టెదవన్నమాటయేనా ?

వామ—సమయమునుచూచి మెలఁగెదను. కాని ఇపుడెట్లుచెప్పఁగలను.

2 వ బాలు—మంచిది. మఱియిపు డేమిచేయమందువు ?

వామ—మీకెట్లిష్టమో యట్లే.

4 వ బాలు—నిన్నుఁ గొట్టవలయునని నాకిష్టమున్నదే ?

వామ—మంచిది కానిమ్ము.

3 వ బాలు—నిన్నుఁ గొట్టినవాఁడు గూడ నీకుఁ బ్రేమాస్పదుఁడే కాదూ ?

వామ—ఔను. తల్లి, తండ్రి, యుపాధ్యాయులు మొదలగు శ్రేయోభిలాషు లా యా సమయముల ననుసరించి సక్రమముగ దండింతురు. వారినిఁ బ్రేమింపక దండించిరని ద్వేషించుట తగునా ? తెలియన ట్లడిగెద వేమి ?

2 వ బాలు—మే మట్టి పూజ్యులలోఁ జేర్చుకొనవలసినవారము నీకుఁ గామే ?

వామ—కాకపోవుటేమి. నిజమారసిన నాకు మీరు వారందఱికన్నను పూజ్యతములనక వీలులేదు. చూడుడు—

ఆ. వె. తల్లి, తండ్రి, గురుఁడు, దాయాదు లితరు లె
ట్లున్న హితుఁడె ముఖ్యుఁ డెన్నఁ దనకు
భూతసాయమెంత పొందియుండిన సృష్టి
కమలహితుఁడు లేకఁ గ్రాలఁగలదె.

1 వ బాలు—ఔరా పొట్టెయ్యా ! యిట్టిబుద్ధు లెప్పుడు నేర్చుకొంటివయ్యా ?

2 వ బాలు—పొట్టివానికి పుట్టెడు బుద్ధులుగాదా ?

3 వ బాలు—ఆహా ! కశ్యపప్రజాపతిసూనుఁడ వనునది సార్థకముఁ జేసితివి, మాకు బుద్ధిఁజెప్పితివి.

4 వ బాలు—గొప్పవంశమునఁ బుట్టినవాఁడు గొప్పవాఁడుగాక వే రగునా ?

వామ—హితులారా ! పుట్టుకలో నేమియులేదు. బుద్ధిలోనే సమస్త మిమిడీయున్నది. చూడుఁడు-

సీ. తనకున్నమంచి యితరులకుండినఁ జూచి
యోర్వలేక తపించుచుండు నేది ?
తనచెడ్డ నింద్యమాటనుగని యందఱి
కెట్లైన మప్పనూహించు నేది ?
తనను నుతించి మెచ్చిన మూర్ఖునేని స
రసునిఁగా దలపోసి ప్రబలు నేది ?
తనతప్పుఁజూచి వాస్తవముగఁ దగదను
ధర్మజ్ఞుఁ గుమతిగాఁ దలచు నేది ?
తే. గీ. స్వేచ్ఛఁ దిరిగి తత్ఫలసిద్ధిచేఁ దపించి
విసికి తుది రోసి వైరాగ్యవృత్తిధర్మ
సత్యభక్తివిజ్ఞాన ప్రచారమహిమఁ
దనరి నిర్మల బ్రహ్మతత్త్వ మగు నేది ?

బుద్ధియేకదా ? వేయేల ? సమస్తమునకు బుద్ధియే కారణమగును. అనఁగా, మీరు ప్రశంసించిన పుట్టువుకూడ బుద్ధికే లోపడియున్నది. దూరమారయుఁడు.

2 వ బాలు—మంచిచెడ్డలన్నియును బుద్ధిలో నిమిడియున్నప్పుడు మంచినే చేయవలయు ననుటేమి ? చేయుఁగూడదను చెడ్డ ననుటేమి?

వామ—మంచిగాని చెడ్డగాని యొకఁ డాచరించినచో నామంచిచెడ్డలు వానికేఁ గాక లోకమునకుఁ గూడ నంటకమానవు. మంచిచేయ నందఱికదిమంచియే గాన బాధ లేదు. చెడ్డచేత నందఱికిఁ జెడ్డయే గాక బాధాకరము గావున దానిమానుట మాన్యధర్మము.

3 వ బాలు—మానుటకుఁ, జేయుటకు మనకు స్వతంత్రమున్నదా ?

వామ—ఉన్న స్వతంత్రమో, అస్వతంత్రమో, తెలిసికొనఁ దగినదిదియే.

తే. గీ. ఆకసమున జీవాణువు లట్లుమంచి
చెడ్డ మొదలగు నిహపరసాధనగుణ
సమితి హృత్కుహరంబున నిమిడియుండు
దేనిఁ జనువిచ్చి పెంప వృద్ధియగునదియె.

4 వ బాలు—అటులైన సందఱు మంచినే యేల ఫవలంబింపలేకు న్నారు ?

వామ—అధైర్యముచేత.

4 వ బాలు—ధైర్యాధైర్యములు మనస్వాధీనములుగావందురే ?

వామ—ప్రారబ్ధానుసారములని యందురుగదా ?

4 వ బాలు—అవును.

వామ—అయిననేమి. ఆప్రారబ్ధము మనకెట్లురాఁగలిగెను ? ప్రారబ్ధ మనఁగనేమి ?

4 వ బాలు—నీవే చెప్పుము.

వామ—ప్రారబ్ధమనఁగా మనము జేసిన మంచిచెడ్డల ఫలానుభవమే. కావున మంచిగాని, చెడ్డగాని చేయుటకు, మానుటకు మనము ప్రపంచరీతిని స్వతంత్రుల మనక వీలుండునా? చేయునప్పుడు మన ముచేయుచున్నా మనుకొనక, మానునప్పుడు మానినామను కొనక మరేమనుకొనుచున్నాము. కావుననే బంధమని మోక్షు మనిచెప్పుకొందురు. మనము చేయుచున్నామని స్వతంత్రబుద్ధిపూ ర్వకముగాఁ జేయు మంచిచెడ్డలఫలములు మనకుబంధములగును. క్రియాచరణమున కుపకరణములగు నంతరింద్రియ బహిరింద్రియ ములెల్లనీశ్వరాధీనములుగాన మనకుస్వతంత్రము లేదు. సర్వేశ్వ ర శాసనమును నడుపకవీలుండదని భయభక్తులతో మంచిచెడ్డల

నొనర్చుచు తత్ఫలకర్త యీశ్వరుండేయని యస్వతంత్రబుద్ధితో నున్న వాఁడు మోక్షపదార్హుఁడగును. మంచిచెడ్డలమానుటకుఁ, జేయుటకు మనముగాక వేరొకరని యెట్లుచెప్పఁగలము. ఫలానుభవ కర్తృత్వములోనే కొంచెము భావభేదమున్నదిచూడుఁడు.

చ. అమృతవిషంబు లంబునిధియందుట్లు గుణాగుణముల్ జనించుఁ జి
త్తమునవిషంబు వోవిడి సుధంగ్రహియించినరీతిఁ జెడ్డఁ ద్రో
చి మరియుమంచికోరికల శీఘ్రమె చేయుటకొప్పు జీవితం
బమలినవృత్తినిం గడుపుగనాతఁడుసర్వజగన్నుతుఁడగుర్.

మంచికిఁ గాని, చెడ్డకుఁ గాని స్వతంత్రింపక వీలులేదు.

1 వ బాలు—అటులైన మిత్రమా ! నీవందఱిని మంచిగుణములతోఁ బ్రేమింపుచున్నావా ? అబద్ధమాడక నిజముఁజెప్పుము ?

వామ—నే నెప్పటికి నిజమేచెప్పెదనుకాని, నిజముచు నిజమని నమ్ముటలోనే కష్టమున్నది. అయినను నాయభిమత మడిగితివికానఁ జెప్పెద వినుము.

క. జనకునివలెవిజ్ఞానుల
జననియటుపతివ్రతలను సహజన్ముల
తినిఁ బురుషుల సెల్లెండ్రటు
వనితలఁ గనుఁ గొందుమదిని బ్రబలప్రేమర్.

1 వ బాలు—నిజముమిత్రమా ! నిశ్చయము. నీవట్టివాఁడవే.

2 వ బాలు—ఇట్టిపవిత్రవర్తనము నీపుట్టుకతోనే పుట్టినదిగాక ప్రపంచముఁ జూచి నేర్చుకొనినదికాదని నేగట్టిగ నొక్కిచెప్పఁ గలను.

3 వ బాలు—ఎటులోవచ్చినదికాని, లోకవంద్యుఁడనియు, లోకోత్తరుఁడనియు ననక వీలులేదు.

4 వ బాలు—మనమన్న నేమి, యనకున్న నేమి. కాని, మిత్రమా ! వామనమూర్తీ ! నీసద్బోధ రవితేజమువలె నామోహాంధకార

విధ్వంస మొనర్చినది. "ప్రేమ" అను ద్వ్యక్షరమహామంత్రము నా మనమునఁ బాదుకొనినది. నీమైత్రిచే దైన్యముపోయి ధైర్యమల వడినది. నాజీవితాంతముదనకను నిన్నే సద్గురునిగ నెంచి నీయభీష్ట ప్రకారమువర్తింప మదంతరాత్మతో (కన్నులుమూసి) ప్రమాణ మొనర్చికొనుచున్నాను. నీపాదసాక్షిగ నిష్కల్మషహృదయము తో నేఁటినుండి ప్రేమవ్రతమును నే నవలంబించుచున్నాను.

(వామనుని పాదములంటును.)

1 వ బాలు
2 వ బాలు
3 వ బాలు } మేమునటులే, నీపాదసాక్షిగ నేటినుండి నిష్కళంకవృత్తి తోఁ బ్రేమవ్రత మవలంబించుచున్నాము.

(అని వామనునిపాదములంటుదురు.)

4 వ బాలు—పురే ! పురే! (అని కరతాళధ్వనులఁ జేయును.)

వామ—ఇప్పుడు నేను సర్వవిధముల ధన్యుఁడనైతిని. ఏలయన.

తే. గీ. సుకవితనయనుభవము లొం కె డొకటివిడక
గ్రంథములుగమారిచి తృప్తిఁ కె గాంచినట్లు
ప్రేమమయుఁడనుఁ గూడఁ దక్తైప్రమమెల్ల
హితులహృద్గేహములనింపి కె తృప్తిఁ గనును.

4 వ బాలు—నిజము. మాకారోగ్య మ్మా కాయుష్యమనుకొనునట్లు మనలోమనము బాగుగనున్నంతనే సరిపోవునా ? ప్రేమతత్వ ము సార్థకపడునా ? ప్రపంచమంతయుఁ బ్రేమమయమైనప్పుడు గదా నిష్కళంకముగ మనయంతరాత్మలు తృప్తినొందుటలు.

అందఱు—సత్యము. మిత్రుఁడా ! సత్యము. మనమట్టి పరిశ్రమమొన రింతము.

[అదితికశ్యపులు ప్రవేశము.]

అది—మత్తపఃఫలమా! వామనా ! దినమంతయు నెచ్చెలికాండ్రతోనే గడుపుచు నాడుకొనుచున్నచో మాకెట్లు ప్రొద్దుగడుచునుతండ్రీ.

వామ—ఇదిగో వచ్చుచునేయున్నాను. మాటలసందడి నాలసించితిని క్షమింపుఁడు.

అది & కశ్య—(కౌఁగిలించుకొని) ఆహా ! నిరుపమానందము.

బాలురు—మీకేకాదు. లోకములన్నిఁటికిట్టియానందమే రానున్నది.

కశ్య—తథాస్తు.

అది—బాలులార ! యిట్టిపసివానివలన నంతటిమహాశుభమెట్లుప్రాప్తిం పఁగలను. ఇంతవరకు మాటలైనఁ జక్కఁగరావే, విద్యాభ్యాసములేదే. తుద కుపనయనమైన—

కశ్య—కాలానుసారముగ నన్నియుఁ గూడును.

వామ—(తనలో) కన్నవా రిట్లనుటసహజమే. శ్రేయోదాయకమే.

కశ్య—దేవీ! మనజన్మములు సార్థకపడునట్లు చిన్నినాన్నకు రేపే యుప నయనముహూర్త మేర్పరచి బ్రాహ్మణులకు నివేదించితి. సమ్మ తించిరి.

అది—అట్టి మాహాత్మ్యమును గన్నులఁ జూడ నోచి యుండవలయుఁ గదా ?

4 వ బాలు—వెఱ్ఱితల్లీ! ఆసంస్కారము నిమిత్తమాత్రము. మీచేతుల మీఁదుగా జరుగవలసినదనుశంక తక్క యీ మహామహునికిపు డు విద్యాలోపముగాని, విజ్ఞానలోపముగాని నివ్వరిముల్లంతైన నున్నదనుటకు బ్రహ్మతరమా !

1 వ బాలు—బ్రహ్మయేకా దాతని తాతతరముగూడ కాదు.

వామ—మిత్రులారా ! మీరు నాయందలివాత్సల్యమున నట్లందురుగాని నిజమునకిది యతిశయోక్తి కాదా ?

3 వ బాలు—ఇది యతిశయోక్తికాదని ఘంటాపథముగఁజెప్పఁగలము సరికదా నీసుగుణమునుఁ గూర్చి మాకింతకన్న యోగ్యమగు శబ్దము దొరుకలేదనిగూడఁ జెప్పఁగలము.

వామ—మీప్రేమ మట్టి నిర్మలమైనది.

2 వ బాలు—అదియు నీవు నిల్పినదే.

కశ్య—పరుసవేది సోకిన యినుమువలె సంగవిశేషమున నీబాలురందఱు పావనులైనారు. (యోచించి) అవును. భగవత్కృపఁగలవారి కేలోపముండును? (వామనునితో) నాచిన్నితండ్రీ! యీబాలు రాడినమాటలు నిజమనక వీలులేదు.

ఆ. వె. అత్త, అమ్మ, నుడువు ౯ లభ్యాస పడువేళ
లందె ప్రతిపదార్థ ౯ రార్థములను
వేరువేర నన్ని ౯ విని సుంత మరువని
నీవు మరల విద్య ౯ నేర్వనేల.

బాలురు—అమోఘవచస్కులగు మీయాశీర్వాదమిట్లు సంపూర్ణముగ నుండ మామిత్రునకు రానివిద్య లేమియుండును మహాత్మా!

వామ—చెలికాండ్రారా! పవిత్రులగు మీమైత్రిచే నేఁగృతార్థుఁడ నైతిని.

అది—(ఆశ్చర్యమునఁ దనలో) నేనెందరినో గనుపారఁగంటిఁ గాని యీ నా చిన్నిపొట్టెయ్యవంటి గుణవంతుని అమ్మయ్యో! (ఎదపైఁ జేయినుంచుకొని) తల్లిదృష్టి దయ్యపుదృష్టియందురు. (ప్రకా॥) నాన్నా! పొట్టెయ్యా! నీచెలికాండ్రతో మనము లోనికిఁ బోవుదమా?

వామ—అట్లే.

1 వ బాలు—(తక్కినబాలురతో) అదితిదేవిగారి సంబోధనముతో మీసందేహము సాంగముగ తీరినదికదా?

బాలురు—తీరినది. మాకేగాక లోకములన్నింటికినిఁగూడఁ దీరినది.

కశ్య—సత్యము. సత్యము. (అందఱు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము.

### నర్మదానదీప్రాంతము.

[పేరిశాస్త్రి, తిమ్మంభొట్లు - ప్రవేశము.]

తిమ్మం—పేరిశాస్త్రిగారూ! మనకష్టములిఁక గట్టెక్కినరీతినే కనిపించుచున్నవి.

పేరి—అనుకుందాము. ఇంతకు కావలసినదేదో యదే యౌతుంది.

తిమ్మం—సందేహింప నవసరంలేదు లేండి. ఇఁక నీయొక్కయజ్ఞముతో సార్వభౌముని శతాశ్వమేధదీక్ష తుదిముట్టును. కావున మనకంతగా శ్రమయుండదు.

పేరి—పులిమీఁద పుట్రయన్నట్లు మీకశ్యప ప్రజాపతిగారి కార్యములు కూడ నిందులోనే సరుదుకొన్నవికదా?

తిమ్మం—ఇవి . యేపాటి గొప్పకార్యములని విసుగుచున్నావు. ఇదో చూడు పేరిశాస్త్రి! మనదేమిటి బ్రహ్మయగాళ్ళం, విధిఁదప్పకుండ సంస్కారములు జరిగించుకొనడమేగాని ప్రభుకార్యములంత సందష్టముండునా? తల్లికడుపుకాల, ఎటుపోయిననూ యసాధ్యమే. కత్తిసామునుఁ దప్పకున్నట్లే. మనలో మనమంటూవా? గురికి మూరెఁ డిటైనఁ జిక్కులేదు. బారెఁ డటైన బాధలేదు. ఎట్లో సర్దుకుంటాం. కాని ఆపాపం పాడుగానూ, అంతకష్టంవుంటుందా? చూచిన సేవకవెధవకూడను అధికారమే సాగించుకోవడ మాయెను. పాపం మహాతపస్వి వందనీయుఁడుఁగదా మనమభిమానింపకున్న నితరుల కేమభిమానముంటుంది. పోనీ ఆపొట్టి బుడుతనికి రెండు జందెపుఁబోగులు పడినవి ప్రజాపతిగారి చిక్కు తీరింది.

పేరి—ఆయనగారి చిక్కేకాదులే. అందటిచిక్కు తీరినట్లే గాని తిమ్మంభొట్లూ! మన మెంత బిచ్చం బహ్మయగాళ్లమైనను కార్యములు చేస్తే మనమే చేయవలె, వేస్తె సంతృప్తిగా మనమే తిండివేయ

వలెఁగాక యితరుల చేతగాదని మాత్రం ఘట్టిగా చెప్పవచ్చును సుమా.

తిమ్మం—లేకున్న మ రేమన్నారండీ మనవాఁడొకఁడు ముష్టియె త్తిచేసిన కార్యంలో తృప్తిపడినట్లు లక్షలద్రవ్య మితరులు ఖర్చుపెట్టిన నూ బ్రాహ్మణహృదయము లంతగా దృప్తిపడవనుటమాత్రము వా స్తవమే. కాని శాస్త్రిగారూ! మనమ ట్లసంతృప్తిపడిన నెట్లు? లోకులు పాపము తరింపవలదా ?

పేరి—అవును. పాపమదియు సత్యమే. కాని తిమ్మంభొట్లూ ! మనము ప్రపంచజ్ఞాన మెఱిఁగినదిమొద లింతవరకును యిట్టి యద్భుత మును జూడలేదుసుమా.

తిమ్మం—ఏదదీ ?

పేరి—ఓహో ! అప్పుడే మరచినావే వామనుని తెలివితేటలఁగూర్చి అంటాను.

తిమ్మం—ఆహా ! అడుగునట్లున్నదా? అతీత మతీతముస యందఅనఁగ వినలేదా ?

పేరి—అందుకొరకే నాకింతాశ్చర్యము. వీఁడితల్లికడుపునఁబుట్లా! మంత్రోప దేశసమయమందునేమి—హోమ నియమాదిసమయములం దేమి యొజ్జను సంశయప్రశ్నారూపమున వేధించి మథించి రసముఁ బిండినాడుగదా ! అంతటికుఱ్ఱవాని కెంతటి ధీబలముల వడియున్నదో చూచితివా ?

తిమ్మం—నేను చూచునదేమి బ్రహ్మాదిదేవతలంద అతీత మతీతమని యందుకొరకే నుడివినారు.

పేరి—చూడు. తిమ్మంభొట్లూ ! వీఁడు సామాన్యముగ నందరితో పాటువాఁడుగాక గొప్ప అవతారపురుషుఁడేమో ననుకుంటాను సుమా ?

తిమ్మం—కావచ్చును. ఆకుఱ్ఱవాని విమర్శించునంతటి తెలివితేటలు మనకు లేవు. కావున నేమనియు నిశ్చయింపలేము.

పేరి—సరి, నీబుద్ధి బుగ్గియైనట్లేయున్నది. నేనే యనుకుంటె నాకన్న నేడాకు లెక్కువ చదివినట్లున్నావే! ఆకుఱ్ఱఁడవతారపురుషుఁడే కానిచో నేనాఁడు గని విని యెఱుఁగని వింతగ సూర్యుఁడు సావిత్రి నుపదేశించునా? బృహస్పతి యజ్ఞోపవీతమును, ధరణి కృష్ణాజినంబును, దండంబు సోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్రంబును, బ్రహ్మ కమండలంబును, సరస్వతి యక్షమాలికయును, సప్తఋషులు కుశపవిత్రంబుల నొసంగి గౌరవించుట లుండునా? కావున సామాన్యుఁడన వీలులేదు.

తిమ్మ—అదితికశ్యపులు తల్లిదండ్రులుగాన మౌంజీకౌపీనంబు లిచ్చిరి. అది వింతకాదు. గాని భిక్షాన్దేహి యనుటలోనే భవానీజగన్మాత సాక్షాత్కరించి యక్షయమక్షయమని సంపూర్ణమగు భిక్షనిడుటయో సామాన్యమేనా?

పేరి—అదియే, యిట్టియద్భుతములుగనుకనే వామనుఁడవతారమూర్తి యనుచున్నాను.

[వామనుఁడు-ప్రవేశము]

వామ—ఆర్యులారా! నమస్కారములు. (నమస్కరించును)

పేరి & తిమ్మం—నమోన్నమః, నమోన్నమః. (నమస్కరించి వామనునితో) నాయనా! అనుకొనునంతలోనే యిష్టదైవమువలెఁ బ్రసన్నమైతివే?

వామ—పెద్దల సంకల్పములు సిద్ధింపకూరకపోవునా?

తిమ్మం—మిగులబుద్ధిశాలివి బాబూ!

వామ—ఆర్యులారా! తామేటకేగుచున్నారు?

తిమ్మం——బాబూ! బ్రాహ్మణుల మెటకేగిన మరేమున్నది? ప్రాభవములా! వ్యవహారములా! నుదుట మూడుపంక్తులుగఁ దీర్చి యావిధివిధించిన భిక్షాటనమే కా?

పేరి——లేక నీవు ప్రభుత్వమేచేసెదవులే! పంచాంగమును బరిత్యజించి, పరభయంకరమగు కాక్షేయముంబట్టఁగలవా? ప్రజలఁ బాలింపఁగలవా?

తిమ్మం——పాలనమే కష్టమనుకున్నావేమి? పాలకులుగూడను మనవంటివారే. మానవమాత్రులే. అభ్యాసమున నన్నియు సాధ్యపడును. కాక్షేయమే పట్టలేననుకున్నావా?

పేరి——కాక్షేయముమాట యేమోకాని, గరిటెమాత్రము చక్కఁగా బట్టఁగలవు. కట్టలకోలఁదిగ బియ్యము వండఁగలవు. వడ్డింపఁగలవు. నాకిది నమ్మకమే.

తిమ్మం——మీరుమాత్రం?

పేరి——నేనుమాత్రమేమి? దర్భమోపులు తేఁగలను. పవిత్రములఁ జేయఁగలను. తిలోదకముల విడిపింపఁగలను.

తిమ్మం——నీళ్లకావళ్ల మాటను మరచినావా?

పేరి——సమయానుకూలముగ నవియు మోయఁగలను. కాదందునా?

వామ——(నవ్వుచు) అయ్యా! పామరజనులు మీవితర్కమును విన్నవారికి నిక్కమ్ముభావముగఁ బొడకట్టునట్లున్నది.

తిమ్మం——పామరులకేఁగాదు వామనా! ఎవరో యొక నీవంటి వివేకజ్ఞుఁడు దక్క తక్కినవారందరికిఁ గూడ బ్రాహ్మణులన్న లక్ష్యమున్నదా?

వామ——ఎవ్వరెట్లనుకొన్న నేమిలెండు! మీ మీవృత్తులఁగూర్చి మీలోమీరట్లు లలాఘవముగ మాటలాడుకొన్నప్పుడిఁక నితరులనుట కేమిసంశయముండును?

పేరి—మనవృత్తు లెట్టివారికిని యలాఘవముగనే కన్పించును. నిజము నకేమి?

వామ—శాస్త్రులవారూ! సంస్కారులగు తామే యిటుల సెలవిచ్చిన పుడు పరుల నడుగనేల? పౌరోహిత్య, భైక్షాదివృత్తులు బ్రాహ్మణులగు మీకు నీచములుగనే కనుపించుచున్నవిగదా?

పేరి—భైక్షవృత్తిమాత్రము నీచమైన దనక వీలులేదని గట్టిగా నే చెప్పెదను. తిమ్మంభొట్లూ! చెప్పవేమి? ఇందుకు నీవేమందువు?

తిమ్మం—చేయిఁజాపి యడిగిన, యాచనకన్న నీచమేమున్నది? నిశ్చయమే.

వామ—మీయభిప్రాయము కేవలప్రాకృతదృష్టి. కొంచెము దూరము బరికించినచో నింతటిసౌఖ్యము, నిర్విచారము, అనాయాసములు మరేవృత్తిలోనైన నుండునా?

పేరి—నిజమే కావచ్చునుగాని, అంతటిదూరపుచూ పెవరికుండును?

వామ—ఎంతోదూరముగఁ జూడనవసరములేదే? కొంచెమువిచారించి నంతనే బట్టబయలుగ నందఱికిఁ దోఁచునే?

తిమ్మం—అదేదో విప్పిచెప్పినఁ దప్పు?

వామ—నిరభ్యంతరముగ తోఁచినంతవరకు లోపమేమున్నది?

సీ. ధర్మహానికి మదిఁ జొ దలకుచు నసిధార
నడుచుకీతి బ్రతుకు జొ పుడమిపతులు
కోట్లుగూర్చియు తృప్తి జొ కుదుర కశనన్విద
లుడిగి ధనాశలోఁ జొ బడు వణిజులు
పుట్లధాన్యమునెల్ల జొ కొట్లనింపియు గట్టు
మెట్టుమన్నెడి కాపు జొ మేటిగములు
పొట్టకుఁ బట్టకుఁ జొ బొల్లెలఁ దనువుల
నమ్మి కష్టించెడి జొ యఖిలజనులు

తే. గీ. సుఖులొ, లేకషట్కర్మ విశేషుద్ధచిత్త
నిర్మలతఁ బారమార్థిక నియతవృత్తి
చే యథాలాభసంతుష్టి జీవితములఁ
గడుప యాచించుబ్రాహ్మణాగ్రణులు సుఖులొ.

చూచుకొనుఁడు. దీనికేపాటి దూరదృష్టి కావలయును?

తిమ్మం—ఆహాహా ! నాతండ్రీ వామనమూర్తీ! నీకింతటి లోకజ్ఞానము
ను గలిగించిన సూక్ష్మబుద్ధి నెంతవర్ణించినను దనివిదీరదుగదా.

పేరి—(తనలో) జన్మములన్న నదితికశ్యపులవే జన్మములుగాక కొడు
కులఁగన్న ప్రతివారిజన్మములును సార్థకమగునని నేను మాత్ర
మిఁక నెన్నఁటికినలేను. (ప్రకాశముగ) నాయనా! వామనా ! నీ
వాగమృతపానముచే శ్రవణపుటములేకాక శంకాకులితచిత్తము
గూడ ధన్యతఁ గన్నది.

వామ—పెద్దలు సహజవాత్సల్యమున నట్లుసెలవిచ్చెదరుగాక! తామెఱు
గని ధర్మము లేమున్నవి ! స్వభావములే విన్నవించితి నిం దదిశ
యోక్తు లేమున్నవి ?

తిమ్మం—చీచీ, అతిశయోక్తులమాట విన్నంతనే నాకు పరమాసహ్యము.
అదేమిపాపమోగాని కొందరికొందఱికవుల చిత్రకారులతూలికలు
గూడ ప్రాగుబోతువానిసుడుగులంబోలి యతిశయోక్తులనే
చిత్రింపసాహసించును.

పేరి—అతిశయోక్తుల కొకవిధముగ కొందరానందించినను, స్వభావ
ముల నెపుడు గమనింతురో యపుడాయతిశయోక్తుల వారలే
పరిహసించి విడుతురు. ఎట్లన్న, అందఱిముఖములు చంద్రబింబ
ములే, అందఱికన్నులు దామరరేకులే, అందఱిముక్కులు తిల
పుష్పములే, యని కవులు వర్ణింతురు. చిత్రకారులు పక్కారం
గులు విగ్రహముల నింపుదురు. అట్టికవిత్వములఁ జదివి, విగ్ర

హములఁ గాంచినంతనే కొందరానందింతురు. పిదప దీర్ఘాలోచన మొనర్చి బుద్ధిమంతులవలన వినియు లోలోనఁదర్కించుకొని నిరసింతురు. కావున నతిశయోక్తు లెవ్వరికినిఁ బనికిరావు.

వామ—ఆర్యులారా! మీయభిప్రాయముకూడ నిశ్చయమే, కాని—

తే. గీ. కవికిఁ జిత్రకారునకు స్వకీకల్పనముల
స్వేచ్ఛ కధికారమున్న దీక్షించువారి
కరయహృద్యానవద్యమై పరిఢవిల్ల
వలయునవి లేని యతిశయోక్తులనవలయు.

పేరి—నాయనా! నీధర్మసూక్ష్మము లెవ్వ రెఱుంగఁగలవారు?

తిమ్మం—ఏమోకాని యాచన నీచ మనువాని మొగముమీఁదఁ గొట్టినట్లుమాత్ర ముపన్యసించినాఁడు. నాకు మహానందముగా నున్నది.

వామ—అయ్యలారా! యీకాలమున యాచకులకు లే దనకిచ్చు మహాదాత లెవరైన నున్నారా? లేనేలేరా?

తిమ్మం—ఇదేమి వామనా! యిట్లడిగెదవు. లేకపోవుటేమి.!

పేరి—అడిగినఁ దప్పేమి. అడుగఁగూడదా? వామనుఁడుమాత్రము యాచకుఁడుగాఁడా?

వామ—లేకపోవుటేమి యనుటలో సంపూర్ణముగ దాతలున్నారని కాఁబోలు మీయభిప్రాయము?

తిమ్మం—ఏలోకమునఁగాని, యెన్నఁడేనిఁగాని దాతలు సంపూర్ణముగ నున్నట్లున్నదా? ఒకానొకరైన దాతలు లేనట్లు చెప్పవీలున్నదా?

పేరి—తిమ్మంభొట్లూ! తెలిసినంతవరకు సాపుగా చక్కగా తేల్చి చెప్పరాదూ?

తిమ్మం—చెప్పెడిదేమి, నీవుమాత్ర మెఱుఁగవా? అందఱు దాతలుందు రా? కొందఱైన లేకుందురా?

పేరి—ఉన్నచో వారికిఁ బేరుండవా? ఉత్తమ, మధ్యమ, సామాన్య లను తరగతులుండవా?

తిమ్మం—ఏమోనబ్బా! అంతతర్కము నేఁజదువలేదు. నాకు శాస్త్రి నామము లేదు.

పేరి—మొదటినుండి నీకున్న పెంకిగుణమిదేకాదూ!

వామ—(వారింపుచు) మహాత్ములారా! మీకును వాదప్రతివాదము లేనా? బ్రాహ్మణులగు మీకీర్ష్యలచేఁ బెనఁగులాడు టుచితము కాదనుకొందును.

పేరి—నిజము. నిశ్చయము. తప్పుదారినడిచినప్పుడు కాదనవలసినదే, ఛీ, యనవలసినదే.

తిమ్మం—ఎవఁడిప్పుడు తప్పుదారినడిచినది. (గద్దించును.)

వామ—(తిమ్మంభొట్లనుఁ బట్టుకొని) మహాత్మా! నామనవిఁ జిత్తగింపుడు. నేను దాతలనడిగిన నాయభిప్రాయము వేరు. యది గ్రహింపక వాదులాడుచున్నారు.

తిమ్మం—సరే, ఎందుకో చెప్పుము?

వామ—పరోపకారపరాయణులగు దాతలేయున్న, మీరిర్వురు యాచనను గూర్చి యేలతర్కించుకొందురాయనియు, దాతలులేని యీలోకమెట్లు నిలిచియున్నదా యనియు, నాలో నొకశంక కలిగి తమరినడిగితిఁగాని వేరుగాదు.

తిమ్మం—ఉన్నారు. లేకపోవుటేమంటివే?

వామ—అటులైన నాయున్నవారిలో ముఖ్యులపేరులఁగొన్నిటిఁ జెప్పఁ గలరా?

తిమ్మం—అందరిపేరులతో నేమియవసరము. ఇప్పటికాలమున బ్రహ్లాదపౌత్రుఁడు బలిచక్రవర్తిని మించిన మహాదాత వేరొకఁడు లేడని పిపీలికాది బ్రహ్మపర్యంత మెఱిఁగినదియే. ఆమహావదాన్యుఁడిచ్చిన దానములఁ దెచ్చుకొనలేక, తెచ్చినది దాచుకొనుటకు వసతులులేక, రోసి పారవేసి, విసికి వేసరి, మరలఁ బిలిచి యిచ్చునేమో నేలాగురాబాబూ! యీవృత్తి మాకెందుకు వచ్చెనా యనుకొనుచుమాటలాడుకొనుచున్నాముగాని యిచ్చు దాతలు లేక యాచనము నీచమనుకొనుట లేదు.

వామ—అటులనా? బలిచక్రవర్తి అంతటి మహాదాతయా?

తిమ్మం—దాతయేమిటి! శతాశ్వమేధము లొనర్చినవాఁడు.

వామ—ఇదివరకే చేసెనాఁడా?

తిమ్మం—ఇఁక కొలదిదినములలో నూరవయజ్ఞము నెఱవేరితీరును.

వామ—ఓయీ! అటులైన నట్టియుత్తమపురుషుని దర్శనము నాకుఁ జేయింపరా?

తిమ్మం—అదిమాత్రము నన్నుగోరవలనుబాబూ! నావలనఁగాదు.

వామ—ఎందుచేత?

తిమ్మం—మరల నేమైన దానమిచ్చిన నెవరుదెత్తురు? ఎక్కడదాతును?

వామ—పోనిండాతని దర్శనమెట్లగునో సెలవిచ్చెదరా?

పేరి—నాయనా వామనా? ఆతనిదర్శనమున కేవిధమైన యాటంకములు యాచకులకు లేవు. నిరాఘాటముగ వెళ్ళవచ్చును.

తిమ్మం—వామనా! నీ వేమైనఁ గోరుకొందువా?

వామ—నన్నుఁగూర్చి నాకేకోరికలు లేవు.

తిమ్మం—సరియే. నీకులేకున్నను ప్రార్థించిబ్రతిమాలి యిచ్చును.

వామ—అయినఁ దీసికొందును.

పేరి—నీకవసరమే లేదంటివే?

వామ—లోకహితమొనర్చెదను.

పేరి—ఆహా! నీయుత్తమగుణము మెచ్చఁదగినది.

తిమ్మం—ఈలోకమున నిపుడు దరిద్రులెవరున్నారు? నీ విచ్చిన నెవరికిఁ గావలయును?

పేరి—అదేమిమాట! దరిద్రులు లేనేలేరా?

తిమ్మం—ఏదీ! ఎవరున్నారో చెప్పూ? ఉంటే దురాశాపరుఁడవు నీవే నేమో?

పేరి—నాకు దరిద్ర మేమికర్మము! నీవే సంపన్నుఁడవైనప్పుడు సంస్కారిని, శాస్త్రిననిపించుకొన్న నాగ్రహచార మేమికాలిపోయినది?

తిమ్మం—అవునయ్యా శాస్త్రివే! కాదన్నవారెవరు? ఇపుడు దరిద్రులెవరో చెప్పరాదూ?

పేరి—దేవతలు.

తిమ్మం—అయిన?

పేరి—ఏమున్నది? దరిద్రులే లేరంటివి కావున చెప్పితిని.

తిమ్మం—వారిప్పు డిచ్చుట లేరే? వారికిఁ జక్రవర్తి యిచ్చునా? వారు వచ్చుటకైన దుదకంగీకరించునా?

పేరి—వామనుఁడు వారిసోదరుఁడు గాడా?

తిమ్మం—అయిన వారికెట్లు ముట్టఁగలదు?

పేరి—ఎటులనా? నీకు నాకు తెలియుటెట్లు? పెట్టేవాఁడు తనవాఁడైనపుడు కడకుఁ గూర్చున్నమాత్రమేమి? ఎవరిరక్తసంబంధము వారిది. ఎవరిప్రేమలు వారివి.

వామ—పెద్దలపల్కులు రిత్తయగునా? నాకేదిలభించినను నావారి కిత్తును. వారు దరిద్రవిముక్తులగుదురు.

పేరి & తిమ్మం—తథాస్తు. తథాస్తు. అటులైన పో నాయనా! పోయి రమ్ము. మేము బోవుదము.

(నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము.

భజనమందిర ప్రదేశము.

[ఘోరశర్మ ప్రవేశము.]

ఘోర—(స్త్రీ స్వభావమును నటించుచు) మాసార్వభౌముఁడు చల్లగ బ్రతుకనీ, నాకుమాత్రం చక్కని యుద్యోగ మిప్పించాడు. అనుభవ మెక్కువ. ఆయాసం తక్కువ స్వర్గమం దీభజనమందిరమును స్థాపించి నన్నర్చకునిఁగ నియమించినారు గాని నేఁ జేయుచున్న యర్చన యేమున్నది. అది నాయిష్టములోనున్నది. బ్రాహ్మణుఁడఁ గాన నన్నంతగాఁ బరీక్షింపరు. (స్మృతి నభినయించి) మాయావియను పేరుఁగల సంఘసంస్కారి కుంకయొకఁడు నా వెంబడిబడి నాచర్యలను మార్చుకొనుమనియు, పురుషులఁ బ్రేమించు స్వభావమును విడిచిపెట్టుమనియు నయభయగతుల బోధించాడు. గాని నాపాడె నాచిత్తము నాచేతిలోనున్నదా- చిత్తస్వభావాన్ని మార్చుకొనేవాఁడు ప్రపంచంలో యెవడున్నాడు. దీని తెలివి తెల్లవార. నన్నిట్లు మార్చుకొమ్మని బోధించు స్వభావముచు తాను మార్చుకో గూడదూ? పీడ వదలునే. నాది యపవిత్రవర్తనమఁట, సంఘమునకాచారమఁట, భగవదంగీకారము కాదఁట, వాడిమొహం. భగవంతుఁ డీమందిరంలోనే వుంటాడని వెర్రినమ్మకం. నన్ను న్యాయస్థానమునఁ బెట్టి కఠినశిక్ష నిప్పింతుననియె. చూతాం- ఏడ్చాడు.

[విషదంతి ప్రవేశము.]

విష—(తనలో) ఈ నపుంసకపుదే బెముండకొడుకునకు మాయావికి నన్ను దూతికను జేసినాఁడు. వీఁడామాయావికల్పన మెఱుఁగఁడు. గౌరవముగల కుటుంబములోనే జన్మించినాఁడు. కాని వ్యర్థుఁడు, కులనాశకుఁడు, నీచులు గూడఁగోనే యోగ్యతఁగలవాఁడు. (సమీపించును) ఏమండో శర్మగారు! నమస్కారం.

ఘోర—(పెదవిని విరచి) సరేలే. బలేమంచిదానవే. నమ్మకుంటే బాగానే చేశావులే.

విష—బిగ్గరగామాట్లాడకండి రక్షకభటులు దిరుగుచుందురు. అసాధ్యం.

ఘోర—సరే. నాకునుదెలియును. మంచిది చెప్పవేమి? యేమైనది. నా రొట్టె నేతిలోఁ బడెనా ?

విష—ఏమోనండీ. మీరు మితిమీరిన పెద్దపెద్దచూపులలో నుంటె నాకెట్లు సాధ్యమండీ ?

ఘోర—(బ్రతిమాలుచు) నీదయ. నీవు తలంచితే యదెంతపని. నీవు మహాసమర్థురాలవని, పురుషవశీకరమగు సాధనసామగ్రి కలదానవని నమ్మితిఁగదా ? నీచేతిలో నాబ్రతుకు.

విష—అమ్మయొయ్యో! సార్వభౌముని సేనానాయకుఁడును, యీస్వర్గమునకు రాజప్రతినిధియును గదా. ఈపాడుమాట విన్న నన్ను బ్రతుకనిచ్చునా ?

ఘోర—గొప్పవారైననేమి, కొద్దివారైననేమి. గుణమునకేమి అదెవరి స్వాధీనము ? ప్రయత్నించియైన నిరాశపడవలదా ?

విష—ఏమోనమ్మా! నాయొడలు కంపమెత్తుచున్నది. నాచేత నేమగునబ్బా—

ఘోర—నీచేతఁగానిచో నీచాతుర్యమేమి! నాయాజమాన్యతయేమి.

విష—మరి చివరకేమంటారు ?

ఘోర—నాకోరిక చెల్లింపక తప్పదని—

విష—ఎట్లు ?

ఘోర—ఏపాట్లనైనఁబడి.

విష—నా కేమి ప్రతిఫలము ?

ఘోర—నీవేదికోరితివో యది లేదనను.

విష—నిజముగనా ?

ఘోర—నిశ్చయముగ.

విష—ముమ్మాటికి ?

ఘోర—వేయిమారులకు.

విష—నమ్మకమేమి ?

ఘోర—భూదేవిసాక్షిగా (భూమినంటును.)

విష—అటులైన మీభజనమందిరములోని విష్ణువిగ్రహము నాకీయవలయును.

ఘోర—నీవేమిచేసికొందువు ?

విష—కారణముతో మీకేమవసరము. నాయిష్టము.

ఘోర—అసాధ్యమగు కోరికయేనా, ధర్మకర్త కేమనిచెప్పవలయును?

విష—మీకోరికమాత్ర మసాధ్యముకాదా ? దాని నెవ్వరెఱిఁగినను హానికాదా ?

ఘోర—(యోచించి) మంచిది. విగ్రహమిచ్చెదను. తుదకు నే నేమైన నుసరే. కాని నాకోరిక మారదు.

విష—అటులైన విగ్రహమీయండి.

ఘోర—ఇప్పుడేనా? పనికానిదేనా ?

విష—పనీ; దానికేమి అయినదనుకొనుఁడు.

ఘోర—ఎప్పుడు ?

విష—ఇప్పుడే.

ఘోర—సరే. మంచిది (పోయి విగ్రహమును దెచ్చియిచ్చును.)

విష—శర్మగారూ! మీకోరిక నముచిగారి నొకసారి ముద్దిడికొనుటే కాదూ?

ఘోర—ఆఁ. అదే అంతేచాలు. నాకదియే పదివేలు. (తనలో) మన వాఁడైనపిదప స్వర్గరాజ్యలక్ష్మి నాచేతిలో—

విష—మీరు స్త్రీ వేషమందు ప్రేమగలవారు కాబట్టి, చీరె రవిక మొదలగు దుస్తుల ధరింపుఁడు. రక్షకభటాధికారివేషమున ప్రతినిధిగారు రాఁగలరు. వచ్చినవెంటనే కౌఁగిలించుకొని ముద్దిడికొనుఁడు.

ఘోర—సరే. అటులైన నేనిఁకఁ జీర కట్టుకొందును. నీవు తొందరగా వారిం దీసికొనిరా.

విష—నేను మరల నేటికిరావలయు? వారే తగురీతివత్తురు.

ఘోర—మంచిది. త్వరగా బొమ్ము. నేనును బోయెదను.

(నిష్క్రమింతురు.)

[రక్షకభటాధికారివేషమున ముండకుఁడు ప్రవేశము.]

ముండ—ఎవరోయొకయాడుది దిడ్డితలుపుఁ దీసికొని వెళ్ళగనే యిదేసమయమని మాయావి నన్నీవలఁ ద్రోసినాఁడు. సరే, నేనిట్లు రక్షకభటాధికారివేషమున నిందుబ్రవేశించితిని. బ్రాహ్మణముత్తైదువులలోఁ గలసి యిటకుఁ జేరినచిత్రరేఖ నారాకకొరకెచ్చట వేచియున్నదో వెదకిచూచెదను. (మందిరముచుట్టు వెదకి) ఎక్కడనులేదే. మాంద్యముగ నుండకుము. జాగ్రత్తయని మాయావి చెప్పినాఁడు. కాని, అబ్బా! గుండెలు తటతటఁ గొట్టుకొనుచున్నవి. కాళ్ళు గడగడమని వడకుచున్నవి. ఏమిచేయుదును. నాబుద్ధి పాడుగాను, ఎందరెందరుతిట్టి చీకొట్టి చెప్పినఁ గొట్టినను పట్టు దలమానకపోయెఁ గదా. ఇప్పు డేమనుకున్న నేమున్నది. రోటి

లోఁ దలదూర్చితి. రోకటిపోటులని జంకినలాభ మేమున్నది. సరే, నాకిపుడేమికర్తవ్యము. మెల్లగా పిలిచిచూతునా ? లేక మందిర ములోన వెదకిచూతునా? మందిరముతలుపులు కొంచెముగ వేసి యున్నవి. లోననెవరేని యుండవచ్చును. గావున తొలుత పిలి చియేచుతును. ప్రియురాలా! ప్రియురాలా! (అని బెదరి నలు దిక్కులఁ బరికింపుచున్నాఁడు.)

ఘోర—(ఈవలికివచ్చి తనలో) స్త్రీవేషము వేసికొన్నాను. కాని ప్రియు రాలా యని ఎవరో పిలిచినట్లు వినవచ్చినది నన్నేనా? అట్లు పిలి పించుకొనునట్టిభాగ్యము నాకున్నదా ? (ముండకునిఁజూచి) ఓహో! యీతఁడెవరు. రక్షకభటాధికారి వేషమే నే! విచారిం చెదను. (సమీపించి) ఎవరుమీరు ?

ముండ—(పరికించి తనలో) ఇదియే చిత్రరేఖ కావచ్చును. కాని మును పటివలె వాదప్రతివాదములు వలదు (సంతోషముతో ప్రకాశ ముగా) నేనే నేనే.

ఘోర—(తనలో) నేనే యనుచున్నాఁడు. సేనాపతిగారేనా ? ఇట్లని చూతును (ప్రకాశముగ) మీరు రక్షకభటాధికార వేషులేనా ?

ముండ—అవును.

ఘోర—అట్లైన మందిరములోనికి రండు.

ముండ—(తనలో) అమ్మయ్యా! నేఁటికి గదా ధన్యుఁడనైతిని. కర్ణానం దముగ తేనెలొలుకు పలుకు లెన్నినాళ్ళకు విననోచుకొంటిని ! అమృతముపుట్టిన యిన్నాళ్లకా (యోచించును.)

ఘోర—త్వరగా దయచేయుఁడి.

ముండ—(సంతోషముతో) ఆహా ! యిదేవచ్చితి. (తనలో) అమృతము తోఁ బుట్టినది కావున మాట లమృతమొలుకుచున్నవి.

ఘోర—అయ్యో! రారేమి యెవరైనవత్తురేమో ?

ముండ—అదియునిజమే (అని యటునిటుచూచి) అయ్యో ! సింహద్వా రము తలుపులు దీసియున్న వే ?

ఘోర—వేసి త్వరగా రాండి.

ముండ—(చంక లెగుర వేయుచునురుకును.)

[రక్షకభటాధికారియగు దేవాంతకుఁడు ప్రవేశము.]

దేవాం—(ముండకుఁ కెదురువడి) ఎవరునీవు ?

ముండ—(తనలో) వీఁడెవ్వఁడు? నావలెనే వేషధారికాఁడుగదా? ఎవఁ డైనను నేను ప్రస్తుతము జంకరాదు. (ప్రకాశముగా) నీవెవరు ?

దేవాం—నీవెవరంటె నీవెవరని తిరుగుబాటుజేసెదవా ? (చేయిఁ బట్టు కొని) చెప్పూ నీవెవరు ?

ముండ—(తిరిగి దేవాంతకునిచేయిఁ బట్టుకొని) నన్ను బెదరించెదవా ? నే నెవరనుకున్నావు ? నేను రక్షకభటాధికారిని.

దేవాం—(తనలో) నే నెఱుఁగని రక్షకభటాధికారము వీని కెట్లువచ్చినది. అపరాధి వీఁడే కావచ్చును. (ప్రకాశము) నీపేరేమి ?

ముండ—చెప్పుటకు వీలులేదు. తొలుత నీపేరుచెప్పుము.

దేవాం—నా పేరు దేవాంతకుఁడు. నేను రక్షకభటాధికారిని. కావున, అబద్ధ మాడకుము. నీనిజ మెఱిఁగింపుము. రహస్యమైన నాచెవి లోఁ జెప్పుము.

ముండ—(భయము నొంది తనలో) అమ్మబాబూ! నేఁడు నాకేదో మూడిన దిరా తండ్రీ ! నాగ్రహచారము కాలిపోను, మరల నాప్రాణ మ్మీదికేదో వచ్చినదిరా బాబూ—

దేవాం—ఏమి యోచింపుచున్నావు? సమయము మించుచున్నది. త్వర గాఁ జెప్పుము.

ముండ—ఊఁ! నేను చెప్పుటకు వీలులేదు.

దేవాం—కారణమేమి ?

ముండ—(గడగడలాడుచు) ఊఁ! ఊఁ!

దేవాం— (అరువకుండ నోరునొక్కిపట్టి) పిదపఁ జూచుకొందము (వెన్నునఁగుద్దును.)

ముండ—అమ్మో! చెపుతా. నిజముచెపుతా బాబూ. (అనియేడ్చును.)

ఘోర—(చప్పట్లుకొట్టి) రాండి త్వరగారాండి (బిగ్గరగాబిలుచును.)

దేవాం—(కనిపెట్టి ముండకుని భటులకొప్పించి ఘోరశర్మను సమీపించును.)

ఘోర—ఇంతసేపా ?

దేవాం—పిలుపులోనే వచ్చుచున్నానుగద ?

ఘోర—ఎంతకాలమునకు నాకోర్కెఫలించినది. (అనిదేవాంతకునిఁ గౌఁగిలించి ముద్దాడును.)

దేవాం—(ఆసహ్యమునవిదల్చుకొని) ఎవ తెవీవు ?

ఘోర—అదేమి నామనోహరా! నన్నిట్లడిగెదవు ?

దేవాం—(ఆశ్చర్యముతో) నే నీకు మనోహరుఁడనా ?

ఘోర—కావా ?

దేవాం—ఏమీ (అనియోచించి తనలో) ఓహో! తెలిసినది. నపుంసక ఘోరశర్మ వీఁడే కానోపును. ఛీ ఛీ వీనిబుద్ధి పాడుగాను. ఇది భగవన్మందిరమే, పూజారియే. ఎంతటియపవిత్రము. (ప్రకాశముగ) నే నెవరననుకొన్నావు. నన్నుగుర్తించితివా ?

ఘోర—ఇప్పటికిప్పుడే మరపా ? గుర్తింపకేమి ? పరిహాసమా ? నీవు స్తులు రక్షకభటాధికారి ధరించునవికావా ?

దేవాం—అవును.

ఘోర—ఇంకనేమి నానోములపంటా (అని కౌఁగిలింపఁ బోవును.)

దేవాం—ఛీ ఛీ. దూరముండుము. (యోచించి) నీపేరుజెప్పవేమి ?

ఘోర——మీ కిష్టమున్నప్పుడు నాకుఁ జెప్పుట కేమిసందేహము! నా పేరు ఘోరశర్మకాదా ?

దేవాం——ఓరి నపుంసకవెధవా! నీ విప్పు డెవరికొరకు వేచియుంటివి ?

ఘోర——తెలియనియట్లు నన్ను మందలించెదవేమి ప్రాణప్రియా ? నీ కొరకుగాక వే రెవ రున్నారు ?

దేవాం——సరే. నే నెవరనో చెప్పుము ?

ఘోర——నీవు సార్వభౌమప్రతినిధివి. సేనాపతివి. నముచీంద్రనామక మత్ప్రాణపతివి. రక్షకభటాధికారివేషమున నిట కేతెంచితివి. నాకోర్కెఁ దీర్ప సిద్ధముగనుంటివి.

దేవాం——(కోపముతో) ఓరి దురాత్ముఁడా! ఎంతటిపవిత్రవర్తనమున భగవంతు నారాధించుచున్నావురా! సంఘము దిట్టనీచవర్తను లున్న బాగుపడు టెట్లు? మే మందర మెంత నిర్దుష్టముగ నున్న నేమిఫలము? వృక్షమునకు వేరుపురుగులవలెను, యోడకు రంధ్రములవలెను నీబోటివా రిద్దరుమువ్వురు నున్నఁ జాలదా? నాశనమునకు మార్గదర్శకముగాదా? (చింతిలును).

(తెరలో యీలధ్వని, పిదప దేవాంతకాది రక్షకభటోద్యోగులును యీలలను బ్రతిధ్వనింపఁజేతురు.)

[విష్ణువిగ్రహముగల విషదంతినిఁ దీసికొని యిరువురు రక్షకభటులు ప్రవేశింతురు.]

దేవాం——(భటులతో విషదంతినిఁ జూపుచు) ఇదెవతె- దీనిచేతనున్న విగ్రహమేమిటి ?

భటు——(ఆజ్ఞాపత్ర మిచ్చును.)

దేవాం——(చదువుకొని భటునితో) సింహద్వారమున నున్నవారినందరి నిటకుఁ దీసికొనిరమ్ము.

భటు—[పోయి ముండకుఁడు కొందఱు భటులతోఁ బ్రవేశించును.]

దేవాం—(ముండకుని కో) ముండకుఁడవు నీవేనా? దొంగరక్షక భటాధికారివేషముతో రంగని మందిరమునకు రంకుతనమున కేతెంచితివా?

ముండ—(గడగడలాడుచు) నేనే- నేనే- నే- లేదు- లేదు- (అనును.)

దేవాం—(వేదికపైఁ గూరుచుండి) ఘోరశర్మ ముండకుల నెదుటకు దీసికొనిరండు. (భటులను జూచును)

భటులు—(దేవాంతకు నెదుట నిలువఁబెట్టుదురు.)

ముండ—(ఘోరశర్మను బారఁజూచి తనలో) అయ్యో! నా తెలివి పాడుగాను. ఛీ! ఈ డొడ్డ మొగవాఁడురా బాబూ! చిత్ర యనుకొని మోసపోయినానురా తండ్రీ! ఇఁక నాకుఁ జావుతప్పదు కాఁబో లురా నాయనా! (ఏడ్చును)

ఘోర—(ముండకుని దేవాంతకునిఁ బరికించి వెల్లఁబోయి) అమ్మయ్యో! నాకొంపమునిఁగినది. దూతికనని మోసగించి (విషదంతిఁ జూచి మెటికెలు విరచుచు) నాప్రాణముల కెక్కువెట్టినది. నే నిప్పు డేమిసేతునమ్మా. (అని వడకుచుండును.)

దేవాం—(ముండక ఘోరశర్మలతో) మీ రేమి యోచించుకొను చున్నారు. న్యాయస్థానమునుండి యాజ్ఞాపత్రము వచ్చినది. చెవులార వినుఁడు—(చదువును.)

ముండక ఘోరశర్మల దుర్నడతలు సంఘసంస్కారియగు మా యా వికృతముగ మా స్థానమున కెప్పటివప్పుడే యేతెంచుచున్నవి. స్వసాంఘికులలోఁ గొందఱు నిర్మలాంతఃకరణముగను, కొందఱు నిర్బంధ మునను చాలవఱకు బాగుపడినారు. పడుచున్నారు. కాని ఘోరశర్మ ముండకు లేమాత్రమును యింతవర కెన్నియుపాయాంతరములకును మార్పుఁజెంద లేదు. ముందు చెందఁగలరను నమ్మక మేమాత్రమును

లేదు. మరియు నీయపరాధులు వారివారి వికృతకృత్యములతో నీరాత్రి యే మీాయెదుటఁబడుదురు. ఆసమయమందే మీా కీయాజ్ఞాపత్ర మందును. నేరస్థులని మీాయాత్మ నమ్మినచో పాపభయమును, ప్రభుభీతియును ద్రోసిపుచ్చి దుర్వృత్తి మానుకొనలేని యీాయపరాధులలో ముండకుఁ డనువానికిఁ గన్నులదీయించి విషదంతి కొప్పించునట్లును, ఘోరశర్మను కరయుగములు ఖండించి విడుచునట్లును సాంఘికశాసననిబంధనముల ననుసరించి తీర్మానింపఁబడినది.

ముండ—(చెంపలు వేసికొనుచు) అయ్యో! బుద్ధివచ్చినది. నాకిఁకఁ జిత్రరేఖ వలదు. క్షమించండిబాబూ!

ఘోర—నాకిది స్వభావము గాన మార్చుకోలేనైతిని. నన్ను మన్నింపుఁడు తండ్రీ! (ఏడ్చును.)

భటులు—(ఇర్వురి నీడ్చుకొనిపోవుదురు.)



ఓం

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# బలిబంధనము

## షష్ఠాంకము.



### ప్రథమరంగము.

నర్మదోత్తరమున యజ్ఞవాటికా ప్రదేశము.

[బలి, శుక్ర, కాలనాభ, శంబరులు ప్రవేశము.]

బలి—మహాత్మా! గురుమూర్తీ! దేవర దయాప్రభావమెంత వినుతించి నను దనివితీరకున్నదికదా ?

ఉ. ఛాత్రుని నైజదుర్గుణ విశంకటభారము నిర్వహించి స
త్పాత్రునిఁగా నొనర్చి నిరపాయకరంబగు సత్యదర్శనీ
నేత్రమొసంగి శాశ్వత వినిర్మలసౌఖ్యము గూర్చు దేశిక
స్తోత్రముఁజేసి కాకితరత్రోవల ధన్యత జన్మమొందునే.

శుక్రు—నాయొక్క దయాప్రభావమేమికాని నీసుగుణమే సర్వశుభముల కాకరమగుచున్నది. కాని వత్సా! ఇదివరకు గడచినదినములువేరు. ఇకఁ గడువనున్నదినములు మాత్రము బహు జాగరూకత మెలఁగఁదగియుండును. శతాశ్వమేధదీక్షకు తుదిసమయము. తెలిసినదా ?

బలి—దేవరయనుగ్రహ మి ట్లమితముగనుండ భయమేమి లేదను కొందును.

శుక్రు—తే. గీ. వ్రతత, తపో, యజ్ఞ, సత్కార్యవర్గమునకుఁ
దుదినె విఘ్నపరీక్షావిరోధులు ఘటిల్లు
కొలకొలఁ జరింపవలయుఁ, దోరటలకుఁ బక్వ
ఫలసమయమందె కావలి రె వలసినటుల.

బలి—ఏకార్యనిర్వహణమునుఁగాని నావలననే యగుచున్నదని నేనను కొనుటలేదు. ఆగతానాగతవిజ్ఞులగు తాము స్థిరాసనమిడి యెంత కాలము లక్ష్మినిందు వసింపజేసెదరో యంతకాలమువర కేవి ఘ్నములు రావు. ఎవరియాటలును సాగిరావు. సిద్ధసంకల్పు లరగు మీయాజ్ఞ యమోఘము.

శంబ—తథాస్తు.

[వామనుడు—ప్రవేశము.]

వామ—(కొలదిదూరమునుండి బలినిఁజూచి) ఓహో! నిరుపమాన మగు దివ్యతేజము మూర్తీభవించినట్లు ప్రసన్నముఖుఁడై యున్న ట్లున్నది. ఇదిమిక్కిలి సుసమయము. గాన నెమ్మదిగ సమీ పింతును.

బలి—(వామనుఁ జూచి తనలో) ఇదెక్కడిమూర్తి? స్వకాంతిపుంజ మెల్లెడల వ్యాపింప వేదసారమువలె సరసహృదయముల నాక ర్షింపుచు, గుబగుబమని యేతెంచు నీకుఱ్ఱఁడెవఁడై యుండనో పును? (పరికింపుచున్నాఁడు.)

శుక్రు—(వామనునిఁ జూచి) ఎవ్వఁడీనిర్మలతేజోవంతుఁడు? బ్రాహ్మణ బాలునిగఁ దోఁచుచున్నాఁడు. వీని కింతటితేజ మెటులఁగలిగెను? (నివ్వెరపడి చూచును.)

కాల—(శంబరునితో) మిత్రమా! శంబరమంత్రీ! యీపొట్టిపాపఁడెవఁడై యుండును? విచిత్రనటనుఁ డనిపించుచున్నదే?

శంబ—నీవుగూడఁ జూచుచున్నావా? అద్భుతాశ్చర్యావహముగా నున్నదికాని, మారాడునట్లున్నదా?

బలి—ఔరా! సామాన్యుఁడుగాడు. సమస్తవిద్యాపారంగతుఁడనిపించుచున్నదే? కాకున్న నింతటి తేజోవిలాసము సామాన్యవిప్రబాలునకుండునా?

తే. గీ. హరిహర బ్రహ్మసూర్యాగ్ను । లందొకండు
లీలమై తాల్చు రూపమ । ట్లోలిఁ దోచుఁ
గాకనియమవ్రతతపఃప్ర । కాశలబ్ధ
తేజుఁడనవీలులేదు నా । దృష్టి పోదు.

శుక్రు—ఏమి వీనిసామర్థ్యము? మితిమీరియున్నదే?

ఆ. వె. వేదపాఠకులకు । వేదముల్జెప్పు శా
స్త్రజ్ఞు లౌననంగఁ । జర్చసేయు
సత్క్రియాకలాప । జనుల విమర్శించు
నంచు దోచిదేమి । యబ్బురంబొ.

వామ—(తనలో) నన్నుఁగాంచి సభికులెల్లరు గుజగుజలుపోవుచున్నారు. కానిమ్ము. సార్వభౌముని సమీపించెదను.

సీ. సత్యదయాధర్మ । సద్వ్రతనియతవ
ర్తనుఁడగు పావన । తముఁడితండె
పగఁబూని దిక్పాధి । పతులఁబోదరిమిన
జగదధిపతిశౌర్య । శాలియితఁడె
ఇది యది యనియెంచ । కెవరేదికోరినఁ
దిరుగకొసంగెడి । ధీరుఁడితఁడె

నిజవిక్రమోద్ధతి నిర్జరాన్వయవార్థి
బడబాగ్నిసదృశ ప్రభావుఁ డితఁడె
తే. గీ. సకలకకుబంతములను స్వచ్ఛమగుకీర్తి
వల్లికలనింపఁగలసార్వభౌముఁడితఁడె
దనుజవంశపవిత్ర కీర్తనుఁడఖండ
వైభవానంద బలిచక్రవర్తి యితఁడె.

అందఱు—(శిరఃకంపన మొనర్తురు.)

వామ—(అక్షతలతో దక్షిణహస్తముఁజాచి)

తే. గీ. స్వస్తియగుఁగాక త్రిభువనశాసనునకు
శుభమగుంగాక యర్థిసంస్తుతయశునకు
మంగళమ్మగుఁగాక ధర్మవ్రతునకు
శోభనమ్మగుఁగాక రక్షోవిభునకు. (అక్షతలిచ్చును)

బలి—(లేచి వినయమున శుభాక్షతలఁగైకొని) అవయవసంపూర్ణ వేదరాశింబోలి ప్రకాశించు నో తేజోమూర్తీ ! వందనములర్పించుచున్నాను. (నమస్కరించును.)

వామ—శుభమగుఁగాక.

బలి—శాంతగుణప్రకాశసన్మూర్తీ ! ఈపీఠమునలంకరింపుఁడు.

వామ—(ఆసీనుఁడగుచున్నాఁడు.)

బలి—అయ్యా ! దేవరదర్శనమున సర్వవిధములధన్యుఁడనైతి. మరియు నీయజ్ఞకర్మయును మిక్కిలిపవిత్రమయ్యె ననుట యతిశయోక్తి కాదు.

వామ—నీహృదయమట్టిదిగానోపు.

బలి—బ్రహ్మచారీ ! మీదర్శనమున నామనంబేమో మహానందమగ్నమగుచున్నది. పావనమగు మీసేవామహిమను నేమనిపొగడఁగలను.

ఆ. వె. ఎవరివాఁడవెచటి కేగుచునిచటికి
రాక, వాంఛయేది మాకుఁ దెలుప
వచ్చునేని, వినఁగ వలతును వినిపింపు
నీచరిత్రమెల్ల నిక్కువముగ.

వామ—బలిసార్వభౌమా! నిక్కువమే వచింపఁ గలమని నిరుపముగ రాయిగ్రుద్దిచెప్పువారుందురా? కాని, అనృతమాడఁగల నిర్బంధమేదియు నాకురాలేదు.

బలి—అనృతవాదులని నాయభిప్రాయముగాదు. మాటవరుసనట్లంటిని. క్షమింపుఁడు.

వామ—తొందరలేదు. తప్పేమికాదు. కాని, నాచరిత్రము నీకేమని చెప్పఁ గలను.

బలి—అనఁగ అద్భుతమా? అవాచ్యమా?

వామ—(తనలో) అన్నమాటే (ప్రకాశముగ) అద్భుతావాచ్యములని దృఢముగఁ జెప్పుటకు మాత్ర మవకాశమున్నదా?

బలి—అనఁగా నివాసముగాని తల్లిదండ్రులుగాని—

వామ—(అర్ధోక్తిలో) ఉన్నట్లుగాని, లేనట్లుగాని, చెప్పుటకు శంకించియే యిట్లువచించితి.

బలి—ఏమిచిత్రమిది. శంకించుటేల?

వామ—ప్రాకృతమంతయుఁ జిత్రమేకదా?

శంబ—అదేమిబ్రహ్మచారీ! మహారాజుగారితో నకటవికటముగ మాటలాడెదరు పరిహాసములా?

వామ—పరిహాసములో, పరమార్థములో పరికింపకయే మీరు నిర్ణయింపఁగలరా?

కాల—స్వామీ! పిదపబరికింతముగాని, తొలుత మీనివాసము సెలవిండు.

వామ—ఇప్పటికి మీ యీ సన్నిధియే నివాసము. ముందుసంగతి యెట్లు జరుగునో చూడవలయును.

కాల—ముందుకాదు యిప్పుడునుగాదు. ఇదివర కెటవసింతురు ?

వామ—అనఁగ సృష్టిమొదలొక్కనియా ? నాపుట్టువు మొదల్గొనియా ?

శంబ—అయ్యా మహాత్మా ! మమ్ము చుట్టుమాటలతో నేలపరీక్షించె దరు. వీలున్నచోఁ దేల్చిచెప్పుఁడు. లేనిచో వీలు లేదనుఁడు.

వామ—ఏమున్నదని తేల్చిచెప్పఁగలనుగాని, వినుఁడు.

శంబ—ఆఁ. సెలవిండు.

బలి—శంబరా! వారి నేటికాయాసపెట్టెదవు.

వామ—నా కేమాయాసమున్నది. కాని, సత్యమే వచింపుట ధర్మమగు ను. కాదనను. నానివాసమున కొక స్థలమును నిహపరములు లేక యంతటను నివసింతును, తలిదండ్రుల మనుకొనువారందఱికి నేన తలిదండ్రినని కొందును. తమ్ములల మనుకొనువారందఱికిఁ దమ్ముఁ డనుకొందును. నాకు నేరొంటరినని కొందును. ఒంటరుల మనుకొనువారివెంటనంటియుందును. మఱియును,

తే. గీ. ఆశ్రయించునులక్ష్మి న న్ననవరతము
అనుసరింతుభార్గవిని నే న నహరహంబు
గతినగుటసాధులెటునను న గదలనీరు
సజ్జనులలో నమితముగ న సంచరింతు.

కాల—(రహస్యముగ శంబరునితో) మాయావాదననటులలో నీవ టుఁ డగ్రగణ్యునివలె నున్నాఁడే ?

శంబ—ఇటులనేకదా లోకవంచకులగు మెట్టవేదాంతులు సంభాషింపు చుందురు. సమయ మరసి నిలువున కొంపలు ముంపుచుందురు.

బలి—(తనలో) ఈబుడుతనిపల్కు లనృతములని నా కనిపించుట లేదు. కేవల సత్యమయునివలెఁ దోఁచుచున్నాఁడు. నేఁడు నిజముగా నాజన్మము తరింపనున్నది.

శుక్రు—(ఆశ్చర్య వితర్కములతో వామనునిఁ జూచుచున్నాఁడు.)

శంబ—(వామనునితో) బ్రహ్మచారీ! మీపల్కులు నాకేమాత్రమర్థము కావకున్నవి. సరికదా, మీమిక్కిలి వైపరీత్యములుగ గూడఁ బొడకట్టుచున్నవి.

వామ—యద్భావం తద్భవతి.

బలి—శంబరా! నీవూరకుండుము. వా రెవరికిఁ బుత్రులైన మనకేమి. నిర్మలమగు బ్రహ్మతేజ మామ్ముఖకమలమం దెట్లు ప్రకాశింపుచున్నదో చూడుము. మనకీతృప్తి చాలదా? సత్యజ్ఞానానంద తేజోమయుఁడనుటమాత్రము నిక్కమునక వీలులేకున్నది. (వామనునితో) అయ్యా వామనమూర్తీ! మీయాగమనమున మే మంద అము దరించితిమనుటలో నతిశయోక్తి లేశమైనను లేదు. కాని-

ఉ. దేవరవార లిందరుగుదెంచినదానిఫలంబు గాంచ మీ
భావము వెల్లడింపుడిది భాగ్యముగాఁ దమయాజ్ఞ లెల్లఁ బ
న్యావహమంచుఁ గోరినటు ? లప్పుడగాదనకేనుఁ దీర్తు నీ
యీవియె మీకు మాకుఁ బరితృప్తిఘటింపఁ గఁజేయునట్టులన్.

మద్గురుకటాక్షమున నిప్పటికిఁ దామేని కోరినను లోపములేదు. తప్పక నిచ్చెద.

శుక్రు—(తనలో) తథాస్తు. ఆహా! ఉత్తమోత్తముఁడన నితఁడుగాక దేవతలగుదురా? నిశ్చయము (తలపంకించుచు) నిశ్చయము (అని ఆనందమున దివ్యదృష్టినిఁ బరపుచున్నాఁడు.)

వామ—ఆహా! మహాదాతవైన నీవేకాక మరియొకరిట్లుంట కష్టసాధ్యము. నిశ్చయముగ దాతవు నీవేయనుటలో ననృతమేమియు లేదు.

తే. గీ. నిష్కళంకవంశముల జనిన్మించువార
లే పథమువట్టినను వారి కెవరులేను

పాలమున్నీటఁ బుట్టిన కాలకూట
సుధలగతుల కడ్డెపుడేనిఁ జూడఁ గలమె.

సార్వభౌమా! నే నిపుడుగదా నిక్కువముగఁ గృతకృత్యుఁడనైతిని. మీ వాక్యములకుఁ గాని, మీ నడువడులకుఁ గాని ప్రతిహతము గలుగదని నాకు గట్టినమ్మకము. ఇంతయు కశ్యపబ్రహ్మ వంశ ప్రభావముగదా. మీలోఁ దీసివేయఁ దగినవారెవ్వరో చూడుఁడు.

బలి—తేజోమూర్తీ! తమస్తుతులకీదియుఁ దనర్పుఁడు. ఆలసింపక మీ యభిమతము సెలవిండు.

కాల—వామనమూర్తియభిప్రాయము సత్యమనుట నిస్సందేహము.

శంబ—ఆ. ఇదిమాత్రము నిక్కమే. కశ్యపసంతతిమాత్ర మెవరికివారు నిరుపమానులే.

శుక్రు—(అద్భుతాశ్చర్యములఁ దనలో) ఔరా! నీవా తెలిసె. చెప్పవూ. పొట్టివాఁడా! నీవేనా. ఎంతమోస మెంతమోసము. అరే! సార్వభౌముఁడింకఁ బొరపడినాఁడు. (యోచించి) కానిమ్ము. (తలనూపుచు) ఇంతమాత్రమున కేమిమించినది. నిజమెఱుఁగకఁ జెప్పినవాఁడుగాన బలి తన యుద్దేశము మార్చుకొనఁ గలఁడు. మంచిది మంచిది. ఆహా నారాయణా! నిర్జరపక్షపాతివను నుడిని సాధింప నేతెంచితివిగా! కానిమ్ము నీయాటలు మును పటివలె సత్యవ్రతుఁడైన బలీంద్రునికడ సాగరావను కొమ్ము. నీమాయానటనము లీశుక్రుని కనిపట్టలేడను కొన్నావుగాఁబోలు. (ప్రకాశముగ) మాయావాదివగునో బ్రహ్మచారీ! కశ్యప బ్రహ్మసంతానమున నందర నుపమానులని చెప్పితివి కాని, నీకుప మానిమాత్ర మెవ్వఁడున్నాఁడు? నీసంగతిసందర్భముల నెఱుఁగనివారుమాత్ర మెవరున్నారు?

అందఱు—(ఆశ్చర్యమున శుక్రునిఁ జూచుచున్నారు)

వామ—(తనలో) ఈభార్గవుఁడు దివ్యదృష్టినన్నెఱింగినాఁడు. కానిమ్ము, మించి సార్వభౌముఁడు మాట జారినాఁడు. కావున విచారము లేదు. (శుక్రునితో) కవివరా! నన్ను మాయావాదిగాఁ గ్రహించితివి. ఇం దసత్యమేమియును లేదు. నే నొకఁడనే మాయావాది నెట్లు? మీరందఱు నిరుష్టముగు సత్యవాదులని నిర్ధారింపఁగలరా? ప్రపంచమంతయును మాయామయముగాదా? పేరుగూర్చి చెప్పుట దూర మాలోచింపకయేనా? అయిన నాకిందు బూర్వపక్ష సిద్ధాంతములేల! అనుభవమునఁ గాని యన్ని యెఱుకవడును (బలితో) చక్రవర్తీ! నాకితరులతోడేటికి. నామాటలలో నిజానిజములు సత్యవ్రతుఁడవు నీవే యోచించుకొనుము.

సీ. నీప్రపితామహు ♪ ల ప్రతిహతజగ
దేకవీరత వాసి ♪ కెక్కలేదొ
నీపితామహుఁడు వి ♪ నిర్మలభాగవ
తాగ్రగణియనియశ ♪ మందలేదొ
నీపిత ప్రాణమే ♪ నిస్తృణమ్ముగఁ జూచు
వితరణుండనిభువి ♪ వినికిలేదొ
నీవుధర్మదయాది ♪ నియమ విక్రమమహో
దారుఁడవనుచు వ ♪ దంతిలేదొ

తే. గీ. ఇందునామాయ లేవియో ♪ యింత తెలియఁ
జాలవొక్కొ స్వచ్ఛతరవి ♪ శాలకీర్తి
కాకరుండవునిరత స ♪ త్యానువర్తి
వక్రమాభ వవిక్రమ ♪ చక్రవర్తి.

శుక్రు—(తలనూపుచు తనలో) మంచిది. నీప్రగల్భములన్నియు నేకరువుఁ బెట్టుము.

శంబ—(రహస్యముగ కాలనాభునితో) ఈపొట్టిబుడతఁడసాధ్యుఁడు. వయసునకు మించినయోజ యున్నదిసుమా.

కాల—ఇందు నీ, నా, ప్రశంసలేమున్నవికాని, మనశుక్రాచార్యులవారింజూడుము. వామనునిఁ జూచినదిమొదలు వెఱ్ఱివానివలె నున్నాఁడు మనలెక్కయేమి?

శంబ—ఆచార్యులవారొకరేయేమి ? సదస్యులెల్లరుఁ జిత్తరువులటు కాలేదా ?

బలి—(తనలో) నిజము గమనించుటకు బుద్ధికి శక్తి చాలకున్నది. కాని కుఱ్ఱఁడుమాత్రము సామాన్యునిగఁ దోఁచుటలేదు.

వామ—సార్వభౌమా! మాటాడవేమి ? నాయభిప్రాయమునందసత్యము బొడకట్టినదా ?

బలి—నాకంతటియోజ లేదుగాని మహాత్మా! తమకు మాత్రము వాదప్రతివాదములతో నవసర మేమున్నది.

చ. అతిథికి దాతయందలి గుణాగుణతర్కవితర్కమేల ప్ర
స్తుత సమయానుకూల విధి ♦ చొప్పున నేగుటధర్మమౌఁగదా
చతురులు మీరలన్నిఁటఁ బ్రశంసలతోఁ బనియేమి యింక హృ
త్ప్రితమగు వాంఛితంబు దయ ♦ చేసి సమగ్రము వెల్లడింపుడీ.

వామ—(సంతోషమున) నిశ్చయము బలీంద్రా! నిర్మలమగు నీహృదయమునకు నాలోనే నమితానందమొందుచున్నాను. మంచిది. అప్రస్తుతప్రశంసలేల.

ఉ. కోరికలేదు నాకిపుడు ♦ గోరిన నీయగలేఁడెవండు నేఁ
గోరఁగనైన సృష్టికనుకూలములే మదిగోరుచుందు నీ
పేరుఁ బ్రతిష్ఠలెల్లవిని ♦ వేడుకమైనినుఁ జూడవచ్చినా
నూరక గోరుకొమ్మని గుణోత్తమ నన్బురికొల్పితౌ బళీ.

నీవితరణమునకు నేఁబరమానందకందళిత హృదయారవిందుండనైతినిగాన-

ఆ. వె. నాకుఁ గోర్కి లేదు ౯ లోకోపకృతికయి
కోరుకొందుభూమిఁ ౯ గొలిచిసరిగ
మూడడుంగు లోనఁగు ౯ మీఁదేరు గోర్కులు
నాకు నీకు నెల్ల ౯ లోకములకు.

అందఱు—(వెలవెలబోవుచు నొకరినొకరు జూచుకొనుచున్నారు.)

బలి—(ఆశ్చర్యముతో) ఇది యేమికోరిక స్వామీ ?

ఆ. వె. దాతకున్నశక్తి ౯ తలఁపులఁనెఱిఁగి యర్థి
రింపవలయునర్థి ౯ రీతిమెరయ
నంతేకాని కొంచె ౯ మడుగుటయవమాన
పరచుటగు నటన్న ౯ పలుకువినవా.

పిన్నవగుటచేత సంకోచించితివి కాఁబోలు. నీతలఁపును మార్చుకొని మ
రలఁ గోరుకొనుము. తప్పులేదు. బాగుగయోచించుకొనుము. చూడు-

తే. గీ. నే నిటుల బల్కరాదైన ౯ నినుఁగూర్చి
యభయమిత్తు జగత్త్రియ ౯ ప్రభుఁడనెవ్వ
రేదికోరిన లేదన ౯ కిచ్చువాఁడఁ
గాన తృప్తిగవాంఛింపఁ ౯ గడఁగుమనఘ.

శంబ—ఇంకను యోచింపుచున్నావేమి ? అర్థినిటర్థింపుమని ప్రోత్స
హించుదాత లుందురని వినియైన నున్నావా ?

కాల—పోనిమ్ము. చూచియున్నావా ? ముందైనఁ జూడఁగలవా?

వామ—సార్వభౌమా ! నిరుపమానమగు నీయౌదార్యమునకుఁ జాల
సంతోషమే కాని—

తే. గీ. కర్మమున కనుకూల సంకల్పమొదవు
దాని మాన్పింప నెవ్వని ౯ తరముగాదు

నిజవిమర్శన సమదృష్టి కే నియతునకు నిఁ
కేల యడియాసలభియించు కే మేలుజాలు.

నీ వుత్సాహపెట్టితివనిమాత్రము మరలఁ గోరుట నాకు ధర్మమగునా? చెఱకుతీపియని వ్రేళ్లతోఁగూడనమలుట శ్రేయమా? ఆశకంతమున్నదా?

సీ. భిక్షుకుఁడైనట్టి కే పేదతొలుతస్వల్ప
వేతనవృత్తికి కే వెదకులాడు
అది లభించినఁజాల కే కాపయినున్నతో
ద్యోగపదవిఁగోరి కే యుక్తిఁబన్ను
యుక్తిఫలింప నకోత్యుత్సాహమున స్వతం
త్రాధికారంబున కే కభిలషించు
అటుస్వతంత్రముగూడ కే నలవడఁ జక్రవ
ర్తిపదప్రయత్నత కే న్దేవులాడు
తే. గీ. తదభిలాష సిద్ధింప నింద్రత్వమనును
ఇంద్రుడైనచో బ్రహ్మత్వ కే మెన్నికొనును
ఎంతయున్నను యాశకు కే శాంతిలేదు
తృప్తియేకద చూడ ముక్తి యనుపదము.

కావున యథాలాభసంతుష్టియే నిత్యానందదాయకము. సంతృప్తి యెవనికిలేదో వాఁడెంత తేజశ్శాలియైనను నీళ్ళచేత నిప్పురూపుమారిపోయినట్లు క్రమముగ సహజతేజ మారిపోయి సంసారహేతుకమగు దుఃఖసముద్రపతితుఁడగును. అర్థిజనమందారుఁడవగు నీవెఱుఁగనిది లేదు. నీవు మాత్రము సత్యముదప్పక నాకోర్కెఁ జెల్లింపుము. నే నర్థించిన పదత్రయభూదానము మీకందఱకు నిర్లక్ష్యముగానున్నను నాపాలిటికదియే త్రిలోకసామ్రాజ్యదానమగును. కావున నాలసింపకుము. నే నర్థిని, సిద్ధముగనున్నాను. నీవు దాతవగుటకు సిద్ధపడుము.

బలి—అవశ్యము సిద్ధపడియెదను. తా మిందుఁ గొంతవిశ్రమింపుఁడు.

వామ—(తనలో) శుక్రుఁడేమో దీర్ఘాలోచనఁ జేయుచున్నాఁడు. ఏలాగైన బలిని సత్యవిముఖునిఁజేయఁ జూచుచున్నాఁడు. నే నిట నుండుట ప్రస్తుతము వారినిరాఘాటవాదమున కడ్డుగలుగును. కావున దప్పుకొనుట తగును. (ప్రకాశముగ) చక్రవర్తీ! నేను నర్మదాతీర్థములకడకుఁజని యిపుడేవచ్చెదను. ఇంతలో నీవు సిద్ధమున నుండుము.

బలి—చిత్తము. త్వరగా దయచేయండి.

వామ—ఇప్పుడే గడియలోపల వచ్చెదను (నిష్క్రమించును.)

శుక్రు—(దివ్యదృష్టిఁబరపి చూచుచుండును.)

బలి—ఓయీ! యెవరక్కడ?

తెరలో—చిత్త మేమిసెలవు?

బలి—దానోపయోగ పరికరసహితముగ నాయర్ధాంగలక్ష్మి వింధ్యావళీదేవి నిటకురమ్మని చెప్పుము?

తెరలో—చిత్తము.

శుక్రు—దానమిచ్చుటకుఁ గృతనిశ్చయుఁడవైతివా?

బలి—లేక దేవరప్రియశిష్యుఁడు వెనుకంజవేయునా?

శుక్రు—(నవ్వుచు) ఎంతయమాయకుఁడవోయి యెంతటి వెఱ్ఱితనమోయి?

బలి—ఏమి గురువరా?

శుక్రు—నీవితని నెవరని తలంచితివి?

బలి—బ్రాహ్మణ బాలుఁడని—

శంబ—బ్రాహ్మణబాలుఁడే గాని సామాన్యుఁడుగాడు. నిరుపమానతేజశ్శాలిగఁ దోఁచుచున్నాఁడు.

అందఱు—సత్యము సత్యము.

శుక్రు—నామాటఁగూడ గొంతవిని విచారింపుఁడు.

బలి—చిత్రము.

శుక్రు—

ఉ. బాపఁడుగాఁ డితండు జిరుపాపఁడుగాఁడసురారి విష్ణుఁ డీ
రూపముదాల్చి నిర్జర విరోధివికావున నీసమస్త భా
గ్యాపహారంబొనర్చి యమరాధిపుపాలొనరింపనెంచి యి
ట్లీపగిదిన్నటించు గ్రహియింపఁగపోయెదిదేమి? సుంతయుర్.

బలి—ఏమంటిరి మహాత్మా! యీతఁడు విష్ణుఁడా? ఇట్టివేషము ధరించి వచ్చినాఁడా?

శుక్రు—దేవకార్యతత్పరుఁడై యదితికశ్యపులకుద్భవించి శ్రీమహావిష్ణుఁ డెట్లో నీప్రాభవసంపదనెల్ల హరించి వాసవునకొసంగ బద్ధకంకణుఁడై చనుదెంచినాఁడు. తెలిసినదా?

బలి—చిత్రము. ప్రస్తుతము నా సామ్రాజ్యమేరీతిహరించి యింద్రునకీ గలఁడు?

శుక్రు—నీవిచ్చెడి మూడడుఁగుల భూదానమున నే.

బలి—ఎట్లుపీలగును మహాత్మా?

శుక్రు—ఇట్లు

ఆ. వె. నీవొసంగినట్టి నేలమూడడుఁగులఁ
గొలుచుకొనునుకొల్ల గొట్టినట్లు
జగములెల్లసుంత - మిగిలియుండఁగనీఁడు
కాయమతిగఁ బెంచి కనులఁ జూడ.

పిదప నెవ్వరేమి చేయఁ గలరు. సర్వము హరికర్పించి బుఱ్ఱకాయ దీసి కొందువా?

బలి—(ఆలోచింపుచు) పదత్రయముననే భువనములాక్రమించునా? ఎంతటియద్భుతము.

శుక్రు—ఇంకను సంశయింపుచున్నావా? ఇటువినుము. దశదిక్కులు పిక్కటిల్లెడు మహాదేహముతో దీప్తులు మిరుమిట్లుగొల్పుచుండ నొకపాదమున భూమియు మరియొకపాదమున దివమునాక్రమించి యెక్కడసందులేక దాన నిండియుండు నపుడేమిగతి?

బలి—ఏమో జరిగిన జరుగవచ్చును. కాని, యిప్పుడేమిచేయనగును?

శుక్రు—ఇచ్చెడిదానమును దప్పుకోవలయును.

బలి—ఇత్తునని యీయ ననవలయునా?

శుక్రు—ధర్మహాని యేమున్నది?

బలి—నే నీయననుట ధర్మహానిగాదా?

శుక్రు—కాదు.

బలి—ఎట్లు?

శుక్రు—శక్తినిమించుటచేత.

బలి—మూడడుఁగుల భూదానము నాశక్తినిమించునా? మహాత్మా!

శుక్ర—ఓయి వెఱ్ఱివాఁడా! శ్రీమహావిష్ణుఁ డదితికశ్యపుల కవతరించి నిన్ను వంచింప నేతెంచినాఁడని చెప్పలేదా?

బలి—చిత్తము. చెప్పినదానిమరువలేదు. ఇత్తునన్నదానముఁ దప్పుకొనుటకు శాస్త్రోక్తమగు ధర్మసూత్రముసెలవిండు.

శుక్రు—అట్లడుగుము.

క. ఏదానముచే దాతకు
మోదముజెడిపోయి కష్టసేములు జేకురునో
ఆదానమ్మను దానము
గాదని పెద్దలువచింపఁగా వినలేదో.

అనుభవనీయులగు వారినుడువులే శాస్త్రోక్తసూత్రములు. మహాత్ముల సంకల్పములు శాసనములనియు, ననుల్లంఘనీయములనియు, నీవెఱుఁగ

వా ? స్వనాశహేతుకరంబగు నీదానము దానము గాదు. కావున తప్పు కొనుము.

బలి—మహాత్మా ! సంశయము బాధింపుచున్నది కావున, నడుగుచున్నాను క్షమింపుఁడు.

తే. గీ. పలికిబొంకుటకన్నను పాతకంబు
యీదలంచి తప్పుటకన్న హీనతమము
చేతనిడికైకొనుటకన్న చెట్టతనము
లేదు, లేదు, లేదందురు గాదెబుధులు.

శుక్రు—నిజమేనయ్యా కాదన్నవారెవ్వరు ? దానము సధర్మమైనచోఁ గదా, ధర్మవ్యతిరేకమైనపుడో ? గర్హితముగాదా ? తారతమ్యము దెలియనిదానములు దానములనుకొన్నావా ? స్వనాశనహేతుదాయకములైన వెల్ల దానములనుకొన్నానా? ఏపురుషుఁడేదానముఁ జేయఁదలఁపనీ, దానికిమాత్రము న్యాయములేదా ? ఎందులకుఁ గాని స్వేచ్ఛచెల్లఁ గలదా ? దానమన సామాన్యముగాదు. వినుము. స్వధర్మార్జితవిత్తమైదుపాళ్లుగభావించిక్రమముగ ధర్మమునకు అర్థమునకు గామమునకు యశమునకు ఆశ్రితులకొసంగవలయు నట్లు చేయనివాఁడు తప్పక చెడిపోఁగలఁడు. అది యెంతటిశ్రేష్ఠతమమైనదేకానిమ్ము. శక్తికిమించినదానమైనపుడు జేయనేకూడదు. సమర్థుఁడైనదాతను అర్హుఁడైన యర్థి తనకవసరానుకూలముననే యర్థింపవలయు. వానికిఁ దప్పకనొసంగుటయే దాతయగువానికిఁ గూడ బరమధర్మము. ఈవటుఁడు కేవలము నిన్నువంచించి బడుగుంజేసి దేవేంద్రునిఁ బ్రతిష్ఠింపనేతెంచినాఁడు. తప్పదు. కులగౌరవమును, ప్రాభవసౌఖ్యమును, తేజోబలంబుల నిల్పుకొనఁ దలఁచినచో నేఁ జెప్పినట్లు నడువుము. లేదా ? నీయిష్టము.

బలి—(ఆలోచింపుచున్నాఁడు.)

కాల—అద్భుతాశ్చర్యముగానున్నవి.

శంబ—మహాత్మా, ఆచార్యవరా! తమసెలవెట్లో యట్లునడువకతప్పదు. సరే, కాని యిఁకవామనుఁడురాఁగలఁడు. వచ్చినవాని మర్మములవెల్లడించి వెడలనంపుమందురా ? వేరే యుపాయమేదేని జూపింతురా?

శుక్రు—ఉపాయములకేమి. కాని, సార్వభౌమునిసంశయము దీరనేలేదు. నానుడులు నీమనసునకెక్కలేదుగాఁబోలు చూడు. బహుజనాదరణీయమగు మద్విరచితమగు నీతినిమఱచితివా ? వినుము.

ఆ. వె. వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
ప్రాణవిత్తమాన ♦ భంగమందుఁ
జకితగోకులాగ్ర ♦ జన్మరక్షణమందుఁ
బొంకవచ్చునఘముఁ ♦ బొందదధిప.

నీకుఁ దేల్చి చెప్పుటకు మోమోటమైనచో నే నతనితో [illegible] పంపివైచెదను. నీవందుకు సమ్మతించినట్లు నటింపుము.

శంబ & కాల—ఇదిబాగుగనే యున్నది.

బలి—ఆచార్యోత్తమా! దేవరవారి సేవామహిమావిశేషమున నాకుఁదటస్థించిన నియమధర్మముల మనవిచేసికొందును. సత్యమారసి నన్నుక్షమింపుడు. తా మిపుడానతిచ్చిన సందర్భమంతయు వాస్తవమే యనకఁ దప్పదు. కాని మదీయాంతరంగనివాసి సత్యస్వరూపుడగు భగవంతుఁడు. నే నాతనియాజ్ఞలనుసరించుదాసుఁడను. ఏయర్థులేదికోరిననదితప్పకయిత్తునని తొలుతవచించి లోభచిత్తుఁడనై మరలఁ దప్పుకొనుట కేమాత్రము మదంతరాత్మునకొప్పిదములేదు. సరికదా నాకన్నసృష్టిలో నీచాతినీచమైన జన్మమేయుండదని తోఁపింపఁజేయుచున్నాఁడు. నే నేమి ధిఃకృతవృత్తి

తో మీ కేదో సమాధానము జెప్పుచున్నా ననుకొనవలదు.

అయినను—

తే. గీ. అన్నిభరించు భూదేవి । యజునితోడ
నొల్లి విన్నవింపఁగలేదె । దుర్భరయయి
పొందరాని యిడుమలోర్చు । కొందుగాని
సత్యహీనుని మోవఁగఁ । జాలననుచు.

మఱియు నోగురువరా !

సీ. గంగిరెద్దట్లు నగలుదుస్తులందరి
కన్నమిన్నఁగఁ దాల్పఁ । గాదుఘనత
పూటకుఁ బదివేషములు దిద్దితీర్చు కొ
నంగనేకాదది । నాగరికత
ఉన్నతవీథిఁ గూర్చున్నంత నేమి ప్ర
ఖ్యాతియాఁ గాదది । కాదుప్రభుత
లావరినంచు సలాము లెల్లరిచేతఁ
గొనినమాత్ర నెకాదు । కులవిమలత

తే. గీ. పలికిబొంకక సద్ధర్మపథముఁ జనుట
సమరమునజయమో లేక । చావొగనుట
మానధనులకు విధియని । మాన్యులనుట
విని నిజంబునారసి యట్లు । చనుటమనుట.

తా మెఱుకపరచినధర్మము లేకదా మహాత్మా! తాము సెలవిచ్చిన ధర్మార్థ కామయశోవృత్తులలో నన్నర్థు లేదియర్థించిన నద్దానిఁ గాదనక యిచ్చెద నని మదంతరాత్మతోఁ బ్రమాణ మొనర్చినాను. ఇప్పుడేమి సేయుటకవకాశమున్నది ?

శుక్రు—నీవేదో గొడవలోనికి దిగుచున్నావు. సరే; నీవు ప్రమాణమొన

ర్చినావు బాగున్నది. రేపు లేక నేఁడే నీసర్వము నెవరైన నర్థిం
తురు. ధర్మమని త్రిశుద్ధిగనర్పింతువా ?

బలి—అంతటియోగ్యమగు పాత్రలభించినసంశయమేల ?

శుక్రు—సర్వనాశమున కొప్పుకొనియే ?

బలి—అది నాశనమనదగునా ? మహాత్మా! మహాభాగ్యముకాదా ?

శుక్రు—గ్రుడ్డువోయి పిల్లను వెక్కిరించునట్లున్నది. స్వనాశనదాయక
మగుదానము కర్మానుసారిణియై నీకు ధర్మముగదోఁచుచున్ననీకిం
కేధర్మసూత్రములుగాని తలకెక్కునా ?

బలి—మీమహిమచేతనే గాక మరేసమర్థతయూ లేని నేను తమయుప
దేశము నిరాకరించు సమర్థతగలవాఁడనా ? తండ్రీ.

శుక్రు—ఇపుడీస్తుతు లప్రస్తుతములు వినుము. నాకుజుట్టుమాటలుదెలి
యవు. నీయందు నా కమితాభిమానము గావున వినకతప్పవని
నమ్మకముతో మరిమరి నొక్కిచెప్పుచున్నాను. నీవీదానమునీయ
వద్దు. అందుకేమందువు ?

బలి—స్వనాశనదాయకమగు దానమనియు, దానిమానుకొనుటయే
ధర్మమని శాసింపుచున్నారు. సరే మంచిది. సర్వనాశనకరమగు
దానమని తెలిసియు నొసంగి కృతార్థులైన పెద్దలనైన ననుసరిం
పుమందురా లేదా ?

శుక్రు—అట్టిపెద్దలెవరో చెప్పుము?

బలి—శిబి దధీచిమొదలగువారు. గురూత్తమా ! తనువు లశాశ్వత
ములు. భూమినిదివరకెందరు పాలింపలేదు. వారి నామరూప
ములేమైన వాడుకలోనున్నవా ? ప్రాకృతైశ్వర్యముల విశ్వసిం
చి నిత్యమగు సత్యము నుల్లంఘింపనగునా ?

తే. గీ. యశము హరియించుకృత్యమేదైనఁ గాని
దాని మృత్యురూపంబుగఁ జి ధలఁపవలయు

కీర్తికరమగు లోకోపకృతమునైన
పనిని మానకఁ జేయగ నే వలయుఁ గాదె.

శుక్రు—(కోపముతో) సర్వనాశనమైనను సరియే, నీకీదానమిచ్చుటయే యిష్టమందువు కాదూ ?

బలి—సర్వనాశనమో, సర్వకర్మనాశనమో నాకిప్పుడు దోపదు.

శుక్రు—ఇప్పుడెట్లుదోఁచును. అనుభవమునకు వచ్చునప్పుడు—

బలి—దేశికేంద్రా ! వాదప్రతివాదము లవసరములేదు. సత్యమే మన కత్యవసరము. కృషీవలునకు క్షేత్రబీజము లదనున లభించునట్లు శతాశ్వమేధదీక్షాంతసమయమున నిట్టిసత్పాత్రను లభించిన పుడు తప్పుకొనఁ జూచుటన్న, సిరి రా మోకాలొడ్డుట కాదా ?

శుక్రు—జ్ఞానము బాగాముదిరినది. బలీంద్రా ! నీ తెలివి తేటలెంతవరకు వచ్చినవి ! ఆహా ! విధిబలము. విష్ణువీరూపమున నిన్నువంచించి నీసర్వస్వ మింద్రుని కీయవచ్చినాడని ఆగతవృత్తాంతము దాపక నీకెఱింగించుటయే వృధయగుటట్లుండ పైగా నతఁడు సత్పాత్రుఁ డనికూడఁ జెప్పుచున్నావు. ఇంక నే నేమనఁగలను.

బలి—ఆతఁడు విష్ణుఁడే నిజమైన సత్పాత్రశబ్దముగూడ చాలదు. అంత కన్న వేరుశబ్దముగూడ నాకు దెలియదు. నన్నిందు వంచించిన దేమున్నది. వారడిగిరి. నే సమ్మతించితిని.

శుక్రు—వంచించువాఁడుగాదా ? విష్ణుఁడతఁడని నీకు దెలియునా ? చెప్పినాఁడా ?

బలి—ఎవ్వఁడను గానని యే చెప్పినాఁడు. దానియర్థమెఱుఁగకఁ ద్రొక్కులాడుపడుచుండ మీరు విష్ణుండని చెప్పినారు ?

శుక్రు—అతఁడు దానార్హుఁడు, సత్పాత్రమంటివి నిజమేనా ?

బలి—అంతకన్న సత్పాత్రుఁ డెచటనుండును ?

శుక్రు—సర్వైశ్వర్యమూలకందమగు లక్ష్మీనాథుఁడు గతిలేక నిన్ను యాచించెనని తలఁచెదవా ?

బలి—అందుచేతనే యమితానందముగ నున్నాను. కారణమేమన—

తే. గీ. నిత్యలీలావిభూతుల నిమిషమునను
సృష్టిలయము లొనర్చు విశిష్టురాలు
సేవఁజేయ నానందించు శ్రీవరుండు
యిటులవిచ్చేసె మద్భాగ్య మెన్నవశమె.

ఎట్లువచ్చిననేమి వచ్చినాఁడు. భిక్షాన్దేహి యన్నాఁడు. చేయిఁజాచినాఁడింకేమికావలయు నిదిచాలదా ? సామాన్యమేనా ? కేవలమిది దేవరవారియాశీర్వాదప్రభావఫలముగాక నాకట్టియోగ్యత గలదా మహాత్మా.

శుక్రు—సరే, నీవ్రవంచింపఁబడుట నీకిష్టమేకదా ?

బలి—ఎటులైననూ నాయదృష్ట ముత్కృష్టమైనదనక వీలులేదు. నానిశ్చయము వినుఁడు.

సీ. అఖిలాండ కోటి బ్రహ్మాండాధినాయకుఁ
డర్థియైవచ్చుట యశముగాదె
క్రతువులఁ దపములఁ గనులఁబడనిదేవుఁ
డర్థియైవచ్చుట యశముగాదె
సర్వేశ్వరుఁడు హస్తసరసీరుహముజాపి
యర్థియై వచ్చుట యశముగాదె
ఆర్తులకభయదాయకుఁడగు భగవంతుఁ
డర్థియైవచ్చుట యశముగాదె

తే. గీ. ఎట్టిదుర్భరాపదలు రానీ చివరకుఁ
జావనీ యజహరముఖదేవతాళి
పట్టుపట్టనీ పలికిన పలుకుఁ దప్పఁ
దిరుగనేర దీ నాలుక ధీవిశాల.

శుక్రు—నీవంతటి సత్యవ్రతుఁడవైనఁ గావచ్చును. గాని కష్టపడి నిన్నింతటి మహోన్నతస్థితికిఁ దెచ్చినవాఁడఁగాన తుదినానిశ్చయముగూడ వినుము.

ఆ. వె. నీవుదానమిచ్చు నిముసమునఁ ద్రివిక్ర
మాకృతిని సమస్త మాక్రమించు
పైని నాగపాశబద్ధు నిన్నొనరించు
నింద్రునకు సమగ్ర మిచ్చితీరు.

తప్పదు. ముమ్మాటికినిఁదప్పదు. నే నీ ప్రాభవవైభవము మీవంశవిశ్వాసమున నీచేతఁ బెట్టితి. అదిపోయిన నీవొక్కఁడవే చెడిపోవు. ఈదానవవంశమంతకు చేటువాటిల్లును. గావున నామాటవినుము. తప్పులేదు. యీదానమొక్కటిమాత్ర మెట్లో తప్పుకొనుము.

బలి—తమ యుపదేశమంతయు సత్యమే. దేవరవారి మహిమావిశేషమే యీవైభవ మంతయు నాకరగత మొనర్చినదియథార్థమే. కాదనిన నిలువున దహించిపోనా? కాని మాటఁదప్పుకొన లేను మన్నింపుఁడు. పిదప మరేమైనఁగానీ—

ఉ. అంబుధులింకుఁగాక విలయంబుగఁ దారలు జల్లుమంచు భూ
మింబడ రాలుగాక విరమించి ధరాస్థలి రేణురూపమై
యంబరమందు లీనమయి యైక్యమునొందునుగాక సర్వనా
శంబగుఁగాకఁ దక్కక నొసంగెద దానము బ్రహ్మచారికిన్.

కాల—ఔరా! ధీరోదారత. సెబాస్! (తలపంకించును)

శంబ—ఇదియంతయు నా కింద్రజాలమువలె నున్నది. దైత్యులగతు లెట్లున్నవో?

కాల—ఆహా!

ఆ. వె. సకలవైభవములు సమసి సన్యాసియై
కూడయినను లేక కొట్టుకొనుచు

చావసిద్ధమైన ♦ సమయమందైనను
మాటఁదప్పలేరు ♦ మానధనులు.

శుక్రు—(కొంత యోచించి కోపముతో)- ఏమంటివిరా ? తప్పక బ్రహ్మ చారికిచ్చెదవా ? ఎంతలో నెంతవాఁడవైతివి ? ఓరికృతఘ్నుఁడా! ఇంతలోనే యింతటి విస్మృతి, ఇంతటినిర్లక్ష్యము, ఇంతటిగర్వము నా? నీమొదలగు దానవుల నోట మట్టిఁగొట్టి దేవతలకు సుధా రసమిచ్చి మిమ్ము బడమొత్తించి జయజయారావములతో నేగిన విష్ణునిపై నీకింతటిభక్తి కలిగెనా? కులగురుఁడనై యెల్లప్పుడు మీరు మహోన్నత గౌరవోపేతులై యలరారవలయునను దేవు లాటతోఁ బడరానిపాట్లు బడియెడు నాయెడ నింతటి విరక్తి కలి గెనా ? ఇది నాఁడేలచూపవైతివి ? చూపినచో నీకింతటిగర్వో ద్రేకమును, దానవులందరికీ నీచదశలును, నాకిట్టి గర్వప్రాయ శ్చిత్తమును లేక నందరము నిశ్చింతగనుందుమే, దానవులనమ్మ రాదు. కృతఘ్నులను దుష్కీర్తి నీయందే మూర్తీభవించెగదా ? మంచిది. నీకింతటి పట్టుదల యున్నప్పుడు నాకుమాత్ర మేల లేకుండవలయును. సర్వవిధముల దిక్కుమాలిపోయిన నీకు నేను త్రైలోక్యాధిపత్యము నార్జించి యిచ్చినాను. న్యాయ విమర్శన మొదవ్చినచో నీపై నాకు సర్వాధికారములు చెల్లఁ గలవు. నీజీవితమెల్ల నాయరచేతిలో నున్నది. కావున నావ టునకుఁ బదత్రయభూదాన మీయవలదని శాసింపుచున్నాను. వింటువా ? శాసనము నుల్లంఘింతువా ?

బలి—విననుం. వీలులేదు. తామన్నట్లు నానాగతుల నాజీవితమెల్లను మీకరములోనిదేగాన మీశాసనము నిరంకుశముగ నాప్రాణ మానములపైఁ జెల్లితీరును. కాని మన్నియమితాచరణములందు

మాత్రము చెల్లదు. చెల్లింపనెంతురా? ఉల్లంఘింపక తప్పదు. నావలన తప్పులేదు. భయమునులేదు.

శుక్రు—అటులైన మదీయాజ్ఞోల్లంఘన మొనర్చువాని క్షమింప నని నాకు నియమితాచరణ మున్నదిగాన శాపరూపమున నిన్ను శిక్షించెదను.

బలి—చిత్తము. సిద్ధముగ నున్నాను.

శుక్రు—మంచిది. యిదిగో యనుభవింపుము.

తే. గీ. దయకతంబున నీయభ్యుదయముగోరి
వత్సలతను నీకులగౌరవంబు నెంచి
మేలుచేసిన నాయాజ్ఞ మీరినావు
గావునన్పదభ్రష్టతఁ గాంచుమింక.

కాల & శంబ—హా! హా! (అని చెవులుమూసికొని) అమంగళము ప్రతిహతమగుఁగాక.

బలి—(తనలో) సత్యస్వరూపియగు సర్వేశుఁడేకలఁడు.

వామ—(ప్రవేశించి) సార్వభౌమా! ఇంకేటికాలస్యము?

బలి—ఆర్యా! దయచేసి యీపీఠమలంకరింపుఁడు.

వింధ్యా—(దానపరికరయుక్తయై ప్రవేశించి) ప్రాణేశ్వరా! వందనము లర్పించెద.

బలి—దేవీ! యాకలశమందలి యుదకమును నాహస్తముననుంచుము. (వామనునితో) స్వామీ! దానముచు బరిగ్రహింపుఁడు.

వామ—మంచిది. రమ్ము. ఇమ్ము,

బలి—(వామనుని కాళ్లుగడిగి శిరమునఁ జల్లుకొని తనహస్తమున నుదకముంచుకొనును.)

వింధ్యా—(భర్త చేతిలో నెమ్మదిగ నుదకముంచుచుండును.)

శుక్రు—(కోపమునఁ దనలో) తపస్సంపన్నత కేదిలోటు ? దానధార సాగకుండ మదీయదృష్టి నడ్డుగాఁ బ్రయోగించెదను.

కం. ఆరయసృష్టి స్థితిలయ
కారణమానందమయము ౹ ఘన మమలంబోం
కారమఖండ మనంతము
నారూఢిఁగలట్టిదృష్టి ౹ కడ్డేవఁడొడ్డుౕ.

(అని దృష్టినిఁబరపు చున్నాఁడు)—

బలి—(వింధ్యావళింజూచి) ఇదేమి కొంచెము ధారపడి యుదకము రాదేమి ?

వింధ్యా—(పరియత్నించి) ఏమాశ్చర్యమిది ? కలశమం దుదకమున్నది. ధారపడుట లేదు.

వామ—(తనలో) తెలిసినది. ఇది శుక్రుని తపోగర్వతంత్రము. (ప్రకాశముగా) ఉండుఁడు. ఏదేని యడ్డుపడియుండును. (అనికుశనొకటిఁ దీసి యభిమంత్రించి కలశమునఁ బొడుచును.)

శుక్రు—(కన్నుపైఁ జేయిఁగప్పుకొని) అబ్బా! మాయపొట్టివాఁడు నాకన్నుఁ జితుకఁబొడిచినాఁడు. హా ! హా ! కొంపదీసినాఁడు. దైవమా ! బాధ యమితమగుచున్నదే. ఇటనుండి వెడలిపోయెదను. (లేచిపోవును.)

వామ—(నవ్వుచుఁ దనలో) గర్వ మడఁగినది. కన్ను లొట్టబోయినది.

ఆ. వె. ఒరులమేలుజూచి ౹ యోర్వఁ జాలనివాని
కిట్టిగతియె కలుగుఁ ౹ దుట్టతుదకు
బ్రాహ్మణుండు దపసి ౹ భవ్యాత్ముఁడు న్గవి
యైననే మసూయ ౹ యంతఁ జెరచె.

వింధ్యా—ఆహా ! ధారపడుచున్నది కానిండు.

బలి—(వామనునిహస్తమున ధారవిడుచుచు) సత్యస్వరూపియగు భగవంతుని కర్పితముగ మూడడుఁగులమేరగలభూమినిఁ ద్రికరణశుద్ధిగ సమర్పించుకొనుచున్నాను.

కాల—జగదీశ్వరప్రీతికరమై (బలినిఁజూచి) మీజన్మము ధన్యమగుఁగాక.

శంబ—తథాస్తు.

వామ—ఆహా! ఎంతటిసుదినము. సత్యప్రియా! సార్వభౌమా! నీదానము నాయంతరంగము నెంతో యానందింపఁ జేసినది. కారణమేమన ?

ఆ. వె. ఇత్తునన్నదాని కేమాత్రమైననుఁ
గొంకుజంకులేక కుమతులెల్ల
వివిధగతులమనసు విఱిచినవినఁబోక
నీకువలెనొసంగు నేత లరుదు.

(తెరలో) సత్యము. సత్యము. సత్యము.

బలి—ధన్యోస్మి. (పైనుండిపుష్పవృష్టి)

వామ—నిజమున నీవే ధన్యుఁడవు. నీకు విరోధులగు దేవతలుగూడ నీదాతృత్వమునకు సంతసించి నీపైఁ బుష్పవృష్టిఁ గురియింపుచున్నారు చూడు. భూదానమన సామాన్యము గాదుసుమా! అది యెంతమాత్రమైనను దాతయుఁ బరిగ్రహీతయుఁ బెద్దకాలము పరసౌఖ్యము లనుభవింతురు. అది శాస్త్రీయధర్మముగాన మన కట్టిఫలము తప్పదు.

బలి—భాగ్యము.

శంబ—(తనలో) స్వప్నమువలెనున్నది. నాకేమియుఁ దోచుటలేదు.

కాల—(తనలో) విచిత్రముగను భయంకరముగనున్నది.

వామ—బలీంద్రా! నాభూమి నేను స్వాధీనపరచుకొనుచున్నాను. చూడుము. (తెరలోనికేగును)

బలి—(అద్భుతాశ్చర్యములతో) అదేమి! అదేమి!! (అని వామనుఁడేగిన వైపుఁ జూచుచున్నాఁడు.)

అందఱు—హా ! హా ! (అనుచు నిర్విణ్ణులగుదురు.)

కాల--చూచుచుండఁగనే పొట్టికుఱ్ఱఁడు క్రమక్రమముగామిన్ను కంటెనే—

శంబ—మిన్ను మన్నేమి, బ్రహ్మాండమంతయు నిండినాఁడు.

కాల—(క్రిందికిఁజూచి) ఇదిగో మన మందఱ మతనిపాదముపై నిలిచి యున్నాము.

శంబ—భూమి సాంతముగ నొక్కపాదముననేఁ గప్పినాఁడు. కొలిచినట్లే యున్నది.

కాల—దివమంతయు రెండవపాదము వ్యత్యస్తమొనర్చి కప్పినాఁడు.

(తెరలోఁ గలకలము.)

శంబ—(వారింపుచు) అందఱు మిన్నకుండుఁడు. ఏమో చెప్పుచున్నట్లున్నాఁడు.

(తెరలో)

ఓహోహో! మహోదారశిఖామణీ! సార్వభౌమా !

ఆ. వె. భూమియేకపాద ◌ మునసరిపోయెను
నింగియొండొకంట ◌ నిండిపోయె
మూఁడఁ గానఁబడదు ◌ మూఁడవయడుగున
కేసలంబొచూపు ◌ మిద్ధచరిత.

(బ్రహ్మాదిదేవతలు, ప్రహ్లాదనారదాదులు జయజయారావములతోఁ బ్రవేశింతురు.)

బ్రహ్మ—ఆ. వె. జయతుజయతుజయతు ◌ శంఖచక్రగదాంక!
రుద్రః— గరుడవాహ మేచకమయదేహ!
దేవేం— భవభయాపహరణ ◌ పద్మనిభచరణ !
ప్రహ్లా— గానలోలదివ్య ◌ కనకచేల.

శంబ—ఇదేమి! ఆకాశగంగాప్రవాహమేనా యది ?

నార—ఇప్పుడు జూచితివా? విధాతత్రివిక్రముని పాదప్రక్షాళనపవిత్రో దకముకాదా ?

వామ—(పూర్వమువలె బ్రవేశించి బలితో) సార్వభౌమా ! నీవిచ్చిన దానము మాకు సాంతము ముట్టలేదు.

ఆ.వె. భూమి యేకపాద । మున సరిపోయెను

(అను వెనుకటిపద్యము చదువుచున్నాఁడు.)

అందఱు—(వామనునకు నమస్కరింతురు.)

బ్రహ్మ—సీ. జయతుజయతుసర్వ । జగదేకనాథ య
నంతకల్యాణగు । ణప్రధాన

రుద్రు— శుభమస్తు మాని సం । స్తుతపావనచరిత్ర
దీనజనావన । దేవదేవ

దేవేం— మంగళంభవతు శ్రీ । మానినీహృదయేశ
కంబునిభగ్రీవ । కమలనాభ

నార— అక్షయశ్రీరస్తు । రక్షోజనవిపక్ష
నిరుపమసంకాశ । నీలదేహ

ప్రహ్లా— తే. గీ. ఆశ్రితావన యమితద । యాంతరంగ
దివిజహృత్సరసీరుహా । దిత్యవిమల

బలి— భక్తజనపారిజాతశుం । భత్ప్రతాప
కేశవా! సకలాఘవి । నాశ యీశ (నమస్కరించును)

వామ—శుభంభవతు శుభంభవతు. చక్రవర్తీ ! మూడడుగులనకు దగినస్థలమెక్కడ ?

శంబ—ఔరా ! మాయావీ ! పొట్టివాడా ! అమాయకుఁడగు మాచక్ర వర్తిని మోసగించి వంచింపఁజూతువా? నిన్నిపుడేమిచేయుదునో చూడుము—(గుద్దెత్తఁజేయును.)

కాల—ఓరోరి కృతఘ్నహృదయా ! యింటఁగుడిచి యింటివాసములు లెక్కించునట్లున్న నీవు సర్వేశ్వరుఁడవా బాబూ ?

ఉ. దానమటంచు బారునివిరోధంబున మాయలపొట్టివాఁడవై
దానవసార్వభౌమునిఁగృతఘ్నత మోసము జేసినంతనే
ప్రాణసమానులౌ నతనిబంధువులాద్యసురవ్రజంబు నీ
మేనుఁదొరంగఁజేయరె క్షమించెదరే నినుఁ బోవనిత్తురే.

శంబ—(ఎలుగెత్తి) ఓహో రక్షకవీరులారా ! వేగరండు వేగరండు.

ఆ. వె. పొట్టివడుగువేసమున మాయఁజేసి మూ
డడుగు లవనిదాన మనుచుఁగోరి
సత్యమూర్తియైన సార్వభౌమునికొంప
ముంచె వీని విఱుఁగఁబొడువవలయు.

(తెరలో గలకలానంతరమున)

(తెరలో) ఓహో ! సార్వభౌమామాత్యాది దానవవీరులారా ! విష్ణుదూతలతో నేకీభవించి దేవతాధములు మమ్ము నురుమాడుచున్నారు. రక్షింపుఁడు. రక్షింపుఁడు.

బలి—(మంత్రుల వారింపుచు) మంత్రిపుంగవులారా ! త్వరఁబడవలదు. శాంతింపుఁడు.

ఆ. వె. అదనుగాదు మనకు హరితోడ ననిఁజేయ
కాలమొకటిఁగిపోరఁ గలుగు జయము
కష్టసుఖములరయఁగా సృష్టినైజము
ల్బీరసురలఁగనుఁడు వీరులైరి.

ప్రస్తుతముమాత్ర మీలోకవాసము మాని రసాతలమున కేగుఁడు. మీరిఁక నిటనుండవలదు పొండు. (నిష్క్రమింతురు.)

వామ—(విష్ణుదూతకు సన్న జేయును.)

దూత—(బలిని పాశములచేత బంధింపుచున్నాఁడు.)

వామ—దానవనాయకా ! నీవాగ్దానముఁ జెల్లించినఁగాని బంధముక్తుఁడవుగావు.

అందఱు—ఆహా ! బలిబంధనము. కాలనిబంధనము. (అని తలలఁ బంకింతురు.)

బలి—(తనలో) ఔరా దుర్విధి ! యీవైపరీత్యమున కిప్పుడేమనుకొనవలయును!

శా. సత్యంబే పరమేశ్వరుం డరయఁ దత్సర్వేశుఁడే సత్యమా
నిత్యంబుం జఖిలాగమానుభవనిర్ణీతజ్ఞులా పెద్దలె
ప్రత్యుత్సాహముతో వచింప నిజమా నంచున్నదిబ్బిన్నకీ
ర్తిత్యాగంబగు కష్టనిష్ఠురమునర్థిం దెచ్చుకొంటిన్గదా.

నిరుపమనిత్యసత్యవ్రతుల కిట్టి దుర్గతికలిగిన నింకేమిపలుకుట కేమియాధారమున్నది ? దైవమా ! నిజముగా సత్యమందలి విశ్వాసమే నన్నింతటియవస్తకుఁ దెచ్చుట వాస్తవమగునా ? (యోచించి) లేక మఱేమనవలయును.

తే. గీ. గురునియాజ్ఞనుల్లంఘించి పరమహితము
సత్యమనిత్రిశుద్ధినిఁగ్రియాచరణభక్తి
తత్పరున కిటిశిక్ష విధాయకంబె
సత్యమా! నీ మహిమమిట్టి చందమెకద.

(మరల యోచించి చెంపలువేసికొనుచు) ఆహా ! పాపముపశమించుగాక. పాపముపశమించుగాక. ఎంతటిపొరపాటు, ఎట్టివిస్మృతి.

తే. గీ. సకలమైనపరీక్షలు సత్యవంతు
లైనవారికేఁగాక మాయకులకగునె
జాతిరత్నములకుఁగాక సానబాధ
గులకరాళ్ళ కెన్నండేని కలుగఁగలదె ?

(ఎదపైఁ జేయిడి సర్దుకొనుచు) హృదయమా! ధైర్యమును విడువకుము. అదియే జీవితమునకు ముఖ్యమగు సమయముగాన దెప్పరిలుము.

వామ— దానవేంద్రా! యేమియోచింతువు? మా కింకొక యడుగు మేర నేల రావలయు వినియున్నావా?

బలి—సర్వనియంతవగు నో శ్రీమన్నారాయణా! నీకృత్య మిట్టిదని నిరూపింప బ్రహ్మాదుల కలవికాదన నే నెంతవాఁడ దండ్రీ! న న్నింకను బరీక్షింతువా? విమర్శింతువా? నీదయారసమిట్లున్న నే నేమనఁగలను, గాని నామనోనిశ్చయమును వినుము.

చ. అరయసమస్తసంపదల ♩ కంతముగల్గిన గాని లోకభీ
కరగతి దేవదానవ నికాయ మనిస్థలపడ్డఁగా ని దు
ర్భరతమకాలపాశహతిఁ ♩ బ్రాణములూడ్చినగాని సుంతయుఁ
వెరువనుమాటఁ దప్పుకొన ♩ భీతిలుచుఁ గలలోననేనియుఁ.

మీకొప్పుకొన్నరీతిని భూమి నిచ్చినగాక వేరువిధమున రుణవిముక్తిఁ గాంతునా? పొరపాటువడకుండ నన్ను బద్ధుంజేసి రుణము దీర్చుకొనఁ జూచితివి. నా కిది సంతోషమే కాని సంతాపమునకు దావులేదు. పరమాత్మా! సత్యాన్వేషణమున మాత్రము మదంతరంగ మానందసముద్రమున మునిఁగి తేలుచున్నది.

ఆ. వె. త్యాగసిద్ధికలుగ ♩ సకలము బ్రీతినీ
కిచ్చి ధన్యతముఁడ ♩ నే నగుదును
కిరణజాలమెల్ల ♩ ధరణి కర్పణఁజేసి
విమలుఁడై వెలుంగు ♩ ద్యుమణి యట్లు.

ఉ. కావున భార్గవీప్రముఖ ♩ కంజభవామరసేవ్యమై విరా
గావృత నిర్మలాత్ములగు ♩ నట్టి మునీంద్రుల కెల్ల భావ్యమై

పావనమైతనర్చు తవపాదము నాశిరమందుఁజేర్చి యో
దేవ! రుణంబుఁదీర్చుకొని తృప్తిగ బంధవిముక్తుఁ జేయవే.

(అని శిరమునుజూపి వంచుచున్నాఁడు.)

ప్రహ్లా—ఆహా! సర్వేశ్వరా! మాకన్నులు నేఁ డెంతటిసార్థకత నొందు చున్నవి. నీచర్యలు నీ ప్రేమాస్పదులగువారికిఁ దక్క నితరు లెంతటివారికైన దుర్భేద్యములును, దురవగాహములు నగును గదా? తండ్రీ! చుక్కల లెక్కఁబెట్టనెంచుపాపనివలె నాబోటి యసమర్థుఁడు నీ సంకల్పకల్పన మన్వేషించుట హాస్యాస్పదమే. కాని యుత్సాహ ముపేక్షింపనీకున్నది. క్షమింపుము. సర్వ సాక్షివగు నీ వీబలి నింతకాల ముపేక్షించి యిపు డింతటి మహా భాగ్య మనుగ్రహించుట కెంతదూరము జూచినను మహాద్భు తార్థము లెన్నో పరంపరలుగ దోచుచున్నవి. అవిట్టి వట్టివని తెల్ప స్వతంత్రము నాకులేదు. కాని,

నార—(వారింపుచు) నీవుగాదు నాకుఁదోచిన యర్థమును వెల్లడింతు వినుము.

సీ. కల్లుసారాయి మత్తల రిఁజేయించి
విడిపోవు నొకపూట వేళఁనుంచ
అభినిగంజాయి మత్తన్నిటిఁగనిపట్టు
తెలివికిఁ జలనంబు గలుగఁదొలఁగు
ఉద్యోగపదవి మత్తారుకష్టసుఖములఁ
గనివిననీకు తాఁ జనినదాక
ప్రాభవమత్తు స్వపరనాశమైనను
వదలుననుచుదెల్ప వశముగాదు

తే. గీ. అం దితఁడు త్రిలోకపదవి నందినాఁడు
మోహనాహంకృతులమత్తు లాహరింపఁ

బడుననుచు నిట్లకారణ । పరమకృపను
హరి బిరుదుఁజూపిఁ గడుధన్యుఁ । డయ్యెనితఁడు.

వామ—(చిరునవ్వు నటింపుచున్నాఁడు.)

(తెరలో కలకలానంతరమున)

ఆహా! శ్రీమన్నారాయణా! కరుణాభరణా!

ఆ.వె. ఆడితప్పఁబోక । యాచార్యవరునాజ్ఞ
గూడధిఃకరించి । పోడిమిఁజెడి
తుదకు సర్వమిచ్చి । దోసిలొగ్గినదాత
నిట్టి బంధనములఁ । గట్టనేల ?

బ్రహ్మ—ఆహా! వింధ్యావళీదేవి యరుదెంచుచున్నది.

దేవతలు—(తమలో) ప్రతివ్రతలన్న (వామనుని జూపుచు) నీమహాత్మునకు పరమాభిమానము. ఇఁకగార్య మెట్లునడచునో ?

వింధ్యావళి—(ప్రవేశించి) అయ్యా వటురూపా !

ఆ.వె. ఆడితప్పఁకబోక (అనుపద్యము జదువు చున్నది.

బ్రహ్మ—అగును మహాత్మా! ఈయమప్రశ్నము సమ త్తరహేతుదాయకమై యున్నది. మరియు నీబలిబంధనమునుగూర్చి యనేకుల హృదయములు శంకింపుచున్నవి.

ఆ.వె. తోయకణముగాని । తులసీదళముగాని
భక్తి నీకొసంగ । ముక్తుఁడగును
నీవు గోరినట్లు । నిఖిలంబొసంగిన
త్యాగి బద్ధుఁడెట్లు । గాఁగలండు.

వామ—(చిరునగవున) ఓహెూ బ్రహ్మాదిదేవతలారా! ప్రహ్లాదనారనారదాది భాగవతోత్తములారా! వింధ్యావళీమొదలగు పతిప్రతలారా ! నాయొక్క యభిమతమును నిశ్చలచిత్తముతో నిజవిమర్శనజ్ఞానపూర్వకముగ గ్రహింతురుగాక.

తే.గీ. ఎవనిఁ బ్రేమమీఱ ననుగ్ర ♦ హింపనెంతు
నతని సంపత్సమృద్ధినే ♦ నపహరింతు
సంపదయును మత్తతగల ♦ జడుఁడుసుంత
నిజము గనలేఁడు వినలేఁడు ♦ నెగడలేఁడు.

సామాన్యముగ శక్తిహీనుఁడే తన్ను మించినవాఁడులేడని గర్వమునఁ జెడుచుండ విత్తవయోరూపజన్మకర్మ విద్యాబలైశ్వర్యవంతుఁడగు వాఁడెట్లు సత్యమన్వేషింప సమర్థుఁడగును? సంసారసాగరపతితుఁడై దురాశాతరంగపరంపరాభిఘాతముల స్రుక్కి యుక్కిరిబిక్కిరి గొనుచు తెరపిఁగానక భార్యోపభార్యాదిరూపక సుడిగుండములఁబడి యడుఁగంటుచు సుతబంధుసోదరాది క్రూరగ్రాహపీడితుఁడై యధోగతినుండి మరలఁగల సమర్థుఁడెన్నటికిని గాలేఁడు. సరికదా ? కామక్రోధలోభాది శత్రుసముదాయమును కేవల మిత్రులుగాభావించి నరకమార్గముల ననుకరించి ఘోరదుఃఖదావదహనున కింధనప్రాయుఁడై చెడునుగాని ముక్తుఁడెన్నంటికిఁ గాలేఁడు. బంధములనఁ గామక్రోధలోభములే వాని నుండి విరక్తుఁడగుటే ముక్తిపథ మనుకరించుటగును.ఇఁక నీసత్యవ్రతుఁడగు బలిని బధించుటకు హేతువడిగిరి కావున వినుఁడు.

కం. జీవన్ముక్తున కైనను
వావిరిఁ దన్నాశ్రయించి ♦ వాసనలుండున్
బోవఁగలేవవిదేనికిఁ
గావుననవి నేనపోవఁ ♦ గాఁజేయవలెన్.

ఇంతులకే త్యాగసిద్ధుఁడని మీరనుకొనుచున్నబలి నిట్లు బంధించితి. మద్భక్తాగ్రేసరుఁడునగు ప్రహ్లాదవంశజుఁడై నను యాసురగుణములవిడువక దేవతావిరోధియై యున్నంతకాల మితనికి నేనుగూడ విరోధినై దేవపాక్షికముగ బలిని చతురుపాయంబులఁ బారనడచితిని. కొంతకాలము

నకు భాగవతరక్తగుణ ప్రభావమున దేవపక్షపాతిగ నేనుంటకుంగలసత్య మన్వేషించి నన్ను దేవతలెట్లో తానుగూడ వశపరచుకొనం గృతనిశ్చయుండై మత్ప్రియతమమగు సత్యవ్రతానురాగమున దాను శక్తివంచన లేక చరింపుచు స్వసంఘసంసారము నట్లే చేయుచునడిపింపుచు నిబంధనలం గల్పించుకొని జాగరూకుండై త్రైలోక్యపాలన మొనర్పుచున్నాండు.

బ్రహ్మ—ఇప్పుడితని కేవాసనలుండెను ?

వామ—మహేంద్రపదవియం దనురాగమును దేవతలయం దమితద్వేషమును యిట్టిరాగద్వేషములలో దేనింగాని విడువలేకున్నాండు గాన లోభముగూడనున్నది. ఈ కామక్రోధలోభవాసనలే నరకమార్గ ప్రధానఫలములు గావున వాటినెట్లులైన హరించి నిర్మలాత్మునిం గానొనర్చి నిత్యానందముం బ్రసాదింప ముఖ్యముగ బలికోఱకును పిదప దేవకార్యముం గూడ నున్నదనుకొనియు నేనీరూపమున నవతరించి వాసనానిర్మూలన మొనర్ప సర్వము హరించితిని.

బ్రహ్మ—సత్యవ్రతుని వాసన లంటియుండునా ?

వామ—అందఱు నతని సత్యవ్రతుండనుకొందురు గాని, నే నిదివరకను కొనలేను. నే నిక సత్యవ్రతుడనక తప్పదు.

బ్రహ్మ—ప్రేమము గాఢమై సత్యమందున్నం జాలదా ?

వామ—గాఢమెట్లగును ? అంతశ్శత్రువర్గవాసనలున్నవికదా ?

బ్రహ్మ—సత్యభక్తి కలదుగదా ?

వామ—తెలిసియుండియు లోకోపకృతికడిగెదవుగాన వినుము. బలిసత్యమందు భక్తికలవాండెప్పుడైనాండో యపుడే నే నాతనియందలి విరోధభావము విడనాడితిని. సత్యమను తత్వము నాకర్షించి

మెప్పుడతఁడు దనలో దావిడి నిల్పుకొనియెనో యపుడే నే నిట్లతనికి లొంగి యాచింపవచ్చితిని.

బ్రహ్మ—యాచించి సర్వము హరించితిరి. పైగా పాశములచేత బంధించితిరి.

వామ—నిశ్చయమే. నేహరించిన వింకు సర్వమేమున్నదంకువు ? స్వర్గపాలనమందు కామమొకటి, దేవతలయందలి ద్వేషము మరియొకటి, ఈ రెంటినే హరించినపుడే లోభ మభావమైనదిగాన యిప్పుడు నిజముగా సత్యవ్రతుఁడైనాఁడు.

(తెరలో)

సత్యము ! సత్యము ! సత్యము !

వింధ్యా—ఇంద్రత్వమందలికామలోభములుగాని, దేవతలయందలిద్వేషభావమునుగాని, ప్రస్తుతము నాభర్తకులేవు తండ్రీ ! లౌక్యము ననుసరించి పైకి నిమిత్తమాత్రము వానిననుకరించినట్లు నటించినాఁడు. అంతరంగమందు సమానప్రతిపత్తినే నెలకొల్పియున్నాఁడు. నేను చక్కఁగా యెఱుఁగుదును.

వామ—మానినీమణీ ! నిమిత్తమాత్రము బైకి కామక్రోధాములనతఁడనుకరించినాఁడు. నేనుగూడ నిమిత్తమాత్ర మాశత్రుగుణవాసనలాహరింప నిట్లువటురూపమున నటించి లొంగియాచించితి.

వింధ్యా—చిత్తము. హరించితిరి. సరే బద్ధునేలచేసితిరి ?

వామ—దేహాభిమానమును హరించుటకు.

వింధ్యా—బ్రహ్మాదులకగోచరమగు నీకృత్యములకర్థము నేఁగ్రహింపజాలకున్నాను తండ్రీ !

వామ—అందరెఱుఁగుటకే నే నవతారమెత్తవలసివచ్చినది. చూడు. సామ్రాజ్యమంతయు తృటిలోనే హరించుటకు బడుగునైతినని దిగు

లొంది మానుషస్తు లాత్మనాశ మొనర్చుకొందురుగాన దత్ప్రయ త్నమున నితనిబంధించితి. క్రియవలనదెలియుదువుగాక.

వింధ్యా—అడిగినంతులలోపములమన్నింపుము (నమస్కరించును.)

వామ--అమ్మా! నీకు లోపమే లేదు. చూడు. దేవతలయట్లు నీభర్తయప్పుడే స్వతంత్రమునుండి తొలఁగినాఁడు. అన్ని విధముల నెన్నియున్నను సర్వమునకు నన్నే గతియనుకొనుచు బరతంత్రులైయున్న దేవతలెట్లో నిమిత్తమాత్రముగ బైకిగనుపించుచున్న, గుణలోపము నాచే హరింపఁబడి నీభర్తకూడనట్లే పరతంత్రుఁడైనాఁడు. చూడు మాదిత్యునివలెఁ దేజోమయుఁడై ముక్తిని బిడికిటఁ బట్టినాఁడు. నాయనుగ్రహపాత్రుఁడగువాఁడే నిత్యానందసుఖార్హుఁడు. వాని ప్రాకృతసంబంధమలినమంతయు నేన నయభయగతులహరింతును. నాకుఁదప్ప (ప్రాకృతము) మదీయలీలావిభూతి నితరులెవ్వరును భరింపలేరు. గావున మద్భక్తులగువారి సృష్టిస్థితిలయరూపములఁ బ్రకాశించుప్రాకృతవిభూతినెల్ల నేన హరించి నిత్యవిభూతిఁ బ్రసాదింతును. ఇందులకే నాకు శ్రీహరియను బిరుదమురాఁబడినది.

అందఱు—సత్యము. సత్యస్వరూపములగు భగవద్వాక్యములకు నిత్యమంగళములు కలుగుగాక.

వామ—బంధించుటెలయని యడిగితిరిగావున వినుఁడు. గురుధిక్కారియై సత్యమందు బద్ధకంకణుఁడుగానుండెనుగాన ఇదిగో మూడవయడుగుమేరభూమిక్రింద బలి జీవితమే గైకొనుచున్నాను. (అనిబలీంద్రునిశిరమునపాదము మోపుచున్నాఁడు.)

క. గురువరుని శాపవచనము

బరిగణనముసేయఁ బోక ప్రపరిభవమునకుఁ

వెరువక రణమిూఁగఁగ నీ
శిర మొగ్గితివెంతొ మేలు ♦ జేకూర్చుని దే.

బలీంద్రా ! రాహుముక్త రాకాశశాంకుంబోలి దోషదూరుఁడవై త్యా! సత్యసిద్ధియుతుఁడవు నైతివి (అని పాదముదీయును.)

అందఱు—(కరతాళముల నొనర్తురు)

బలి—ధన్యోస్మి ధన్యోస్మి. (బంధముల విష్ణుదూత విప్పును.)

వామ—ప్రహ్లాదా ! శుక్రుఁడేడి ? ఆతనిఁ బిలిపింపుము.

ప్రహ్లా—(విష్ణుదూతతో) స్వామి యాజ్ఞఁజెల్లింతురా?

దూత—(నిష్క్రమించును.)

వామ—బ్రహ్మాదిదేవతలారా ! ప్రస్తుత మిాబలిని—

కం. సుతలమున కనుపుదును ప్ర
స్తుత మితఁడట నుండవలయు ♦ సుఖముగ సావ
ర్ణి తటస్థించును మనువై
యితనిఁ బ్రతిష్ఠింతు నప్పు ♦ డింద్రత్వమునన్.

ఇంద్రత్వమం దపేక్షించియే శతాశ్వమేధము లొనరించినాఁడు గాః యాఫలమప్పుడు గాని యనుభవింపగలఁడు. అప్పుడు వలదన్నను తొలఁగిపోదు. సుతలమునకేగు టధోగతికదాయని యనుకొనవలదు.

మ. సుతలంబన్న నలంతికాదు సురలోచ్చోనుండ వాంఛింతురే
వెతలున్గావఁగరావు మానుకటఁ దో ♦ ర్వీర్య ప్రతాపాఢ్యులౌ
దివిజుల్గొల్వఁగ భవ్యసౌఖ్య విభవాళిక్యంబుశోభిల్లు మం
డితహర్మ్యంబుల స్వేచ్ఛనుండు బ్రభుమాళిక్నోన్మదితస్వాంతుఁడై

బ్రహ్మ—జగదీశుని యాజ్ఞకు వేరెవ్వరు బలుకుదురు ?

శుక్రుడు—(ప్రవేశించి) లోకాధినాధా! అపరాధిని మన్నింపుము (దో లొగ్గును.)